*Issued on 15—10—1956*

2766



# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*THURSDAY, 1st DECEMBER, 1955.*

VOLUME XII — No. I.

## CONTENTS




PRINTED BY DAL[illegible]

FOR THE SUPERINTENDEN[illegible]

ANDHRA STATE[illegible]

[illegible]

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Thursday, the* 1*st December* 1955.

The House met in the Assembly Hall, Kurnool, at eleven of the Clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

*Standardization of wages in cement industry.*

5—

* 139 Q.—Sri VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state the recommendations sent by the State, for the standardization of wages in cement industry, to the Central Government (1) minimum wages and dearness allowance, (2) conversion of dearness allowance with basic pay, (3) the basis for giving loans, and (4) the final orders of the Central Wages Board ?

The Hon. Sri D. SANJIVAYYA :—

The Government of India did not ask for the recommendations of this Government in respect of standardisation of wages in the Cement Industry. The question of sending any recommendations by the State Government did not therefore arise.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—ఉన్న పరిస్థితులలో standardization of wages నిర్ణయించాలని ప్రభుత్వం అనుకుంటున్నదా ? Central Government లో ఒక board ఉన్నదా ?

The Hon. Sri D. SANJIVAYYA :—Central Government లో Standardization of Wages Board వున్నది. ఆ Board వారు State లో కూడా యిటువంటి బోర్డును ఏర్పాటు చేయాలని చెప్పుచున్నారు. అటువంటి Board ఏర్పాటైనది. ఆ బోర్డువారు ఈ సమస్యను [illegible]

[1st December 1955

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, Andhra State లో కూడా ఒక బోర్డుఉన్నదని మంత్రిగారు సెలవిచ్చారు. ఆ Board పరిశీలిస్తుందని చెప్పారు. ఆ బోర్డుఏర్పడి ఎంతకాలం అయింది. ఆ పరిశీలన ఎప్పటికి పూర్తి అవుతుంది.

THE HON. SRI D. SANJIVAYYA :—ఆ బోర్డు ఏర్పడి ఎంత కాలం అయిందో నేను చెప్పలేనుగాని 20-6-55 తేదీన ప్రథమ సమావేశంకూడా జరిగింది. ఆ సమావేశంలో కొంత చర్చించాము, గాని తుదినిర్ణయాలకు రాలేదు.

SRI A. KALESWARA RAO :—ఆ Board సభ్యులపేర్లు చెప్ప గలరా ?

THE HON. SRI D. SANJIVAYYA :—

1. Sri A. Ramamurthy, B.A.B.E., A.I.M.E.
   Deputy Chief Inspector of Factries of Andhra,
   common representative and Chairman of the Board.

2. Sri V. Ayyadurai Iyer,
   Business Manager,
   Andhra Cement Company Ltd.,
   Vijayawada.

3. Sri M. V. Betrabet,
   Manager, Krishna Cement Works,
   Mangalagiri,
   Representative of Managements.

4. Sri S. V. Subba Raju,
   General Secretary,
   Andhra Cement Company Employees Union,
   Vijayawada.

5. Sri N. V. Rangarao,
   President Krishna Cement Works Employees Union,
   Thadepalli.
   Representative of Workers.

SRI M. NAGI REDDI :—ఈ సిమెంటు పరిశ్రమల సందర్భంలో 1954 వ సంవత్సరములో అఖిలభారత త్రైపాక్షిక కమిటీ సమావేశం ఒకటి జరిగింది, కేంద్రప్రభుత్వ పారిశ్రామిక మంత్రికూడా పాల్గొన్నారు. దానిలో కొన్ని

resolutions pass చేశారు. Cement contractship 1956 లో రద్దుచేయాలని, ఈ లోపల company employees కు ఏ విధంగానైతే వేతనాలు యిస్తున్నారో, బోనసుగాని, వేతనాలుగాని dearness allowance గాని medical facilities గాని, ఇలాంటి వన్నీ కూడా contractors అమలు పరచాలని చెప్పారు. Resolutions ఏకగ్రీవంగాకూడా pass చేశారు. కాని యింతవరకు కూడా అమలు పరచటంలేదు. కాబట్టి దానిని వెంటనే అమలుపరచేందుకు ప్రభుత్వం ఏమైనా చర్యతీసుకొంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—శ్రీ నాగిరెడ్డిగారు చెప్పిన విధంగా Government of India వారు ఏర్పాటుచేసిన ఒక సమావేశం హైదరాబాద్‌లో 24, 25 తేదీలలో మార్చి 1954 వ సంవత్సరంలో జరిగింది. ఆ సమావేశంలోనే State Wages Standardization Board పెట్టుకొన్నారు. ఆ బోర్డు ద్వారానే పరిష్కరించాలని అనుకొంటున్నాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇప్పుడు Company rates ఏమి ? Piece meal workers కు కూడా విధిగా dearness allowances తో ఇచ్చేందుకు ప్రయత్నంచేస్తారా ? దానివిషయమై ఇదివరకు ఒకసారి strike కూడా జరిగింది. అప్పుడు ఆలోచనకువచ్చింది. అంగీకారం తెలిపింది. ఆ విధంగా జరిపించడానికి ఇప్పుడు ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Minimum wages and dearness allowances, amalgamation of a part of a dearness allowance and basic wages and principles for payment of bonus అనే ఈ three objects ఉన్నాయి. బోర్డువారు చర్చించారు. తుది నిర్ణయాలకుమాత్రం రాలేదు.

SRI M. NAGI REDDI :—ఈ wages standardization తరువాత నిర్ణయించవచ్చు అనుకోండి. Company వాళ్లు కార్మికప్రతినిధులు Government ప్రతినిధులు company employees కు జీతాలు సెలవులు ఇప్పుడే విధంగా ఇస్తున్నారో ఆ విధంగా contract కూలీలకుకూడా యివ్వాలని కోరారు. అది అమలు పరచడానికి ప్రభుత్వం చర్యతీసుకొంటుందా అని నేను అడుగుతున్నాను ?

THE HON. SRI D. SANJIVAYYA :—నాదగ్గర ఉన్నటువంటి కాగితాలలో నాకేమీ తెలియడంలేదు. కాని విచారిస్తాను.

*Quarters to the employees of Andhra Cement Company.*

6—

* 172 Q.—SRI M. NAGI REDDI : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether it is a fact that the Andhra Cement Company, had not yet given the quarters constructed about one year back, to the employees of the company; and

(b) if so, the reasons therefor ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) No, Sir.

(b) Does not arise.

SRI M. NAGI REDDI :—'No' అని చెప్పారు. ఇవ్వలేదనా మంత్రిగారు చెప్పేది. అర్థంకావడంలేదు. అయితే, అందులో ఇంతవరకు కూడా, ఇవ్వనటువంటివి ఉన్నాయి. మొన్న నీ మధ్యనే ఈ ప్రశ్న వ్రాసినప్పుడు ఇవ్వలేదు. ప్రశ్న వ్రాసిన తరువాత 50 ఇండ్లు ఇచ్చారు. ఇండ్లన్నీకూడా కురుస్తున్నాయి. ఉండడానికి వీలులేదు. కాబట్టి వెంటనే వారికి ఆదేశం ఇచ్చి వాటిని బాగు చేయించే టటువంటి ప్రయత్నం చేస్తుందా ప్రభుత్వం ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇప్పుడు కట్టినవికూడా 20 ఇండ్లు; ఈ 50 ఇండ్లుకూడా వారికి ఇవ్వాలని management వారి ఉద్దేశ్యం అయితే labour ఇస్తామన్న rent కొంత తక్కువగ ఉన్నది. వారిద్దరు ఒక agrement కు వచ్చి 1-10-55 నుంచి వాటిని ఆక్రమించి ఉపయోగించడానికి అంగీకరించారు.

SRI V. VISWESWARA RAO:—అధ్యక్షా, Management, కార్మికులుఇద్దరుకూడా ఒడంబడి కకు వచ్చి ఉపయోగించుకొంటున్నారు. ఆ ఒడంబడిక ప్రకారం అద్దె ఎంత నిర్ణయించారు? ఆ నిర్ణయాన్ని Government కూడా అంగీకరించిందా ?

THE HON. SRI D. SANJIVAYYA .—ఈ నిర్ణయాన్ని Government అంగీకరించవలసిన అవసరంలేదు. That the occupants of the tenaments sould forego house rent allowance now being

paid to them in view of the monthly rent of 10% of the basic wages of the occupying tenants subject to a maximum of rupees 7 and minimum of 3 rupees ఆ సేదానికి ఒప్పుకున్నారు.

SRI M. NAGI REDDI :—ఈ ఇండ్లన్ని కేంద్ర ప్రభుత్వ సబ్సిడీలతో కట్టబడిన ఇళ్లు. ఇదివరకు వాళ్ళకు ఇచ్చేటటువంటి house rent allowance పోవటంతో పాటు ఇంకా జీతంలో 10 వ వంతు కూడా నివసించాలని చెప్పారు. అది కాకుండా house rent allowance ఇవ్వగా దాని క్రింద నే ఈ ఇండ్లు ఇచ్చేట్లు ప్రభుత్వం ఏమైన ఆదేశిస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Government of India 50% సబ్సిడీ ఇచ్చిన మాట వాస్తవమే. అయితే ఈ విషయాన్ని కూడా పరిశీలించే దానికి allotment committee అనేటటువంటి ఒక committee ఏర్పాటుచేసి ఆ committee నిర్ణయం ప్రకారం చేస్తున్నారు.

*Diesel power station at Rentachintala.*

25—

* 40 Q.—SRI M. NAGI REDDI : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state whether there is any proposal to construct a Diesel Power station this year at Rentachintala, Palnad taluk, to supply electricity for Palnad taluk ?

THE HON. SRI D. SANJIVAYYA :—

The answer is in the negative. In lieu of the Diesel power station originally proposed for the electrification of Rentachintala town a scheme for extension of supply from Macherla Diesel power station to Rentachintala Town is under consideration of the Government.

Sri M. NAGI REDDI :—ఇదివరకు power stations కట్టాలనే list లో రెంట చింతల కూడా ఇచ్చారు కాని ఇప్పుడు మాచెర్లలో నందికొండ, నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం దృష్టిలో పెట్టుకొని దానిని ఆపు చేశారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు మాచెర్లకు ప్రాధాన్యం ఎక్కువవచ్చింది. మాచెర్ల అవసరం కాదనుకొన్న రోజులలో రెంటచింతల ముఖ్యం అనుకొని రెంటచింతలలో పెట్టారు. 5 మైళ్ళకు, 10 మైళ్ళకు ఒక power station పెట్టరు. అక్కడనుంచి ఇక్కడకు ఇక్కడనుంచి అక్కడకు connection ఇస్తారేగాని 5 మైళ్ళకు 10 మైళ్ళకు ఒక power station పెట్టడం ఎక్కడా ఉండదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడు ప్రక్కన గ్రామాలకు కూడ supply చేయడానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నదా !

THE HON. SRI N. SANJEEVA REDDI :—మొదట రెంటచింతలకు connect చేస్తారు. తరువాత, natural గా development వచ్చేటప్పటికి, అంటే నందికొండ power వచ్చేటప్పటికి, lines ready గా పెట్టడానికి slow గా diesel stations పెట్టి temporary గా ఇస్తూయుంటే, అప్పటికి తయారుగా ఉంటామనే ఉద్దేశంతో slow గా extend చేస్తారు. ఈ power stations మొదట రెంటచింతలకు connect చేస్తారు.

*Average gross revenue per month from electricity.*

31—

* 56 Q.—SRI R. NATHAMUNI REDDI : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) Average gross revenue per month from 1st March 1954 to 28th February 1955; and

(b) from 1st March to 30th April 1955 ?

THE HON. SRI D. SANJIVAYYA :—

It is presumed that the Hon. Member wants information about the Electricity Department. If so the answers are as follows :—

(a) Rs. 9,85,665.

(b) Rs. 13,14,138.

గౌరవనీయులైన సభ్యులు ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటును గురించి అడుగుతున్నాడనుకుంటాను, జవాబులు, ఇలావున్నాయి.

(a) Rs. 9,85,665.

(b) Rs. 13,14,138.

Sri P. RAJAGOPAL NAIDU :—ఈ rates హెచ్చుగా ఉన్నవి గనుక rates ఏమైనా తగ్గించడానికి ప్రయత్నము ఉన్నదా ?

THE HON. SRI D. SANJIVAYYA :— Rates కొంచెము పెరిగినమాట వాస్తవమే. కాని, ఈ పెరిగినదికూడ మనము ఇచ్చుకోవలసిన వడ్డీకి చాలదు. మనము తెచ్చుకొన్న దానికి వడ్డీ గిట్టాలంటే ఇంకా చాలా పెరగవలసిన అవసరము ఉన్నది. కాబట్టి ఈనాడు వ్యవసాయానికి సంబంధించినంతవరకు, ఇవి తగ్గించడానికి వీలు కాదేమో అనుకొంటాను.

Sri V. VISWESWARA RAO :—గతసారి శాసనసభలో ఈ విషయము వచ్చినప్పుడు తప్పకుండా తగ్గించే విషయము ఆలోచిస్తామని చెప్పారు. రైతులకు సంబంధించినంతవరకు దీనిని పునర్విచారణ చేయిస్తారా మంత్రిగారు?

THE HON. SRI D. SANJIVAYYA :— వ్యవసాయానికి సంబంధించినంతవరకు ఆలోచిస్తామని అనుకొన్నారు. కాని ఇంకా అది final shape తీసుకొన్నట్లులేదు. త్వరగా తీసుకొంటారు.

Sri C. SUBBARAYUDU :—ఈ Department లో ఆదాయాలు ఉన్నవి. కాని ముందు 10% minimum return ఉండాలన్నది ఇప్పుడు 12% కు పెంచినదానివల్ల చాలాచోట్ల, thickly populated areas లో కూడ pending schemes చాలా నిలబడి ఉన్నాయి. అవి రావడానికి అవకాశము ఉండదు, కాబట్టి rate తగ్గించడానికి ప్రభుత్వము చర్యతీసుకొంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—దీనికి ప్రత్యేక ప్రశ్న వేయవలసియుంటుంది. ఈ విషయము గురించి చాలామంది represent చేశారు. సుబ్బరాయుడు గారు, ఇంకా కొంతమంది శాసనసభ్యులు వ్రాతపూర్వకముగా ముఖ్యమంత్రి, మొదలైనవారికి ఇచ్చారు. ఇది ఆలోచించి ఏమిచర్య తీసుకోడానికి వీలుఅవుతుందో ఇప్పుడు చెప్పలేను.

### *Number of drinking water wells for Harijans.*

**35—**

*** 116 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—**

(a) the number of drinking water wells sunk for the Harijans for the year 1954 in the State, and

(b) the amount spent on them by the Harijan Welfare Department ?

THE HON. SRI D. SANJIVAYYA—

A statement* showing the number of drinking water wells sunk for the Harijans in 1954, and the amount spent on them is placed on the table of the House.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ బావులు త్రవ్వించే విషయములో అనేకబావులపని మధ్యలో ఆగిపోయిందనే సంగతి ప్రభుత్వానికి తెలుసునా. తెలిసిఉంటె, వాటిని వెంటనే ఇష్టమైన తీసుకొని పూర్తి చేయడానికి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :— అటువంటివి specific గా ప్రభుత్వదృష్టికివేస్తే తప్పకుండా అవి త్వరగా complete చేసేదానికి ప్రయత్నం చేస్తాము.

SRI P. SREERAMULU :—హరిజనవాడలలో త్రవ్వించే బావులకు ఒకవంతు స్థానికబోర్డులుగాని, హరిజనులుగాని ఇవ్వాలనేటటువంటి నియమం ఉన్నది. ఈ ఖర్చు పూర్తిగా ప్రభుత్వమే భరిస్తుందా ?

THE HON. Sri D. SANJIVAYYA :—ఇదివరకు పూర్తిగా ప్రభుత్వమే భరించేది. ఇక ముస్ముందు ఎవరైతే బావికావాలని కోరుతారో, వారు కొంత భరించవలసియుంటుంది.

SRI P. VENKATASUBBAYYA :—అధ్యక్షా, rural water supply scheme క్రింద కడపజిల్లాలో 67 బావులు త్రవ్వించారు. Harijan Welfare Department క్రింద ఏమిలేదు. కాని విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలలో rural water supply scheme క్రింద ఆ బావులు త్రవ్వకుండా Harijan Welfere Department క్రింద త్రవ్వబడినాయి. కారణమేమో తెలియజేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ప్రత్యేక కార్యక్రమమేమి లేదు. ఎట్లు వీలుపడితే, అట్లు చేస్తాము.

*Vide appendix at pages infra.

Sri B. APPALASWAMI :—ఆ విధంగా చేయడమంటే, తూర్పు గోదావరిజిల్లాలో నూతులు అక్కరలేదనుకొంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అనే భావించవలసి వుంటుంది.

Sri A. VENKATARAMA RAJU :—Repairs కావలసినటువంటి బావులు ప్రభుత్వదృష్టికితెస్తే పరిశీలిస్తామన్నారు. పనిచేయకుండా ఉన్న కొన్ని సందర్భాలు ప్రభుత్వదృష్టికి వచ్చినవా ? వస్తే, ఏమి Action తీసుకొన్నది ?

THE HON. SRI D. SANJIVAYYA :—కొన్ని వచ్చాయి. వాటి విషయము శ్రద్ధవహించి చేస్తున్నాము. ఇంకా కొన్ని చేయకుండా ఉండవచ్చు. అవి మరల ప్రత్యేకంగా మా దృష్టికితెస్తే చేస్తాము.

Sri N. SRINIVASA RAO :—ప్రతిజిల్లాలోను Harijan Welfare శాఖ నూతులు చూడడానికి, Labour శాఖ నూతులను చూడడానికి, ప్రత్యేకంగా Overseers ఉన్నారు. కాని కొన్ని బావులుకట్టిన 2, 3 రోజులకే పడిపోయినాయి. కనుక, ఈనూతులపని గురించి పరిశోధనచేయించి ప్రతిసంవత్సరం Reports సేకరించడానికి ప్రభుత్వము కృషిచేస్తుందా.

THE HON. SRI D. SANJIVAYYA :—మూడురోజులకు పడిపోయిన బావిని నేను ఎన్నడూ చూడలేదు. కాని అక్కడ ఎవరికైతే ఆబావి నిర్మింపబడుతున్నదో, వాళ్లుకూడ అక్కడ అపని కొంచెము చూస్తూవుండి, కంట్రాక్టర్లు బాగా పనిచేసినట్లయితే అటువంటిదేమి జరుగదు.

SRI P. RAJAGOPAL NAIDU :—ఇప్పుడు sanction చేసిన బావులను ఇదివరకు పూర్తిచేయకుండా ఉంటే, contractors మీద ఎట్టి చర్య తీసుకొంటారండి.

THE HON. SRI D. SANJIVAYYA :—గట్టిచర్య.

SRI N. K. LINGAM :—నందికొట్కూరు తాలూకాలో Harijan Welfare Department వారు కొన్ని బావులు త్రవ్వారు. వాటిలో పూర్తిగా నీరు లేకుండా పోయింది. అటువంటివాటిని దర్యాప్తు చేయించి లోతుగా త్రవ్విస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—తప్పకుండా.

1st December 1955]

SRI C. SUBBARAYUDU:—మంచినీటిబావులు త్రవ్వించే విషయంలో కొన్నిచోట్ల పైన 10, 15 అడుగులలో ఉప్పునీరుగా ఉండి, లోతుగా త్రవ్వినట్లయితే మంచినీళ్లుకూడా పడినాయి. కనుక యీ బావులుత్రవ్వడం నిర్ణయించేసే ముందు sufficient depth వరకు ఒక boring చేసి మంచినీళ్లు పడతాయా లేదా అని చూసినతరువాత నిర్ణయంచేసి ఆ విధంగా మంచినీరు పడేచోట్ల బావులు త్రవ్వడానికి పూనుకొంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—మీరుచెప్పినసలహా బాగానే వున్నది. కాని, ఖర్చు ఎంతఅవుతుందో ఆలోచించి చూడవలసి యుంటుంది.

SRI P. VENKATASUBBAYYA :—హరిజన వాడలలో త్రవ్వేబావులను హరిజనేతరులకు contract యివ్వకుండా హరిజనులకే contract ఇస్తే బాగుంటుందేమో ఆలోచిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—హరిజనులకే కాకుండా ఏ పేటలో నివసించేటటువంటి హరిజనులకోసము ఆబావి ఉద్దేశింపబడినదో, వారే తీసుకోనేదానికి సిద్ధంగాఉంటె, అటువంటివారికి యిస్తున్నాముకూడాను.

SRI K. SUBBA RAO :—అంటరానితనము పోవాలని ప్రచారము చేస్తూవుండే ప్రభుత్వము ప్రత్యేకంగా హరిజనులకు బావులు త్రవ్వకుండా, ఉండేబావులలోనే అందరు నీరు తీసుకోనేటట్లు చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఉపాధ్యక్షులవారు ఉన్న గ్రామాలలో సవర్ణహిందువులకు ఉన్నటువంటి బావులలో నీళ్లు తెచ్చుకోడానికి హరిజనులకు ఏలాంటి అభ్యంతరములు లేకుండా చేసినట్లయితే, ప్రత్యేకంగా బావులు త్రవ్వము.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, మంత్రిగారు సభ్యులకు అందజేసినటువంటి list లో శ్రీకాకుళం జిల్లాలో Harijan Welfare Department వారు ఒక నుయ్యికూడ త్రవ్వినట్లులేదు. కారణమేమిటో సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Rural water supply scheme క్రింద 32 భావులు త్రవ్వారు. కాబట్టి Harijan Welfare Department వారు త్రవ్వలేదు.

SRI K. SUBBA RAO :—మంత్రిగారు చెప్పినట్లు ఉపాధ్యక్షులవారు తమ గ్రామాలలో చేశారు. అసలు ప్రభుత్వముయొక్క సిద్ధాంతము అంటరాని

తనము పోగొట్టవలెనని ఉన్నప్పుడు, ప్రత్యేకంగా వారికి బావులు త్రవ్వించడం, ప్రత్యేకంగా వారికి తగిన సౌకర్యాలు చేస్తూవుండడంవలన అంటరానితనము పోతుందని మంత్రిగారు అభిప్రాయపడతారా ?

THE HON. SRI D. SANJIVAYYA .—అభిప్రాయమేమో ఆదర్శంగా ఉంది. Ideals are good but we must face them practically.

Sri A. KALESWARA RAO :—అధ్యక్షా, హరిజనులు సాధారణంగా గ్రామానికి దూరంగాఉంటూఉంటారు కాబట్టి, వాళ్లను ఆ వూరికివెళ్లి నీరుతెచ్చుకోమ్మంటె కష్టంగా ఉంటుంది. కాబట్టి హరిజన బావులని అనకుండా, ఎక్కడ త్రవ్వినాసరే అందరికి ఉపయోగిస్తాయిఅనే సిద్ధాంతంమీద, బావులు త్రవ్వించి. అందరు ఉపయోగించేటట్లు చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ప్రభుత్వము త్రవ్వించేటటువంటి బావులు కాబట్టి, వాటిలో ప్రవేశించి నీరు తీసుకోడానికి ఎవరికి ఏలాంటి అభ్యంతరంలేదు. ముఖ్యంగా బ్రాహ్మణోత్తములు అందరు హరిజనులకుగాను త్రవ్వబడిన బావులలో నీళ్లు తెచ్చుకొంటారని ఆశిస్తున్నాను.

Sri K. PUNNAYYA :—అధ్యక్షా, గుంటూరుజిల్లాలో 49 బావులు rural waters supply scheme క్రింద త్రవ్వారనిన్నీ, 37 బావులు Harijan Welfare Department క్రింద త్రవ్వారనియు చెప్పడం జరిగింది. కాని, ఆ న్యాయము శ్రీ కాకుళంజిల్లాకు ఎందుకు వర్తించలేదు?

THE HON. SRI D. SANJIVAYYA :—గుంటూరుజిల్లా అన్నివిధాలా అగ్రస్థానం ఆక్రమించుకొంటూయున్నది. కాబట్టి జిల్లాలో ఉండేటటువంటి జనాభా మొదలగునవిబట్టి ఆలోచించాలి. అంతేగాని, అక్కడేవో త్రవ్వించారు కాబట్టి ఇక్కడకూడ త్రవ్వించాలి అని అడగడం అంతసబబు కాదేమో అనుకొంటాను.

Sri G. RAMU NAIDU:—అది అన్యాయము. శ్రీ కాకుళంజిల్లాలోకూడ ఎందుకు వర్తించకూడదు? ఇకమీదనైనా ఆవిధంగా చేస్తారా?

THE HON. Sri D. SANJIVAYYA :—న్యాయము, అన్యాయము అని ఏమీలేదు. ఆయాజిల్లాయొక్క అవసరాన్ని, జనాభానుబట్టి అవన్నీ చూస్తూ ఉంటాము.

Sri G. RAMU NAIDU:—హరిజనులు గ్రామాలకు దూరంగా ఉంటారు కాబట్టి గ్రామాలకువెళ్లి నీళ్లు తెచ్చుకోవాలంటె కష్టంగాఉంటుంది. అందువల్ల,

హరిజనవాడనంతా గ్రామంలో చేరిస్తే బావులు దగ్గరగా ఉంటాయి కాబట్టి గ్రామాలలో హరిజనులకు ఇళ్లుకట్టించడానికి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—గ్రామాలలో ఉండేటు వంటి కొన్ని ఇళ్లను హరిజనులకు కేటాయిస్తే, ఆవిధంగా వారిని గ్రామంలోకి తీసుకు రావచ్చు.

SRI T. LAKSHMINARAYANA REDDI :—మంత్రిగారు practicalities దృష్టిలో ఉంచుకోవాలన్నారు. బాగానేఉన్నది. అయితే, హరిజన వాడలలోనే, మాలలు, మాదిగలు అని అంటున్నారు. మాదిగలకు త్రవ్వించినటు వంటి బావిలో మాలలు తీసుకోరు మాలలకు త్రవ్వించినటువంటి బావిలో మాదిగలు తీసుకోరు. కాబట్టి వారికి వేరువేరుగా త్రవ్వించే proposals ప్రభుత్వము ఆలోచిస్తారా?

THE HON. Sri D. SANJIVAYYA :—I entirely agree with my hon. friend there is untouchability among untouchables.

SRI V. KURMAYYA :—అస్పృశ్యతా నివారణ జరగాలంటే అగ్రజాతులవారందరు, మాలపల్లెలలో త్రవ్వినటువంటి బావులలో నీళ్లు తెచ్చుకొనే ఏర్పాట్లుచేస్తూ, అగ్రజాతులవారు త్రవ్వించుకొన్న బావులను పూడ్పించడానికి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—కూర్మయ్యగారు న్యాయ చట్టాన్నికూడ చదువుకొన్నారని అనుకొంటాను. Constitution గురించికూడ ఒకసారి ఆలోచించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri N. SRINIVASA RAO :—ఇప్పుడువున్న నూతులను పూడ్పించే విధానం లేకుండా హరిజనులు తోడుకునే బావులలోనుంచి నీరుతోడుకునే వారికి rebate ఇచ్చినాయిస్తే బాగుంటుందేమో ఆలోచిస్తారా ?

(No answer)

***Sri Vasudevan's report about the finances of the District Boards.***

80—

* 140 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state, the difficulties brought to

1st December 1955]

light by the report of Sri P. S. Vasudevan, appointed as Special Officer to examine the finances of District Boards, due to District Boards taking on commitments without regard to the obligation imposed on them by law ?

THE HON. SRI A. B. NAGESWARA RAO—

It is not known what the Hon'ble the Member has in mind when he refers to 'difficulties'. The difficulties disclosed by Sri Vasudevan's reports are just those arising from improvidence ; staff including school masters remaining without salary, contractors' dues outstanding, marked funds used up for unauthorised purposes and expenditure running in excess of income.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Unauthorised expenditure అంటే ఏమిటో చెబుతారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—రాష్ట్రములోవున్న పదకొండు జిల్లాబోర్డులకున్నూ వేరు వేరుగా వివరాలువున్నవి. ఈ వివరాలు అన్నీ చేరి ఒక రిపోర్టుగావున్నది. ప్రస్తుతము యివి అచ్చులోవున్నవి. అచ్చు పూర్తి కాగానే వీలయినంత త్వరలో సభ్యులకు అందజేస్తాను. వివరాలుచెప్పే విషయములో ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క మాదిరిగా unauthorised expenditure వున్నది. అది voluminous గా ఒక పెద్ద రిపోర్టుగావుంది. కాబట్టి, అచ్చు అయి రాగానే సభ్యులకు అందజేస్తామని చెబుతున్నాను.

SRI G. YELLAMANDA REDDI :—జిల్లా బోర్డుల పరిపాలనలో అనవసరముగా ఉపాధ్యాయులను దూరపుచోట్లకు transfer చేయడం, అనవసరమైన, అక్రమమైన విచారణలు జరపడం, దానివల్ల ప్రజాధనము దుర్వినియోగము కావడం జరిగింది. ఆ విధంగా చేసిన జిల్లా బోర్డు ప్రెసిడెంట్లమీద విచారణ జరపటానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఈ ప్రశ్నకు, వారు అడిగిన ప్రశ్నకు ఏమీ సంబంధము లేదు.

SRI N. P. CHENGALRAYA NAIDU :—మంత్రిగారు సమాధానము చెబుతూ, "unauthorised expenditure" అని అన్నారు. Un-

authorised అంటే, అది జిల్లా బోర్డుకే ఖర్చు పెట్టారా ? లేకపోతే యింకా దేనికైనానా ? వాటి వివరాలు తెలియజేస్తారా ?

జిల్లా బోర్డుల పరిపాలన విషయములో వాసుదేవన్ రిపోర్టు ప్రచురిస్తామని చెప్పారు. ఆదేమాదిరి యీ ప్రభుత్వము చేసేపనుల విషయములోగూడా, ప్రచురించుతారా ? అందుకు ఎవరినైనావేస్తే బాగుంటుందిగదా ! ఆ విధంగా చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—జిల్లా బోర్డుల మీద అధికారం ప్రభుత్వానికి, ప్రభుత్వంమీద అధికారం కేంద్ర ప్రభుత్వానికి వున్నది. అటువంటిది కేంద్ర ప్రభుత్వం చేస్తుందని నాఆశ. చేయాలనే నా అభిప్రాయముకూడా. దానికేమీ అభ్యంతరములేదు. Unauthorised expenditure అంటే, వచ్చే ఆదాయముకంటె హెచ్చు ఖర్చు జిల్లా బోర్డు శాంక్షను లేకుండా చేస్తే, అది unauthorised expenditure అని అంటారు. ఆయన జిల్లా బోర్డు ప్రెసిడెంటు చేశారు. నేను మునిసిపల్ చేర్మను చేశాను. Unauthorised expenditure అంటే ఏమిటో వారికి, నాకూ తెలియకపోలేదు.

Sri M. NAGESWARA RAO :— వాసుదేవన్ కమిటీ రిపోర్టును సభ్యులకు అందజేస్తామని మంత్రిగారు అన్నారు. జిల్లా బోర్డుల పునర్నిర్మాణము జరిగేలోగా కనీసము సభ్యులకైనా అంద జేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఈపూటకాదు, అది కొన్ని రోజులు పట్టుతుందని నేను మొదట్లోనే మనవిచేశాను.

Sri N. P. CHENGALRAYA NAIDU :—ఈ అసెంబ్లీ సొమ్ము మొత్తను మంత్రులు ఖర్చు పెటుతున్నారు. ఇది unauthorised కాదండీ ?

(No answer.)

SRI G. YELLAMANDA REDDI:—అధ్యక్షా, ఇందాక నేను వేసిన ప్రశ్నకు, దీనికి సంబంధములేదని మంత్రిగారు అన్నారు. అనేక సందర్భాలలో యీ జిల్లా బోర్డు పరిపాలనలో unauthorised expenditure జరుగుచున్నది. ఒక్కొక్కసారిగా ఏ రెండుమూడు వందలమంది టీచర్లనో మార్చి, జిల్లా బోర్డు డబ్బును దుర్వినియోగము చేసినప్పుడు, ప్రభుత్వము యీవిధమైన expenditure క్రమమైనదేనా అని విచారించి, క్రమమైన expenditure కాకపోతే, అప్పుడు ఆ ప్రెసిడెంటుమీద చర్య తీసుకోటానికి ప్రభుత్వానికి ఆక్షేపణ ఏమిటి ?

[1st December 1955

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అవిధంగా transfer చేయడము అంటే, అది administrative convenience అని అంటారు. అంతేకాని unauthorised expenditure క్రిందకు రాదు.

Mr. SPEAKER :—Highly hypothetical. The report is coming to you shortly. You can go through it.

Sri VAVILALA GOPALAKRIHNAYYA:-ఇందులో "without regard to the obligations imposed on them by law" అని వున్నది, అంటే impose చేసిన obligations ఏమిటి ? నేను కోరేది points గాని amount కాదు, వాటి details కాదు. ఆ points ఏమిటో చెబుతారా ?

THE HON. SRI A, B. NAGESWARA RAO :—అందుకనే నేను మొదట్లో చెప్పాను. జిల్లాబోర్డుల వివరాలలోకి వెళ్ళాలని అంటే ఒక్కొక్క జిల్లా బోర్డుకు ఒక్కొక్క విధముగా రిపోర్టు వున్నది. అందులో అక్రమముగాను, unauthorised గాను ఖర్చు చేశారు. కాబట్టి యిప్పుడు అది వెంటనే సభ్యులకు యివ్వాలంటే, వీలుపడదు. అదిచాలా పేజీలలో వున్నది. అచ్చుపూర్తి అయిరాగానే సభ్యులకు అంద జేస్తానని చెప్పితిని గదా.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—"Obligations imposed on them by law" అంటే యీ obligations లో చాలా తేడాలు వున్నవి. అందువల్ల జిల్లాబోర్డు తీర్మానము చేస్తే, అది authorised ? లేక unauthorised ? జిల్లాబోర్డు అవుతుందా ? హక్కుకాని ఖర్చుచేస్తే, అది law కు వ్యతిరేకముగదా ? ఈ రెంటిలో తేడాలు వున్నవి గనుక, యిక law కు వ్యతిరేకముగా ఆ ప్రెసిడెంట్లు చేసింది ఏమిటి ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Law కు వ్యతిరేకముగా ఒక్కొక్క జిల్లాబోర్డు ఒక్కొక్కరకముగా చేసినవి. వాటికి వివరాలు వున్నవి. అవి ఎట్లాంటివో జిల్లాబోర్డు ప్రెసిడెంటుచేసిన చెంగలరావు నాయుడు గారికి తెలుసు. సభ్యులకు తెలియదు అందుకు దయచేసి క్షమించాలి.

Sri PILLALAMARRI VENKATESWARLU :—అనేక మంది పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లను unauthorised గా ఖర్చుచేశారని dismiss చేయడం, వగైరాలు జరుగుతున్నప్పుడు అదేవిధంగాచేసిన, యీ జిల్లాబోర్డు ప్రెసిడెంట్లమీద విచారణజరిపి తగినచర్య తీసుకుంటారా ? ఆ విధంగా ఎక్కడైనా చర్య తీసుకోవటం జరిగిందా ?

THE HON. SRI A.B. NAGESWARA RAO : The Government have also issued strict orders to the Examiner of L.F. Accounts to keep a close watch on the financial administration of the District Boards and pursue all violations of law with a view ultimately to institute any surcharge proceedings against the members of the District Boards responsible therefor.

SRI N. P. CHANGALRAYA NAIDU :—అధ్యక్షా, జిల్లాబోర్డు సభ్యులుకూడ ప్రజలచేత ఎన్నుకోబడ్డారు. జిల్లాబోర్డు సభ్యులు ఏదైనా ఖర్చు శాంక్షనుచేస్తే, అందుకు జిల్లాబోర్డు ప్రెసిడెంటు చర్య తీసుకుంటారు. ఆ విధంగా చేస్తే, అది unauthorised కాదు. ఏదైనా ఖర్చు ప్రభుత్వం ఒప్పుకోనంత మాత్రాన అది unauthorised expenditure అని అనుకోవలసిన పనిలేదు. ఇక పోతే సభ్యులు ఎప్పుడైతే ఒకఖర్చును శాంక్షనుచేశారో, అది సక్రమంగా ఖర్చుచేసే బాధ్యత ప్రెసిడెంటుది. ఆవిధంగా చేయకపోతే, అది unauthorised expenditure అవునో, కాదో చెబుతారా ?

Mr. SPEAKER :—No body said it is unauthorised

Sri P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, డబ్బులేనిసమయములో యిష్టము వచ్చినట్లు ఖర్చుచేశారని అంటున్నారు. డబ్బులేనిదే, ఖర్చు ఎక్కడినుంచి తెచ్చి చేశారు ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ప్రభుత్వం యింతవరకు 46 లక్షల రూపాయలు loan గా గాని, grant గా గాని, advance చేసివున్నది.

SRI P. NARASIMHAPPA RAO :—ప్రభుత్వం unauthorised గా యిచ్చిందని అన్నారు. అటువంటి పనులు ప్రభుత్వం చేయవచ్చునా.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—జిల్లాబోర్డులను litigation లో దింపడంవల్ల, ముందుగా కొన్ని కంట్రాక్టరబిల్సు, ఉపాధ్యాయులకు యివ్వవలసిన జీతాలు యివ్వవలసి వచ్చింది. ఉపాధ్యాయులలో పేదవారు ఉంటారు కొబట్టి వారి భార్యాపిల్లలను పోషించుకోటానికి యిబ్బందిగా వున్నందున ప్రభుత్వం ఆ emergencyని meet చేయటానికి 46 లక్షలు జిల్లాబోర్డుకు advance చేసినది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—రిపోర్టు వచ్చిన తరువాత, దాన్ని సభముందు discussion కు పెట్టుతారా ?

1st December 1955]

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఆ విషయము తరువాత ఆలోచిస్తాము. రిపోర్టు మాత్రము సభ్యులకు అందజేయ బడుతుంది.

*Bridge across Chitravati at Gorantla.*

83—

* 32 Q.—SRI P. VENKATARAMANAPPA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government propose to construct a bridge at Gorantla, Anantapur district, over the Chitravati River ; and

(b) if so, when ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) and (b).—A proposal to include in the Second Five Year Plan the work of constructing a bridge across the Chitravati at Gorantla on the Kadri-Palasamudram Road at an estimated cost of Rs. 1 lakh is under consideration.

*Area Committee.*

84—

* 15 Q.—SRI S. NARAYANAPPA : Will the Hon. the Minister for Revenue be pleased to state whether the Area Committees were constituted under section 12 of the Madras Hindu Religious and Charitable Endowments Act ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

Under section 12 of the Act Area Committees were constituted in September 1951, in the Composite Madras State. Most of the Committees have now become defunct by efflux of time. The question of reconstituting them is under consideration.

SRI S. NARAYANAPPA :—ఈ కమిటీలను ప్రభుత్వమువారు ఎంత కాలములో నిర్మాణము చేస్తారు. త్వరలో వాటిని constitute చేసేదానికి చర్య తీసుకుంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ కమిటీలను constitute చేయడానికి కలెక్టర్లను, కమీషనర్లను పేర్లు అడిగాము. ఇంకా కొన్ని పేర్లు

కొన్ని ప్రాంతాలనుంచి రాలేదు. అవి బహుశా ఈ నెలాఖరులోగా పంపుతారని అనుకొంటున్నాను. అవి రావటముతోనే సాధ్యమైనంత త్వరలో ఈ కమిటీలను జిల్లాలలో ఏర్పాటుచేస్తాము.

SRI N. SREENIVASA RAO :—ఈ దేవాలయాల కమిటీలను పునర్నిర్మాణము చేసేటప్పుడు హరిజనులను వేయడానికి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :— సాధ్యమైనంత వరకు హరిజనులకుకూడా వాటిలో representation ఇవ్వాలనే ప్రభుత్వాభిప్రాయము.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, గతంలో ఈ కమిటీలో ఒకేపార్టీకి చెందినవారు ఉన్నారు. ఈసారిఅయినా జిల్లాలలోని పెద్ద మనుష్యులను అందరిని సంప్రదించి అన్ని పార్టీలవారిని వేయడానికి ప్రయత్నము చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—రాజకీయపార్టీలకు దీనికి సంబంధములేదు. దేవాలయాలమీద విశ్వాసముఉండి వాటి బాగోగులను చూసే వారిని వేస్తాము.

Sri S. RANGANADHA MUDALIAR :—Are there any rules guiding the Collectors in selecting the committee members ?

THE HON. SRI K. CHANDRAMOULI:—నేను ఇప్పుడే మనవి చేసాను. సామాన్యంగా దేవాలయాలమీద విశ్వాసముఉండి, వాటిలో శ్రద్ధాసక్తులు వుండి జాగ్రత్తగా పనిచేసేవారిని కలెక్టర్లు, కమీషనర్లు పేర్లు ఇస్తారు. వారిని వేస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU:—దేవాలయాలమీద విశ్వాసము మాట అటుంచి దేవుని డబ్బు సద్వినియోగము కావాలి అనుకొనేవాళ్లను అందరిని ఈ కమిటీలో వేయడానికి ప్రభుత్వానికి అభ్యంతరము ఉన్నదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సద్వినియోగము కావాలి. విశ్వాసము ఉండాలి. విశ్వాసము లేనివారిని వేయము.

Sri P. NARASIMHAPPA RAO :—కొంతమందికి దేవునిమీద నమ్మకము లేనప్పటికి, దేవునితాలూకు ఆస్తిమీద విశ్వాసము వుంటుంది. వారిని వేస్తారా ?

1st December 1955]

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆస్తిమీద నమ్మకము ఉంటే కాజేస్తారేమో అనే భయము ఉన్నది.

SRI PILLALAMARRI VENKATESWARULU :—ఈ కమిటీలు దేవునికోసమా ? దేవుని ఆస్తికోసమా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—దేవాలయాల పరిపాలన కోసము.

SRI T. PAPA RAO :—దేవునిమీద విశ్వాసము ఉన్నవారు, లేనివారు అనేదానికి qualification తెలియజేస్తారా ?

THE HON SRI K. CHANDRAMOULI :—వారే చెబుతారు. విశ్వాసము ఉన్నది, లేనిది.

Sri SHAIK MOULA SAHEB :—అధ్యక్షా, ఈ దేవాలయాల్లో విశ్వాసము లేనటువంటివాళ్లు దేవుడి డబ్బుమీద దృష్టిపెట్టారు. ఆ డబ్బు త్వరగా వారికి పంచియివ్వమనేనా, లేక దోపిడీ చేయవలెననియా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—దుర్వినియోగము చేయరని.

SRI P. SUNDARAYYA :—దేవునిమీద విశ్వాసము ఉన్నదా, లేదా అనే గీటురాయి, ఎంత ఎక్కువ డబ్బు ఉంటే అంత ఎక్కువ కాజేయడమే అనేదానికి ప్రధాన చిహ్నంగా తీసుకుంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—అది మా నోటీసులో ఎక్కడా లేదు.

Sri N. SREENIVASA RAO :—దేవునిమీద విశ్వాసము లేనివారు, దేవుని కమిటీలలో under ground గా చేరారు. వారిని బయటకు పంపడానికి ప్రయత్నము చేస్తారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—అటువంటివి నా నోటీసులో లేవు.

SRI A. VENKATRAMA RAJU :—ఇప్పుడు అన్ని ఏరియా కమిటీలలోను ఒక హరిజనసభ్యుడు ఉండటము గురించి అడిగితే మంత్రిగారు సాధ్యమైనంత వరకు వేస్తాము అన్నారు. అంటే రాష్ట్రములో ఉన్నటువంటి కొన్ని ఏరియాల్లో హరిజనులు లేనటువంటి ఏరియా కమిటీలు వున్నాయని మంత్రిగారి అభిప్రాయమా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంతవరకు కమిటీలు constitute చేయలేదు. Constitute చేసినప్పుడు ఆలోచిస్తాము.

SRI N. K. LINGAM :—ఈ ఏరియాకమిటీలలో సభ్యులుగా అన్ని మతాలవారిని వేస్తారా ?

MR. SPEAKER :—ఇది Hindu religion కు సంబంధించింది.

SRI M. R. APPA RAO :—అధ్యక్షా, ఒకజిల్లా అన్నారు. ఆజిల్లా ఏదో చెబుతారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కృష్ణాజిల్లా.

MR. SPEAKER : Questions Nos. 85 and 86 may be taken up together.

*Control of Leprosy in the State.*

85—

* 101 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there are any proposals with the Government to control leprosy in the State ; and

(b) the existing preventive measures taken to combat the disease ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The Government have recently opened two subsidiary centres—one at Tirupathi and the other at Ramachandrapuram under the Leprosy Control scheme sponsored by the Government of India. The question of further expansion of facilities for control of Leprosy is under consideration in connection with the schemes for inclusion in the Second Five Year Plan.

(b) There are leprosy treatment centres attached to the District and Taluk Hospitals where ever the incidence of leprosy is considerable.

*Leprosy Sanitoria in the State.*

86—

* 104 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of the Leprosy Sanitoria (1) Government and (2) Private (subsidised) in the State;

(b) the number of beds in them; and

(c) whether there are proposals to extend their bed strength now ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

(a) and (b)

There is present no Sanitorium that is maintained by Government. There are 7 private Leprosy Sanitoria which are in receipt of grants from the State funds and the total number of beds available in them is 696.

(c) The answer is in the negative.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, Private leprosy centres 7 వున్నాయని చెప్పారు. వాటిపేర్లు ఏమిటి ? అక్కడ ఎన్ని beds వున్నాయి ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

| | |
|---|---|
| శ్రీకాకుళంజిల్లా సాలూరులో | 136 beds. |
| విశాఖపట్టణముజిల్లా, విజయనగరం | 120 beds. |
| తూర్పుగోదావరిజిల్లా, రామచంద్రపురం | 165 beds. |
| పశ్చిమగోదావరిజిల్లా, నరసాపురం విప్రసే ఆస్పత్రి. | 150 beds. |
| కృష్ణజిల్లా, కేసరిపల్లి, విప్రసే ఆస్పత్రి. | 25 beds. |
| కడపజిల్లా, కోడూరు | 100 beds. |
| Total ... | 696 beds. |

Sri S. RANGANATHA MUDALIAR : Will the Government be pleased to state what are the existing preventive measures taken to combat the disease ?

The Hon. Sri A. B. NAGESWARA RAO : The latest treatment is Sulphone treatment.

SRI S. RANGANATHA MUDALIAR : Will the Government consider compulsory segregation as one of the preventive measures ?

THE HON. SRI A. B. NAGESWARA RAO : We will consider, Sir.

SRI S. NARAYANAPPA :—7 సంస్థలకు ప్రభుత్వమువారు గ్రాంట్లు యిస్తున్నారని సెలవిచ్చారు. ఏ సంస్థకు యెంతెంత యిస్తున్నారు ? ఇదికాకుండా ప్రభుత్వము నేరుగా మానవస్వరూపమే వికారమైన స్వరూపముగా మారేటటువంటి భయంకరమైన లెప్రసీ రోగములు నిర్మూలన చేసేదానికి ప్రభుత్వము ఒక ఆస్పత్రిని ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO : The Government are paying computation grants to the private leprosy institutions in the state at the rate of Rs. 9 per mensem for each inpatient, whether adult or child and in the case of children Rs. 4-4-0 per head under 16 years of age.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా, ఈ కుష్టరోగము చాలా contagious disease అని అందరికీ తెలిసినదే. అందువల్ల ఆ రోగికి రోడ్లలో తిరగడమువల్ల, బజార్లలో తిరగడమువల్ల అదింకా ఉధృతము అవుతుంది. అట్లా వారు తిరగకుండా వారికి ప్రత్యేకవసతులు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందా ?

అందులో leprosy వున్నవాళ్ళలో డబ్బువున్నవారు పెండ్లిండ్లు చేసుకోవడము జరుగుతున్నది. అందువల్ల ఆ రోగము వారి సంతానమునకుకూడా సంక్రమిస్తుంది. కాబట్టి అట్లాంటివారు పెండ్లిచేసుకోకుండా ప్రభుత్వము అరికట్టుతుందా ?

THE HON SRI A. B. NAGESWARA RAO :—నాకు కొంచెము వైద్యము తెలియడము మూలంగా దానినికొంచెము నాగిరెడ్డిగారికి తెలియచేస్తున్నాను. అయితే అది అన్నికేసులలోను leprosy contagious కాదు. అది మామూలుగా పుండుపడి రసికారి, దానిమీద ఈగలు, వగైరాలు వాలుతూంటే అది contagious అవుతుంది కాని కొన్నిరకాల leprosy అంటువ్యాధికాదు. ఏదైనా బిల్లు తీసుకొనివస్తే సాధ్యమవుతుందిగాని, లేకపోతే వారిని ఏ విధముగానూ compel చేయడానికి సావకాశము లేదు.

SRI T. LASHMINARAYANA REEDI :—అధ్యక్షా, మంత్రిగారు కొంతవరకు ఆ జబ్బు contagious అని ఒప్పుకున్నారు. అటువంటప్పుడు ఈ ప్రైవేటు శానిటోరియములను ఊరుమధ్యలో గాని, పట్టణము మధ్యలో గాని లేకుండా ఇప్పుడు వాటిని దూరంగా పంపడానికి ప్రయత్నము చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అది గవర్నమెంటు చేతుల్లో లేదని మొదటే మనవిచేశాను. ఏదైనా pursuasion వల్ల చేయవలసినదే గాని as it is గా compel చేయడానికి అవకాశంలేదు. అయినా ప్రభుత్వము ఆలోచిస్తుంది.

Sri V. VISWESWARA RAO ·—ఇప్పుడు మనకు cattle diseases అనే చట్టము వున్నది. ఆ చట్టములో కుక్కలకుకూడా చికిత్సచేయడానికి వీలుగా ప్రభుత్వంవారు ఒకసవరణ తీసుకువచ్చారు. అట్లానే మనుష్యులలోవచ్చే ఈ దుర్భరమైనటువంటి అంటురోగములను నిర్మూలించడానికి వెంటనే చర్యతీసుకొని, దానిని అరికట్టడానికి ఒక చట్టము ఏమైనా తీసుకోవడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON. Sri A. B. NAGESWARA RAO :—వీరిని దూరముగా పెట్టి వారి మనస్సులను బాధపెట్టే దానికన్నా, వీలైనంతవరకు వారిని మనుష్యుల మధ్యనే ఉంచి చికిత్స చేస్తే బాగుంటుందని నా అభిప్రాయము.

SRI P. VENKATASUBBAYYA :—కడప జిల్లాలో కోడూరు గ్రామంలో Leprosy Sanitoriam గుంజన నది ప్రక్కన ఉన్నది. ఆ కుష్టురోగులు అదుపులేక ఆనదిలో స్నానము వగైరాలు చేయుచున్నారు. ఆ నదికి దిగువన ఒడ్డున ఉన్న గ్రామాలవారు ఆ నీటిని ఉపయోగించడమువల్ల వారికి ఆరోగ్యం బలంగా వ్యాపిస్తున్నది. రాచపల్లి అనే గ్రామంలో పూర్తిగా కుష్టు రోగము వ్యాపించింది. ఆవిధంగా వారిని ఆ నీటిని ఉపయోగించకుండా ఉండేదానికి ప్రభుత్వంవారు ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఆలోచిస్తాము.

## *Electricity to Macherla town.*

87—

* 41 Q.—SRI M. NAGI REDDI : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state whether there is any proposal with the Government to supply Electricity to Macherla town, Palnad taluk

from the Electric Power Station recently constructed at Macherla for Nandikonda Dam works ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

A proposal is under examination in the office of the Chief Engineer (Electricity).

SRI M. NAGI REDDI :—నాగార్జునసాగర్ మాచెర్ల దాపునే కట్టుచున్నారు. కాబట్టి మాచెర్ల ఒక centre అవుతుంది. అందుచేత మాచెర్ల town కు electricity ఇవ్వడం ప్రధాన అవసరమని గుర్తించి irrigation కు small scale industries కు కూడా ఇచ్చే విధంగా ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఆలోచిస్తున్నారని చెబితే మళ్లీ అడిగితే ఏమి చెప్పను ? లక్షరూపాయిలు లోపుగా ఉంటే extension schemes government కు రానవసరం లేకుండానే Chief Engineer గారే sanction చేయవచ్చును. ఈ విషయమే Chief Engineer గారు ఆలోచిస్తున్నారు అని చెప్పాను.

*Establishment of a "Forensic Science Laboratory".*

89—

* 130 Q.—SRI A. SATYANARAYANA MOORTHY : Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether the Government propose to establish a "Forensic Science Laboratory" to assist the detection of crimes in the State ; and if so, the details thereof ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

A proposal to establish a Forensic Science Laboratory is under the consideration of the Government.

*Beriz deduction without payment to the Inamdars Artisans.*

90—

* 162 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state the amount of arrears of outstanding beriz deduction for over and above 2 years without payment to the Inamdars or artisans in the State ?

THE HON. SRI K. CHANDRAMOULI .—

The amount of arrears of beriz deductions pending payment to the inamdars or artizans in the State for more than two years is Rs. 59,159-7-1.

*State Medical Advisory Committee in the State.*

91—

*111 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there is a State Medical Advisory Committee in the State now ; and

(b) if so, who the members are ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) the answer is in the negative.

(b) does not arise.

*Medical Board for Andhra.*

92—

* 138 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the additional number of Medical Practitioners who registered themselves after the separation of Andhra State ;

(b) whether there is a separate Medical Board for Andhra ;

(c) if so, the personnel thereof ; and

(d) if not, when the Government propose to constitute one ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) 192.

(b) I take it that the Hon. Member refers to Medical Council under the Madras Medical Registration Act, 1914 as adopted by the Andhra State. If so, a separate Medical Council for Andhra is being formed.

(c) Does not arise.

(d) A separate register of Medical practitioners for Andhra is under preparation and it is expected to be employed before the end of this month. After the register is ready, elections of members to the Council have to be conducted in the manner prescribed in the Rules issued in this behalf. Thus a separate Medical Council for this State will be formed soon.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Medical Council లో School of Indian Medicine కు సంబంధించిన వాళ్ళనుకూడా members గా చేసే అవకాశం ఉన్నదా ? అంటే L. I. Ms. ఇటువంటి వాళ్ళను అన్నమాట. లేక వారికివేరే committee ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—L.I.Ms. కు సావకాశంలేదు.

1. One member elected by the Senate, Andhra University from among the members of the Faculty of Medicine of that University.

2. One member elected from among themselves by such member of the Staff of the Andhra Medical College at Visakhapatnam, as are registered practitioners.

3. One member elected from among themselves by such members of the staff of the Medical College at Guntur as are registered practitioners.

4. Three members elected by the Registered Practitioners from among themselves.

5. One member nominated by the State Government.

These will form the Medical Council.

SRI T. JIYYAR DAS :—Medical Council అన్నప్పుడు Residuary State లో ఆయుర్వేదానికి సంబంధించిన వేరే Council ఉన్నది. Central Board of Indian Medicine అని దానిపేరు, దానికికూడా వేరే selection ఇవ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ప్రస్తుతం మద్రాసులో ఉండే Central Board of Indian Medicine ఉభయ రాష్ట్రాలకు పనికివస్తుంది. దానిని separate చేయడానికి ప్రయత్నిస్తున్నాము.

SRI S. NARAYANAPPA :—హోమియోపతీ వైద్యంచేయువారి నిమిత్తం వేరే Medical Council ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఈ విషయం అంతా ఒక కమిటీవారిచే విమర్శించబడి ఒక రిపోర్టు వచ్చింది. ఆ రిపోర్టు ప్రభుత్వం వారి పరిశీలనలో ఉన్నది.

SRI N. SRINIVASA RAO :—న్యాచురోపతీ చాలా బ్రహ్మాండంగా ఉందని చెబుతున్నారు. దానిని కూడా ఇందులో చేర్చడానికి ఆలోచిస్తారా ?

(No answer.)

SRI P. SUNDARAYYA :—ఈ రకంగా వేరే వేరే ఏర్పాట్లు చేసే బదులు అన్నిటిని సమగ్రంగా ఆలోచించి, అన్నింటిలోని మంచి కలిపి ఒకే వైద్య Board ఏర్పాటు చేయడానికి ప్రభుత్వంవారు చర్య తీసుకుంటారా ?

THE HON. SRI A.B. NAGESWARA RAO:—Medical Council అనేది నేను చెప్పిన 5 categories క్రిందనుంచి elect చేసుకోబడి ఒకటిగానే ఏర్పాటు కాబడింది.

SRI VIJAYABHASKARA REDDI :—ఎసెంబ్లీలోవిన్న పేర్లు చూస్తేనే ఇంత confusion గా ఉన్నది. అమాయకులు మోసపోకుండా వీటిలో పదిమందిలో నిర్ణయించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Council అనేది ఒకటి వుంటుంది రాష్ట్రానికి. అది యే రకంగా ఎన్నిక అవుతుందో మనవి చేశాను.

SRI P. SUNDARAYYA :—Council ఉండవచ్చును. దానికి ఎన్నికలపద్ధతి మీరుచెప్పారు. ఆయుర్వేదానికి ఒక Council, Homoeopathy కి ఒక Council, Naturopathy కి ఒక Council, Mud Theropathy కి ఒక Council అని కాకుండా ప్రజలకు ఉపయోగకరమైన విధంగా, వైద్యవిధానంలో ఏ మంచివున్నా దానిని గ్రహించి—అన్నిటిని సక్రమంగా నడుపడానికి—Indian Medical Council ఎక్కువ representation ఇవ్వడానికి తగుచర్యలు ప్రభుత్వం తీసుకుంటుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—గౌరవసభ్యులు సూచించారు కాబట్టి ప్రభుత్వం ఆలోచిస్తుంది.

*Number of Medical Practitioners registered in classes A and B.*

93—

9165 Q.—SRI S. VEMAYYA: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the number of Medical Practitioners in the State who are registered in classes "A" and "B" in the State now, in the Register of Medical Practitioners ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—

Number of medical practitioners is as follows :—

'A' Class—502.

'B' Class—4,132.

SRI T. JIYYAR DAS :—Medical practitioners అంటే Indigenous Medical Practitioners అనేనా ప్రభుత్వ ఉద్దేశం ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

Medical practitioners who have been trained in a teaching institution recognised by the Government undergone Village Vaidya training come under B class and the medical practitioners who have undergone the training prescribed under the Village Vaidyas and passed the examination and whose qualification denotes at least a minimum standard of professional training to undertake medical work and in addition inoculation work during the epidemics of cholera and small-pox come under C class.

SRI T. JIYYAR DAS :—Indigenous system లో A, B, classes ఉన్నాయని చెప్పారు. ఆ క్లాసులంటే Village Vaidyas. ఈరకంగా కులతత్వాలు లేకుండా ఒకే register లో పెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Knowledge బట్టి, చదువునుబట్టి ఉంటుంది. అందరిని ఒకే క్లాసులో పెట్టడానికి వీలు లేదు.

SRI VAVILALA GOPALAKRIHNAYYA :— Village Vaidyas course ఆపుచేస్తారని విన్నాము. అది ఆపుచేస్తారా ? Continue చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వేరేప్రశ్నవేస్తే చెబుతాను.

*Transfer of District Munsif's Court, Ongole to Addanki.*

95—

* 134 Q.—SRI D. V. RAMANA REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state whether the Government propose to transfer the Additional District Munsif's Court of Ongole to Addanki instead of having two Courts at Ongole ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

No.

SRI D. V. RAMANA REDDI :—ఎందువల్ల ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇవిఅన్నీ temporary courts. కొద్దిరోజులు మాత్రమే పనిచేస్తాయి. పని అయిపోగానే తీసివేస్తారు. నెలకో, రెండునెలలకో పెట్టే కోర్టులు మరొకచోట పెట్టడం బాగాలేదని ఇక్కడ పెట్టాము.

SRI D. V. RAMANA REDDI :—అద్దంకి Sub Taluk లో 100, 150 గ్రామాలున్నాయి. Decentralization దృష్ట్యఅయినా అక్కడ గవర్నమెంటుకోర్టు పెట్టడానికి ఆలోచిస్తుందా ?

TEH HON. SRI N. SANJEEVA REDDI :—ఆలోచించాము. High court ను కూడా consult చేశాము. ఇపుడు అవసరంలేదు. ఉన్న కోర్టుకు పని ఎక్కువగాలేదు కనుక temporary గా పెట్టి పని ముగించవచ్చునని చెప్పారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—High court క్రొత్త Munisif Court పెట్టాలని సలహాఇచ్చిందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—వేరే ప్రశ్నవేస్తే చెబుతాను.

*Tahsildar's Office at Kuppam.*

96—

* 186 Q.—Sri D. RAMABRAHMAM : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether there is a proposal to locate a Tahsildar's office at Kuppam; and

(b) if so, when ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) The proposal will be considered along with the general re-organisation of all Estate Managers' offices in the district and their integration with Taluk Offices.

*Elimination of Harijan Hostels in pursuance of G.O. Ms. No. 923, Rural Welfare, dated 22nd July 1953.*

97—

* 120 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state the number of Hostels eliminated in pursuance of G.O. Ms. No. 923, Rural Welfare, dated 22nd July 1953, for the year ending 1954-55, if any, in the State ?

The Hon. Sri D. SANJIVAYYA :—

The information is placed on the Table of the House.

*Maintenance of Harijan Hostels.*

98—

* 155 Q.—Sri M. RAJESWARA RAO : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the total expenditure incurred by Government for the maintenance of Harijan Hostels run by private individuals or institutions during each of the years 1953-54 and 1954-55 in each district; and

---

*Vide appendix at page infra.

(b) the total number of grants given to such hostels in each district and in each of these years ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) and (b) : The information is placed on the Table of the House.

SRI S. NARAYANAPPA :—హరిజన hostels management చేయడానికి ఒక managing committee ప్రభుత్వవారు నియమిస్తున్నారు. ప్రతి hostel కు ఒక managing committee వున్నది. అందులో అధికారులు వున్నారు. హరిజన సేవకసంఘం తరఫున సభ్యులు మేనేజిమెంట్ కమిటీలో ఉన్నారు. కాని తనిఖీచేసే అధికారం విషయంలో Collector ల్లు Managing Committee లకు తమ అధికారములు అమలు పరచడంలో ఏవిధంగా గౌరవం గా వుండడంలేదు. ఇలాంటి అధికారములు ప్రభుత్వం కలెక్టర్ల కిచ్చిందా ? ఆఫీసర్లు ఎప్పుడుబడితే అప్పుడు తనిఖీచేసి రికార్డు పట్టుకుపోవచ్చునా ?

THE HON. SRI D. SANJIVAYYA :—జిల్లాలో ఉన్నటువంటి ఆఫీసర్లు ఎప్పుడువీలైతే అప్పుడు తనిఖీచేయడం మంచిదనే భావనతో ప్రభుత్వం ఆ విధంగా చేసింది. ఆ తనిఖీలో యిబ్బంది లేవైనావుంటే ప్రభుత్వానికి తెలియపరస్తే తొలగించడానికి ప్రయత్నిస్తాం.

SRI K. PUNNAYYA :—Statement No. 1 లో 758 grants backward classes కొరకని తెలియజేశారు. ఇది Backward Classes Fund నుంచి allot చేశారా లేక Harijan Welfare Fund నుంచి allot చేశారా ?

THE. HON SRI D; SANJIVAYYA :—Seperate fund వున్నది Backward Classes కు.

*Godavari Flood Precaution Committee.*

99—

* 146 Q.—SRI A. VENKATRAMA RAJU : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Godavari Floods Precaution Committee is still functioning ?

---

*Vide appendix at pages _ infra.

(b) If so, the names of the members ?

(c) the recommendations made by the said Committee.

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No.

(b) Does not arise.

(c) The following are the recommendations made by the Committee :

(1) Strengthening the flood banks to an adequate extent as an immediate measure;

(2) Construction of a reservoir higher up the Godavari as a flood moderating device, as a long term project (which may take sometime to materialise);

(3) Revision of List of Flood tools and stores; reserve stocks of stores at important sheds and to some extent the flood patrol rules.

(4) Revision of and bringing the River Conservancy Act upto-date.

(5) Establishment of a Research Station or Division to Conduct model studies into the behaviour of the River from the sea upto at least Bhadrachalam;

(6) To arrange for fuller and detailed study by the P.W.D. as to why points like Chidipi, Kapileswarapuram and Narkedimilli have given trouble repeatedly : and

(7) To bring out a book instructions on flood control and bank protection after detailed study of all aspects of the problems.

A. VENKATRAMA RAJU :—Floods వల్ల వచ్చినటువంటి గత ప్రమాదాన్ని దృష్టిలో పెట్టుకుని యికముందు మనం చేసుకోవలసిన జాగ్రత్తలను గురించి information యిచ్చారు. అదేసందర్భంలో యీమధ్య వచ్చినటువంటి floods వల్ల river bed level పెరిగి పోవడం Western Delta లో జరిగింది. అలాంటివి జరగకుండా ఏమయినా సలహాలు యిచ్చిందా యీ కమిటీ ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ కమిటీకి latest floods తో సంబంధంలేదు. అది పూర్వమే రద్దయిపోయింది,

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా! ఈబోర్డు కొన్ని సూచనలు చేసిందని, వాటిని ప్రభుత్వం పరిశీలించి చర్యలు తీసుకొన నిర్ణయించినట్లు చెప్పారు. ఏ ఏ చర్యలు తీసుకుంటూరో చెప్పగలరా?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Bunds strengthen చేయడం reservoir లాంటి పెద్దవితప్ప ప్రతి చిన్న సలహాలపై చర్య తీసుకుంటున్నాము.

*Flood Control Board.*

100—

* 154 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the State Government have suggested any schemes to be taken up by the 'Flood Control Board' appointed by the Government of India; and

(b) if so, the names of such schemes ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The above answer is in the affirmative.

(b) The names of the schemes are given below :—

(1) Budameru Reservoir across Budameru at Nandigama;

(2) Budameru Diversion Scheme;

(3) Repairs and improvements to East Tungabhadra Stream in Guntur District;

(4) Tidal Banks in East Godavari District;

(i) Forming tidal banks on either side of Patharlagedda Dam.

(ii) Forming tibal banks on either side of Tulyabhaga Dam.

(iii) Forming tidal banks on either side of Patavala Dam.

(iv) Forming a flood bank from Tallarevu rock to Coringa Bridge.

(v) Forming a flood bank a long Kakinada Yanam Road.

(vi) Forming a flood bank from S. Yanam to N. Kotha-palli,

(vii) Forming a flood bank for the benefit of N. Kotha-palli village.

(viii) Tidal Banks in West Godavari District (Formation of tide protection bunds from Vempa and Mutyalapalli project.

(5) Krishna Estuary-Tidal Banks from Hamsaladivi to Etimoga;

(6) Installation of Flood Waring system for Godavari and Krishna Rivers.

(7) Survey and Research;

(8) Staff for investigation (10 per cent of the cost of the works).

Sri G. YELLAMANDA REDDI :—సోమశిల project దీని క్రిందికి తీసుకున్నట్లు వార్తలువచ్చాయి. అది ఎంతవరకు వాస్తవము ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఈ Flood control Board Committee సలహాయిచ్చిన list అంతా చదవమన్నారా ? చాలా వున్నాయి. గోదావరి Reservoir pennar, Somasila తమ్మిలేరు, బుడమేరు canalization, శారద వరాహ, యింకా చదవమంటారా ?

Sri B. APPA RAO :—విశాఖజిల్లాకు సంబంధించినంతవరకు బడ్జెటు సమావేశం సందర్భంలో మంత్రిగారు గత దఫా ఏమీ చేయడానికి వీలులేకపోయింది. Flood control scheme లో కలిపి పనిచేయిస్తాం అన్నారు. ఇప్పుడు Special division ఏర్పాటు చేస్తున్నారు. అదే యీ పనులు చేస్తుందా లేక ప్రత్యేకం Flood control కు Special division ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అది project ను బట్టివుంటుంది, చిన్నవైతే యిపుడున్న Special division చేస్తుంది. ఇవన్నీ కూడా Delhi ప్రభుత్వానికి పంపించాం. ఢిల్లీప్రభుత్వం ఆమోదించినతరువాత పని ప్రారంభించడానికి పూనుకుంటాం.

Sri G. NARASIMHA MOORTHY :—అమలాపురం తాలూకాలో వరదవల్లనే కాకుండా అటునుంచి సముద్రం యిటునుంచి గోదావరి వరద

రెండింటినుంచి ఎక్కువ నీరు రావడంచేత 10, 16 గ్రామాలు నష్టపడుతున్నాయని ప్రభుత్వానికి తెలుసునా ? తెలిసి ఉంటే కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—తెలిసి ఉండబట్టే దానికి top priority యిచ్చాము. 10 లక్షలపై స్కీములు Delhi ప్రభుత్వానికి పంపాము, తక్కువ వున్నటువంటివి Tidal banks వంటివి మనమే చేసుకోవాలనే ఉద్దేశంతోనే దీనిని చేర్చాము.

## NON-OFFICIAL BILLS.

### I. THE ANDHRA DOWRY PROHIBITION BILL, 1955.

SRI A. KALESWARA RAO : Sir, I move :

"That the Andhra Dowry Prohibition Bill, 1955 be referred to a Select Committee."

అధ్యక్షా మహాశయా, ఇదివరకు ఈ వరకట్నాల నిషేధపుబిల్లును ఈ శాసన సభలో ప్రవేశపెట్టడానికి గౌరవనీయులైన ఈ సభవారు అనుమతిఇచ్చారు. ఆ బిల్లు ఆంధ్ర గజెటులో ప్రచురణఅయింది. దాని రెండవమెట్టుగా ఈ బిల్లును 15 మంది గౌరవసభ్యులు గలిగినట్టి ఒక సెలక్టు కమిటీకి పంపడానికి ఈ సభవారు అనుమతిని నేను కోరుచున్నాను.

MR. SPEAKER :—There is a dilatory motions. Sri Vijaya bhaskara Reddi will move his amendment.

SRI K. VIJAYA BHASKARA REDDI : Sir, with your permission I want to add the words 'before 1st April 1956' to my amendment, before I move it.

MR. SPEAKER : Yes, the hon. Member can move it.

SRI K. VIJAYA BHASKARA REDDI : Sir, I move :

"That the Bill be circulated for the purpose of eliciting opinion thereon before 1st April 1956."

SRI P. RANGA REDDI : Sir, I support the amendment moved by Sri K. Vijaya Bhaskara Reddi.

SRI A. KALESWARA RAO :—ఇపుడు మా పార్టీలీడరుయొక్క ఆదేశానుసారము పార్టీసెక్రటరీగారే 1956 ఏప్రిలు 1 వరకు ఈ బిల్లును ప్రజాభిప్రాయం తెప్పించడానికి పంపుతూ ఒక సవరణ తీసుకువచ్చారు. సవరణను నేను అంగీకరిస్తున్నాను. నిజమే. ఇపుడే సెలక్టు కమిటీకిపెడితే బాగా ఉంటుందేమో.

(At this stage Mr. Deputy Speaker occupied the Chair.)

ఇది ఏమంత కష్టమైనబిల్లు కాదు. ఇందులో అంశములు అందరకు తెలిసినవే. ఇందులో ఉన్నట్టు తాత్పర్యాన్ని, భావాన్ని అందరు అంగీకరించినవే కాబట్టి సెలక్టు కమిటీకి పెడితే బాగా ఉంటుంది. ఏమైనప్పటికీ, ఏదో కారణంచేత లీడరు గారు ప్రజలకు బాగా తెలియపరచి వారికి ఉండేకష్టాలను తెలుసుకున్న తరువాత సభను సెలక్టు కమిటీకి పెట్టవచ్చునని ఆదేశించినందున నేనుకూడా ఈ సవరణను అంగీకరిస్తున్నాను. ఇప్పుడు ఎక్కువగా మాట్లాడను అవసరం ఉండదు. ఈ బిల్లుయొక్క తాత్పర్యం నేను మనవిచేస్తున్నాను.

ఆంధ్ర దేశము మత సంస్కరణలకు చాలా ప్రసిద్ధికెక్కింది. మత సంస్కరణల ఉద్దేశం మూఢ విశ్వాసాలను సంఘంలోనుంచి తొలగించడం, మానవ సమానత్వం, పీడిత జాతులకు న్యాయం కలుగచెయ్యడం. అందరకు సమాన హక్కులు కలుగ చెయ్యడం సంఘాన్ని విచ్ఛినం చేస్తున్న కుల భేదాలను తీసివేయడం ఇవన్నీకూడా సంఘ సంస్కరణలు. నిజమే. హరిజనోద్ధరణ విషయములో ఆంధ్ర పేరు గాంచింది. గంగానదీ ఒడ్డున ఉన్నట్టి కాశీవిశ్వేశ్వరుడు ఉన్నచోట హిందూ విశ్వవిద్యాలయంలో మొట్ట మొదట ప్రవేశించిన హరిజన విద్యార్థి ఆంధ్రుడు. ఆయన మన వేముల కూర్మయ్య. మహాత్మ గాంధిగారు మాళవ్యగారికి వ్రాశారు. ఆయన తటపాయించాడు. తరువాత గాంధిగారు గట్టిగా వ్రాయడంవల్ల చేర్చుకున్నారు. అందరితో కలిసి ఆయన Hostel లో చేరాడు. అందరితో కలసిమెలసి భోజనంకూడ చేసేవాడు. బెనారసులో అస్పృశ్యత లేకుండా చేసినదికూడా ఆంధ్రులము. దీనికి మనము గర్వపడవలసినదే. ఆంధ్రదేశ ప్రజలు ఔదార్యవంతులు, భావోద్రేకంగలవారు, కార్యశూరులు, త్యాగధనులు, ముందుకు పోయినవారు మనకు ముఖ్యముగా వెంకటరత్నం నాయుడుగారు. వీరేశలింగంగారు మనతరమువారే. అందులో మాతరం వారికి వారు గురువులు, సంఘ సంస్కరణ స్త్రీల అభివృద్ధి పాఠములు వారివద్ద నేర్చుకున్నాము. రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు వద్ద వీరేశలింగంగారి వద్ద నేర్చుకున్నాము. నేను ముఖ్యముగా ఆయన శిష్యుడను అని నేను గర్విస్తున్నాను. నేను 1904 లో B.L. చదువుచున్నప్పుడు వీరేశలింగంగారు ప్రార్థన సమాజానికి వెళ్ళేవారము. కోమర్రాజు లక్ష్మణరావుగారు అప్పుడు ఉండేవారు. కాబట్టి మన ఆంధ్ర దేశము ముందుకు పోతున్నది. ఏ రాష్ట్రంలో లేదు, బిల్లు ప్రవేశ పెట్టారు అని మనము చెప్పుకో తగ్గది కాదు. మనము ముందుకు పోదాము. మార్గ దర్శకులం, ఆదర్శవంతులం అవుదాం. లోపాలు ఉంటే సవరించు

కుంటాము. సంస్కరణల విషయములో హిందూదేశము పేరుపొందింది. రాజరామ మోహనరావు, వివేకనందా, ఈశ్వరచంద్ర విద్యాసాగరు సహగమనం, widow marriage బిల్లులు ప్రవేశపెట్టారు. Age of consent బిల్లుకూడా తీసుకువచ్చారు. పూర్వాచార పరాయణులను ఎదిరించాము. చట్టములద్వారా ప్రవేశ పెట్టకూడదని వారు అన్నారు. చట్టాలవల్ల శాసనాలవల్ల, వాద ప్రతివాదాలవల్ల వ్యతిరేకత వస్తుందన్నారు. అందుచేత పూర్వాచార పరాయణులతో పోరాడవలసి వచ్చింది. తరువాత చిన్న పిల్లల పెళ్లిళ్లు తీసివేయడానికి, రజస్వలానంతరం వివాహములు నిమిత్తం చట్టం తీసుకువచ్చారు. ప్రకాశంగారు 1906 లో ఇంగ్లడునుండి వచ్చిన తరువాత ఆయనతో భోజనం చేసినామని మమ్ములను వెలివేసినారు. రెండు సంవత్సరాల తరువాత మేమే వారిని వెలివేశాము. మేము కష్టాలు పడ్డాము. వీరేశలింగం గారు, లక్ష్మణరావుగారు చాలా కష్టాలు పడ్డారు. తేలికగా ఒక రస్తా ఏర్పడింది. మేము తరువాతనే 1900 లో ప్రవేశించాము. కనుక ఆంధ్ర దేశము సంఘ సంస్కరణలకు పేరు పొందింది. మీరందరు తరువాత వచ్చారు.

కనుక మన ఆంధ్రదేశం గాంధిగారి ఉద్యమం రాకముందునుంచికూడ ఈ సంఘ సంస్కరణల విషయాలలో పేరుపొందినటువంటి వాండ్లము. మాకు తరువాత మీరు యువకులంతా వచ్చారు. మీరంతాకూడ చాల ఉత్సాహంతో ముందుకు పోతున్నారు. చాల సంతోషించవలసిన విషయం. ఇక ముఖ్యంగా ఇదినరకు స్త్రీలకు సంబంధించి నటువంటి శాసనములు కొన్ని జరుగుతున్నాయి. స్త్రీలకు ఉపనిషత్తు కాలంలో పురుషులతోపాటు సర్వసమానమైన హక్కులు ఉండేవి. బృహదారణ్యకోపనిషత్తు. చదివితే అక్కడ ఉన్నటువంటి కథలు చదువుతూ ఉంటే పురుషులకంటే ఎక్కువ పండితులుగా ఉన్నారు. జనక మహారాజు దర్బారులో అక్కడ జీవాత్మపరమాత్మ ప్రకృతినిగురించి నటువంటి బ్రహ్మాండమైన వాదోపవాదాలు జరుగుతున్నాయి. అక్కడ ఎవరైతే పండితులందరిని ఓడించి ప్రఖ్యాతి పొందుతారో వారికి పెద్ద బహుమానము పెట్టారు. యాజ్ఞవల్క్యుడు ఆ బహుమానాన్ని సంపాదించడానికి సిద్ధంగాఉన్నాడు. పండితులందరికికూడ అసూయకలిగింది. ఏమి తోచకపోయింది. ప్రతివాడు ఓడిపోతున్నాడు. అప్పుడుగార్గేయి ఏమిచేసింది ? ఆమే బ్రహ్మచారిణి, ఆమేజీవన్ముక్తురాలు, విద్యాంసురాలు, ఆమెలేచింది. లేచి పండితులందరితో "పండితోత్తములారా! నేను రెండుప్రశ్నలు వేశాను. ఆ రెండు ప్రశ్నలకు ఆయన సరియైన జవాబుఇచ్చాడు. మీరు ఎవ్వరు గెలువలేరు. ఆమె అడిగిన అనేక ప్రశ్నల కన్నిటికిని యాజ్ఞవల్క్యుడు జవాబులు అని చెప్పిందే చెప్పాడు. యాజ్ఞవల్క్యుడు గెల్చాడు. అట్లాగే యాజ్ఞవల్క్యుడు అరణ్యానికిపోతూ యావత్తు వేదాంత తత్వ ఉపదేశం తన భార్యయైన మైత్రేయికిచ్చేసి పోయినాడు. బృహదారణ్యకో

Sri A. Kaleswara Rao] [1st December 1955

నిషత్తులో ప్రధాన భాగాలు ఇవి. ఈయాజ్ఞవల్క్యునికీ, గార్గేయికి జరిగినటువంటి వాదోపవాదాలు, యాజ్ఞవల్క్యుడు తన భార్య అయినటువంటి మైత్రేయికి చెప్పినటువంటి వాదోప వాదాలు అంతా వ్రాసిఉంది. ఒక మంచి పండితుడైన మగపిల్లవాడినిగాని పండితురాలైన కూతురిని గాని కనడానికి భార్యాభర్తలు ఫలాని విధములైనటువంటి ఆహారం తినాలి అని అన్నారు. ఆనాడు ఆస్తులు, గౌరవం, కీర్తి విషయాలలో సమానంగా చూచారు. తర్వాత క్షీణం వచ్చింది. క్షీణత వచ్చి ఆఖరుకు మనుస్మృతి నాటికి స్త్రీలు సమానంకారు, స్త్రీలకు స్వాతంత్ర్యం ఉండకూడదు, వాండ్లు ఇంకొకండ్లమీద ఆధారపడాలి, స్త్రీ అస్వతంత్రురాలు, అనేటటువంటి సిద్ధాంతం వచ్చింది. స్త్రీ చిన్నప్పుడు తండ్రిమీద, తరువాత భర్తమీద ఆఖరు దశలో పుత్రునిమీద ఆధారపడవలెను గాని ఆమె స్వతంత్రంగా ఉండకూడదు అనేటటువంటి సిద్ధాంతంవరకు పోయి హిందుదేశంలో చివరకు స్త్రీయొక్క స్థితిపడిపోయింది. అది మళ్లీ పునరుద్ధరణ చేయడానికే ఈ సంఘ సంస్కరణ, చివరకు సహగమనం చేయడంవరకు కూడా వచ్చింది. దానిని అంతా తీసివేసి, స్త్రీకి సంఘంలో సమానమైన స్థితి గతులు కలుగ చేయడానికి మళ్లీ గార్గేయి, మైత్రేయివంటి మహాగట్టి స్త్రీలను నిర్మించడానికి ఈ సంఘ సంస్కరణ ఉద్యమము Ram Mohan Roy మొదలుకొని గాంధివరకు తలపెట్టారు. గాంధిగారికంటె గొప్ప సంస్కర్త లేడు. మానవ సమానత్వవాది ఇంకొకరులేరు. మానవ సౌభ్రాతృత్వం, సోదరత్వం, సమానత్వం రూసో భోదించినటువంటి దానికంటే కూడ ఎక్కువగ ఈయన ప్రపంచంలో బోధించాడు. వ్యాపించేశాడు. ఆయన యొక్క సిద్ధాంతం మన ఉపనిషత్తులో, భగవద్గీతలో ఉన్నటువంటి సిద్ధాంతం. ప్రతి పురుషునిలో జీవాత్మ ఉన్నది. శాశ్వతమైన జీవాత్మ పరమాత్మ అందరిలో వ్యాపించి ఉన్నాడు. అటువంటి అప్పుడు ఎక్కువ తక్కువ అనేటటువంటిది ఎక్కడ ఉన్నది? కాబట్టి అందరు సోదరులే, అందరు స్వతంత్రులే, అనే సిద్ధాంతం మీద అస్పృశ్యతా నివారణ మొదలైనటువంటివి ఆధారపడి ఉన్నాయి. అమెరికా ఇంకా వర్ణజాతి అహంకారం సమస్యలను పరిష్కరించకుండా ఉంది. ఒక అమెరికా స్త్రీతో ఏదో ఈలవేశాడని, 15 ఏండ్ల నీగ్రో కుర్రవాడిని తీసుకొనివచ్చి lynch చేశారు. మనం తేలికగా సంఘముయొక్క ఒప్పుదలమీద మన రాజ్యాంగ విధానంలో కూడ సవరణపెట్టి హరిజనులయొక్క అస్పృశ్యత పోగొట్టగలిగాము. వేలకొలది సంవత్సరాలనుంచి ఉన్న ఈ దురాచారాన్ని రూపుమాప గలిగాము. స్త్రీలకు, విద్య లేని రోజులు ఉన్నాయి. వీరేశలింగంగారు స్త్రీలకు విద్య చెప్పితే తప్పులేదు, మంచిది స్త్రీలను స్కూళ్ళకు పంపించండి అనే దగ్గరనుంచి పునాదులు వేయవలసి వచ్చింది.

అది అంతా పోయింది ఇపుడు-స్త్రీలు వివాహంలేకుండా ఉండవచ్చును, యావత్తు జీవితంకూడా, Professors కావచ్చును. మన స్త్రీలు మంత్రులే కావడం కాకుండా International రాయబారులుగ ఉన్నారు. విజయలక్ష్మి పండిట్ మొదలైనటువంటి వాండ్లు ఉన్నారు కాబట్టి మన హిందూదేశ స్త్రీలకు చాల గౌరవం వచ్చింది. ఇది గాంధిమహాత్ముని ఉద్యమంవల్ల నవీనభారత వర్షం అనగా ఏమిటి? రామమోహనరాయితో ఇది ప్రారంభం అయింది. ఈ మానసికవికాసం, ఈ వైజ్ఞానిక వికాసం, అభివృద్ధి, ఈ మానవ సమానత్వం నంచే Rama Mohan Roy నాటి నుండి ప్రారంభం అయింది. మహాత్మాగాంధితో పరిపక్వము కుదిరింది. ఇపుడు ఎక్కడ తింటున్నావు, ధంజాలు వేసుకొన్నవా, నీవు బ్రాహ్మణుడవా, శూద్రుడవా, అని మనలను ఎవరుకూడ అడిగేవాడు లేడు. ఇంకా తర్వాత భేదాలు అడ్డంరాకూడదన్నాం. ఇదివరకు ఇతరకులాల వాండ్లు ఒకరి నొకరు పెండ్లి చేసుకోడానికి వీలు లేదు. పూర్వం అనులోమ ప్రతిలోమ వివాహాలు ఉండేవి. అవి అన్ని బ్రిటిషుగవర్నమెంటు వచ్చిన తర్వాత ఇనప సంకెళ్ళతో మన ఆచారాలను బధించివేసి, Hindu Law ను బహుకృత్రిమంగా బహునిర్భందగా అనులుపరచి మనకు నష్టము కలుగచేశారు. అందువల్ల సంఘ సంస్కర్తలు శాసనములు పెట్టి అవి తీసివేయాల్సి వచ్చింది. ఈనిర్భందాలన్నీకూడా అట్లాగే మనము వివాహాలు ఒకే కులంలో చేయకపోతే ఆ వివాహం చెల్లదు అన్నారు. అది తీసి పారవేశాము. తీసిపారవేసి, వివాహాలు ఏ కులంలో ఏ జాతిలో చేసికొన్నాసరే, మన హిందూ యువకుడు ఒక రష్యను యువతిని చేసుకొన్నా, ఒక చైనా యువకుడు, భారతీయ యువతిని చేసుకొన్నా, జర్మనీ యువతిని చేసుకొన్నా తప్పులేదని మనము నిరూపించాము. ప్రపంచానికి అంతా చాటాము. పూర్వాచార పరాయణత్వాన్ని తొలగించాము. కనుక అటువంటి గౌరవం అంతా మన దేశానికి వచ్చింది. మన పార్లమెంటుకుకూడ వచ్చింది. నేను ఒకసారి సమిష్టి మద్రాసు రాష్ట్రములో ఒక బిల్లు ఇచ్చాను. కులభేదంవల్ల, వధువు, వరుడు ఇద్దరు చెడి ఒక కులము క్రింద ఉండడంవల్ల ఆ వివాహం ఆ మాత్రంచేతనే రద్దు కాకూడదు అనేటటువంటి బిల్లును ప్రవేశపెట్టితే, అప్పటికి దీనిని కొంచెం ఆలస్యం చేస్తుండగానే Bill ప్రవేశపెట్టారు. Bill pass అయింది. అనగా వధువు, వరుడు ఒకటే కులానికిగాని, అదేకులములో చిన్న శాఖలకుగాని చెందవలసిన అవసరంలేదు, అనేటటువంటి బిల్లు అక్కడ ప్యాసు అయింది. తర్వాత Special Marriages Act ఒకటి pass అయింది. తర్వాత ఇక్కడ ఏ స్థితిలోకి వచ్చామంటే స్త్రీల యొక్క వారసత్వాన్ని గురించి ఆలోచిస్తున్నాము. స్త్రీలకు పురుషులతోపాటు సమానమైన ఆస్తిహక్కులు ఇవ్వవలెననే విషయం ఆ పార్లమెంటు ఎదుట ఆలోచనలో

Sri A. Kaleswara Rao] [1st December 1955

ఉంది. వివాహవిషయంలో వివాహ విచ్ఛేదవిషయంలో కూడ స్త్రీలకు, పురుషులలో పాటు సమానమైన హక్కు యివ్వవలెనని Government of India ఏమిచేసిందంటే ఒక కమిటీని వేసింది. అది రావుకమిటీ. వారు ఈ అన్నివిషయాలతో ఒకరిపోర్టు వ్రాశారు. చిన్న చిన్న సంస్కరణలు హిందూ వివాహ విషయంలోగాని, దత్తత విషయంలోగాని, guardian విషయంలోగాని, వారసత్వ విషయంలోగాని కాకుండా, అంతకలసి ఒకసమగ్రమైన Hindu Code ను చేస్తే బాగావుంటుందని వాండ్లు ఒక రిపోర్టు వ్రాశారు. ఆ రావు కమిటీ రిపోర్టును చదివే India Parliament లో ఈ వివాహ విషయములోనున్న వివాహ విచ్ఛేద విషయంలోను స్త్రీలకు పురుషులతోపాటు సమానహక్కులు లేకుండా పోవడంవల్ల నేను ఒకబిల్లును సమిష్టి మద్రాసురాష్ట్రములో ప్రవేశపెట్టాను. అనగా సవతిపోరును స్త్రీకి తీసివేయడం. బహు భార్యత్వాన్ని నిషేధించడం దానితోపాటు కొన్నిపరిస్థితులలో దాంపత్యం సాగకపోతే మొగుడు పెండ్లాన్ని విడిచిపెట్టి లేచిపోతే, లేక పెండ్లామే లేచిపోతే అటువంటప్పుడు వివాహాన్ని రద్దుపరచుకొని ఆ రద్దుపరచుకొన్న తర్వాత ఆరు నెలలకు తర్వాతగాని మళ్ళి రెండోవివాహం చేసుకోకూడదనేటటువంటి బిల్లును ఆ రావు కమిటీ సిద్ధాంతముల ప్రకారమే నేను సమిష్టి మద్రాసురాష్ట్రములో ప్రవేశపెట్టితే, అది మనదే ఇండియాలోకల్లా మొదటిబిల్లు అయింది. మనకే మన ఆంధ్రులకే ఇండియాలో బహు భార్యత్వపు నిషేధం, కొన్ని క్లిష్టస్థితులలో వివాహవిచ్ఛేదిన అధికారం ఈరెండు కలుగచేసినటువంటి బిల్లు మనదే అయిందిగాని, మనకు పోటీగా వచ్చారు బొంబాయివారు.

మనం అధికారబిల్లు ప్రవేశపెట్టాము. అప్పుడే ఆయన Government బిల్లుగా పెట్టి పాస్‌చేశారు. Non Official బిల్లు అంటే ఇదేచిక్కు. Non-Official బిల్లు అంటే మంత్రులు దబ్బున ఒప్పుకోరు. అప్పుడున్నటువంటి Governmentను మీరు తీసుకోండి అని నేను అడిగాను. గాని తీసుకోలేదు. Non-Official party అయినా చిక్కులన్నీ ఒక్కటే. ఇతరులకు అసలు అనుమతే యివ్వరు. మాకేమో ఆలస్యం చేస్తారు. అంతేగాని ఆలస్యంలేకుండా త్వరగా వస్తుందన్నది అబద్ధం. ఎందువల్లనంటే ఇప్పుడు Select Committee కి పోకుండా ఎందుకు మంత్రిగారు దానిని public opinion కు పంపించడం వారికిభయం, కాని మొరార్జీ దేశాయ్ అటువంటివారు కాదు మొరార్జీ దేశాయ్. ఇప్పుడు రెండూ కలిసినటువంటివి అనగా బహు భార్యానిషేధం వివాహ విచ్ఛేదపుహక్కు రెండు కలిపినటువంటి బిల్లు మన సమిష్టి మద్రాసులో నేను పెట్టినటువంటి కాలంలో విడిగా విడిగా రెండుబిల్లులు

బొంబాయిలో మొరార్జీదేశాయ్ మనకంటే ముందుగాచేశారు కనుక వాళ్ళబిల్లులు ముందుఅయినాయి. మనం వెనుకబడ్డాము. కాని మొత్తంమీద ఇండియాలోకల్ల Bombay, Madras ముందుగా పోయినాయి. అభివృద్ధికరమైన బిల్లులు పెట్టా రనేటటువంటి మర్యాద దక్కింది. తరువాత అది యిప్పుడు All India దాంట్లో కలసిపోయింది. All India Parliament లో ముఖ్యంగా నెహ్రూగారి పట్టు దలవల్ల సాగుచున్నది. ఇప్పుడు నేను ఎన్నో అడ్డంకులు చూశాను. ఆమె ఒక మహారాజాగారి నాల్గవ పెళ్లామట. ఇమెవచ్చి బహుభార్యత్వం నిషేధం కాకూడదు అంటుంది. ఇంకా వసతులు వుండాలంటుంది. పోట్లాడుతా నటుంది. అటువంటివారందరు తగిలించారు. సన్యాసులు బైలుదేశారు. స్త్రీలను త్రిప్పారు. పూర్వాచార పరాయణత్వం లేవదీశారు. మనదక్షిణాదిన మరీ అన్యాయంగా ఉన్నది. నయంగా ఉన్నది ఉత్తరాదిన. మతం చాల అపాయకరంలో ఉన్నది. శాసనాలలోను హిందు గృహస్థ ధర్మంఅంతా నాశనంచేస్తున్నారు. మన గృహజీవితం అంతాకూడా నాశనమైపోతుంది, మనయొక్క వేదశాస్త్రాలు పాడౌతున్నాయి, మన ఆచారాలన్నీ ధ్వంసము అవుతున్నాయి అనేటటువంటి పెద్దవాదన పెద్ద అల్లరి ఉత్తర హిందూస్థానములో మనకంటె చాలా ఎక్కువగా వున్నది. కనుక మనకు మొత్తంమీద బొంబై, మద్రాసులలో అభివృద్ధి కరమైనటువంటి ఈ బిల్లులు పెట్టి ఇండియాలో ఖ్యాతిగడించాము. తరువాత జవహరులాల్ యొక్క స్వంత పట్టుదలవల్ల, ఆయన నిజంగా గొప్ప ప్రజాస్వామికవాది, ఇండయాలోకల్ల అభివృద్ధి పరుడు. అభివృద్ధి వ్యతిరేక శక్తు లన్నింటినికూడా కొట్టివేసి అన్ని విషయాలు కూడా మానవ సమానత్వానికి ప్రపంచశాంతికి ప్రపంచ సోదరత్వానికి గాంధిగారి యొక్క సిద్ధాంతాలను అనుసరిస్తూ ప్రపంచాన్ని ముందుకు నడుపుతున్నాడు. ఇటువంటి ప్రజాస్వామ్యము మనం స్థాపించుకుంటే స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు కలుగజేసినటువంటి మన రాజ్యాంగ విధానం. నిజంగా యూరప్‌లో ఇప్పటికి కొన్ని దేశాలలో స్త్రీలకు రాజ్యాంగ హక్కులులేవు. ఫ్రెంచి విప్లవం జరిగినటువంటి ఫ్రాన్సులో మొన్న మొన్నటి దాకా స్త్రీలకు ఓట్లు లేవు. మానవస్వాతంత్ర్యం సమానత్వం అనగా సోదరత్వం రెండు పురుషులకే హక్కు. పురుషులలో ఒక తెల్లవాళ్ళకే అని ఎందు వల్లనంటే మొరాకో, ఆల్జిరియా, ట్యునిషియా, ఇంకా ఇప్పుడు ఇండో చైనా మీద ఫ్రెంచి వారికి ఇంకా రాజ్యంచేయాలనిలేదు. వాళ్ళయొక్క స్వాతంత్ర్యం అంతకు పరిమితమైపోయింది. ఇప్పటికి Parliament లో Members వేరు. ఫ్రాన్స్‌లో రూసోజన్మస్థానములో ఫ్రెంచి విప్లవం జరిగినటువంటిచోట స్త్రీలకు ప్రాతినిధ్యంలేదు. Parliament లో కాకుండా మనం చిన్న చిన్న సంస్కరణలు వచ్చినప్పటికికూడా మింటోమార్లె సంస్కరణలు తరువాత మాంటేగ్ . చెమ్సుఫర్డ్

Sri A. Kaleswara Rao] [1st December 1955

సంస్కరణలు ఆఖరికి Local Board Municipality వస్తున్నది. అందులోకూడా స్త్రీలను తీసుకోనబోతున్నాం. మనం చాలా అభివృద్ధిపరులము. స్త్రీలకు మనతో పాటు సమానమైనటువంటి హక్కులు తీసుకొస్తున్నాము. మనతోపాటు హరిజనులను తీసుకొని వచ్చాము. వర్ణభేదాలు లేకుండా సమానత్వం స్థాపిస్తూవచ్చాము. ఒక్క జవహర్‌లాల్ నెహ్రూగారియొక్క యాజమాన్యంక్రింద ఆయనయొక్క పట్టుదల వల్ల అప్పుడు ఇప్పుడు స్త్రీలకు పురుషులతో సమానమైనటువంటి ఆస్తిహక్కులు రావాలనేటటువంటి ఒకచట్టం ప్రవేశపెట్టి అది చాలా విచారణలు తర్జన భర్జనలతో జరుగుతున్నది. అయితే అది ఇంకా తృప్తికరంగా పరిష్కరించబడడంలేదు. ఇది సాక్షీగా సరళ ధోరణిలో పరిష్కరించబడాలి. ప్రతిచోట అడ్డంకులు ఉన్నాయి. ఇప్పుడు ఆఖరిమెట్టు ఏమిటంటే ఈ స్త్రీలకు చాలా అవమానకరమై నటువంటిది ఈ వరకట్నాల వ్యవహారం. ఆడపిల్ల పుట్టిందంటే కష్టంగాఉన్నది. నేను చిన్నప్పుడు ఒక కవిత చదివాను. అది రాయప్రోలు సుబ్బారావుగారు వ్రాశారు. అది ఏమిటంటే స్నేహలత అనేటటువంటి అమ్మాయి తండ్రి వరకట్నం ఇచ్చుకోలేక పోతే ఆ పిల్ల వరుని సంపాదించుకోలేక పోవడంవల్ల ప్రాణత్యాగంచేసినది. నేను చిన్నప్పుడు అది చదివాను. బహుశా 30, 40 సంవత్సరాలుక్రిందట చదివిఉంటాను. కాబట్టి ప్రతిచోట ఇండియాయావత్తుకూడా ఈ వరకట్నాలబాధ చాలా ఎక్కువగా ఉన్నది. డబ్బుడబ్బు అంటారేగాని వాళ్ళకా స్త్రీయొక్క అందము వాళ్లయొక్క కుటుంబమర్యాద ఆ పిల్లయొక్క సద్గుణాలు ఆ పిల్లయొక్కవిద్య అది అంతా అక్కరలేదు. ఆ పిల్లను M. A. Pass చేయించు, B. A. Pass చేయించు, సంస్కృతం, హిందీ చెప్పించు, విద్యావంతురాలుని చేయించు, మంచి కుటుంబంలో పెరిగింది అయినాసరే, నాకక్కరలేదు. నాకేమి ఇస్తారు అది నేను Fourth form pass అయ్యాను, 4 వేలు తేండి, నేను fifth form pass అయ్యాను 5 వేలు తేండి ఒక్కొక్క class కు ఒక్కొక్క వెయ్యి చొప్పున చాలా కఠినంగా క్రూరంగా వరకట్నాలు అడుగుతున్నారు. ఇది చాలా సిగ్గులేనటువంటి పని. వివాహం ఇది విషయం. నూరేళ్ల పంట. స్త్రీలయొక్క పురుషునియొక్క ప్రేమ అనేది, ఒకరిమీద ఒకరికి ప్రేమ ఉంటుంది. ఒకరినొకరు మెచ్చుకోవడం మీద, వారియందు ఉండేటటువంటి అంగీకారంమీద ఉంటుంది. అది అంతా పోయి నాకు డబ్బు ఇయ్యి, డబ్బిస్తే చేసుకొంటాను లేకపోతేలేదు. డబ్బు ఇస్తే ఎటువంటి పిల్లనైనా చేసుకుంటాను. నాకేమి అభ్యంతరంలేదు. అని ఈ మగ కుఱ్ఱవాళ్లు అంటున్నారు. వారి తండ్రులు చాలా కఠినంగా క్రూరంగా ప్రవర్తించడం చాలా అమానుషంగా ఉంది. మా అనుభవం ఇతరుల అనుభవం అందరి అనుభవంకూడా. నేనేమి ఆడపిల్లలు ఉండి కట్నాలు ఇచ్చినటువంటి వాడిని కాదు. మగపిల్లలు ఉండి కట్నాలు తెచ్చుకొనే వాడినికాను. అందువల్ల నేను నిష్పక్ష

పాతంగా చెప్పగలను. ఎక్కువ మగ పిల్లలు ఉంటే బేరాలు పోతాయని కాగు. ఆడపిల్లలు ఉంటే కష్టపడి ఆ పిల్లలకు కట్నం ఇవ్వాలనే తాపత్రయం కలవాడిని కాను. కనుక నిష్పక్షపాతంగా చెప్పగలనని, గౌరవనీయులైన అధ్యక్షులవారికి మనవిచేయ చేసుకొంటున్నాను. ఇందులో ఉండేటటువంటి ఈ సిద్ధాంతము అన్నదే అది జాతికి అవమానకరమైనటువంటిది. ఎక్కడైన రష్యాలో అడుగుతాడా? ఈ విషయంలో సుందరయ్యగారికి గొప్ప authority ఉన్నది. నవ్వు ఇంకడబ్బు ఇస్తే ఈ పిల్లను చేసుకొంటాను. జర్మనీలో అడుగుతారా? ఇంగ్లండులో ఉందా? అమెరికాలో ఉంటుందా? మనం వెనుకబడినటువంటి దేశమనుకోవడం గౌరవము కాదు. ఇండియాలో ఆంధ్ర దేశంలో ఈ పిల్లకు ఇంత డబ్బిస్తే తప్పచేసుకోను, నాకు డబ్బియ్యి అంటే, లేకపోతే లేదు? ఏమిచేస్తారు. తాకట్లు పెటతున్నారు ఆస్తులు. కాక రుణం 15 వేల వరకు డబ్బు ఉన్నదట. 50 వేలవరకు అడుగుతున్నారు. పాపం! ఆయనకు ఏమి చేయాలో తోచలేదు. 15 వేల డబ్బు ఉన్నదట. మాకు గౌరవం ఉన్నటువంటి ఒక కమ్మ ఆయన చెప్పాడు. వారి స్త్రీలు మాకు స్నేహం. మాయింటికి వచ్చివాళ్లు చెప్పారు. 15 వేలు ఉన్నది వగ్గర 50 వేలు అడుగుతున్నారు అయ్యా! ఎక్కడ తాకట్లు పెట్టటం? ఏమి చెయ్యటం? ఈ సంబంధం వదలు కోవడమా అని పోతూ ఉండేవారు. ఖర్మం చాలక ఏదో పెద్ద పరీక్షలు ప్యాసయినాడు. ఏదో ఉద్యోగంకూడా చేస్తున్నాడు. ఖర్మము చాలక వాడికి 600 రూపాయల జీతం. అతడికి 50 వేలు కట్నం కావాలి. దేశంయొక్క దురదృష్టంవల్ల ఈవిధంగా జరుగుతోంది.

ఇదిచాలా అమానుషకృత్యమైనది. కనుక ముందు నిషేధము అందాము. తరువాత ఇది సరిగా అమలుజరుగుతుందా అంటే ప్రజాభిప్రాయం అనుకూలంగా వుంటే అమలు జరుపవలె. విద్యార్థులు అనుకూలంగావస్తే అమలు జరుపవలె. విద్యార్థినులు పట్టుపడితే అమలు జరుపవలె. తల్లిదండ్రులు మేము కట్నాలు యివ్వము కట్నాలు పుచ్చుకోము అని చెప్పవలె. ఈ చట్టము ప్రజాభిప్రాయాన్ని వృద్ధిచేస్తుంది. ఇదివరకు ఉంటున్న ప్రజాభిప్రాయము దీనివల్ల బలపడుతుంది. కనుక దీనికి ఆక్షేపణ పెట్టడం సబబుగాదు. ఎవరైనా దొంగతనంగా పుచ్చుకొంటారేమో. కాబట్టి ఈ చట్టాన్ని కట్టివేయిఅంటే అర్థంలేదు. ఎవడైనా దొంగవాడు కన్నము వేస్తాడేమో! కాబట్టి Indian Penal Codeలోను ఆ sectionను కొట్టివేయి అంటామా? ఏదో జరుగుతుందని చట్టాలు కొట్టివేస్తామా? మనయొక standard ఏమిటో గమనించవలసి యున్నది. మనజాతియొక్క standard చట్టాలలో కన్పడు తుంది. మద్యపాన నిషేధము ఎందుకు పెట్టాలి? మనయొక్క standard అది. లోకోత్తర పురుషుడైనటువంటి అధ్యాత్మిక సంపన్నుడైనటువంటి గొప్ప స్వతంత్ర

Sri A. Kaleswara Rao] [1st December 1955

వాది అయినటువంటి మహాత్మాగాంధి మననాయకుడు. కాబట్టి ఆయన ఆదేశించినటువంటి అస్పృశ్యతా నివారణను మద్యపాన నిషేధమును ప్రవేశపెడుతున్నాము. ఏమైనా సరే అమలు జరుపుతాము. ఎక్కడో ఒకడు దొంగవాడు, తెలివితక్కువ వాడు, పిచ్చివాడు, త్రాగితే అంతమాత్రంచేత మానివేస్తామా? మనయొక్క చట్టాలు గ్రంధాలు వాఙ్మయము మనయొక్క అభివృద్ధికి మనయొక్క నాగరికతకు తార్కాణంగా ఉంటాయి. ఆ విధంగా ఎప్పుడుకూడ మన నాగరికతకు చిహ్నంగా ఉండేటందుకు దీనిని చేయమని చెప్పుచున్నాను. వరకట్నాల నిషేధమనేది నిజంగా మన సంఘముయొక్క నాగరికతకు ఒక చిహ్నంగా ఉంటుంది. వరకట్నాల యిచ్చి పుచ్చుకునేటటువంటి దౌర్భాగ్య పద్ధతిని అనుసరించకూడదు. ఇదితప్పు, ఇదిచేస్తే శిక్షింపబడుతారు, అనేటటువంటిది మనము చెప్పుతాము. పొట్టి శ్రీరాముల అఖండమైననటువంటి త్యాగమువలన సంపాదించినటువంటి ఆంధ్ర శాసనసభ ఇది. విశాలాంధ్ర కాబోతున్నది. అది ఇండియాలో ఒక పెద్దరాష్ట్రముగా ఉండబోతుంది. ఇటువంటి సమయంలో వరకట్నాలనేటటువంటి barbarious custom ను ఇటువంటి అనాగరికమైన పద్ధతిని రద్దుపరచమని, ఇది చేయకూడదని, చెప్పుచున్నాము. ఈ శాసనసభలో విజ్ఞానులైనటువంటి, ప్రజాప్రతినిధులైనటువంటి, మహామహులైనటువంటి వారు ఇక్కడకు వచ్చిఉన్నారు. ఇక్కడ అనేక రాజకీయ భేదాభిప్రాయాలు వున్నవారు ఉన్నారు. వీరందరుకూడ ఏకగ్రీవంగా చెప్పుచున్నారు. "ఆంధ్ర ప్రజలారా! ఇదిచేయడం తప్పు, చేస్తే శిక్షిస్తాము" అని ఒకసందేశాన్ని ఒక ఆదేశాన్ని ఆంధ్రప్రజలకు అందజేస్తాము. అయితే ఇది ఎట్లా జరుపబడుతుంది అని అంటారు. అది ప్రజాభిప్రాయమువల్లనే అమలు జరుపబడుతుంది. దీనికి, మద్యపాన నిషేధానికి భేదమున్నది. మద్యపానం విషయంలో ఎవడో తెలివితక్కువవాడు త్రాగుతాడు. త్రాగితే వాడే చెడిపోతాడులే, అంటాము కాని ఇక్కడ అదికాదు. ఇందులో రెండుపార్టీలుగా వున్నారు. ఇక్కడ తండ్రులు రెండుపార్టీలు ఉన్నారు. అందులో ఒకపార్టీ మనపక్షమువారు. మద్యపానం విషయంలో పోట్లాటంతా వ్యక్తికి ప్రభుత్వానికే. అక్కడ రెండుపార్టీలు లేవు. ఎక్కడైన తాగితే, వాడేదో పిచ్చివాడు, డబ్బు పోగొడుతున్నాడు అని జాలిపడుతాను. వాణ్ణి పట్టియివ్వాలనే పట్టుదలలేదు. కాని యీ విషయంలో రెండు sections ఉన్నాయి. ఒక పక్షమువారు నిర్భయంగా డబ్బుపుచ్చుకుందామని అంటారు. రెండవపక్షంవారు ఏమైనాసరే కట్నాలులేకుంటే సుఖపడుతామని అంటారు. ప్రతి కుటుంబంలోను రెండువిధాలున్నాయి. మగపిల్లల విషయంలో నాలుగుడబ్బులు సంపాదించుకుంటాములే అనుకొన్నా, ఆడపిల్లలనుచూచినప్పుడు వీరికి కట్నాలు ఎక్కడి ఇచ్చుకోగలము అని బాధపడుతారు. కాబట్టి మనకు యిందులోవున్న లాభమేమిటంటే, మద్యపాన నిషేధమువలె, ఇది fail అవుతుంది.

ఇది పోలీసువాళ్లమీద నే ఆధారపడుతుంది అని అననక్కరలేదు. ఎవడో ఎక్కువ డబ్బుగలవాడు ఇచ్చుకుంటే, ఇచ్చుకుంటాడు. కాని సామాన్యమైన వేలకొలది లక్షలకొలదిఉన్న middle class ప్రజలకు సంబంధించినంతవరకు యిదిచాలా ఉపయోగకరంగా వుంటుందని నేను మనిచేస్తున్నాను. ఇక దీని అమలు జరపడమంటారా, ప్రజాభిప్రాయంమీద ఆధారపడివున్నది. రెండవది ఆడపిల్లలకు ఆస్తులు వస్తున్నాయికదా, ఈచట్టముయొక్క ఆవశ్యకత యేమిటిఅనవచ్చును. ఇండియాలో హిందూ ధర్మశాస్త్రము రెండువిధాలుగా ఉన్నది. దాయభాగము, మితాక్షరము అని. దాయభాగమువల్ల joint కుటుంబమైనప్పటికిని ఎవరివాటాకు వారికి సర్వహక్కువున్నది. తండ్రివాటాకు తండ్రికి సర్వహక్కు వున్నది. కొడుకుల వాటాకు కొడుకులకు సర్వహక్కు వున్నది. ఈ విధముగా యెవరి వాటాకు వారికి సర్వహక్కు ఉండడమువల్ల, ఆ తండ్రి చచ్చిపోయినా అతనియొక్క కొడుకులకు భార్యకు కూతుళ్ళకు. ఆవారసత్వం ప్రకారం వాటావస్తుంది. ఇది దాయభాగములో ఉన్నటువంటి తేలికైనమార్గము. అయితే మితాక్షరము అట్లు కాదు. మనమంతా మితాక్షర చట్టముచే govern అవుతున్నవాళ్లము. మన ఆంధ్ర దేశానికి వర్తించేటటువంటిది, మితాక్షరధర్మమే. అందులో పిత్రార్జిత ఆస్తిరావడంతోటె తండ్రి, తాతగారి ఆస్తివస్తుంది. తండ్రికి, కొడుకులకు, కొడుకు లేకపోతే కొడుకు కొడుకులకు, మనుమలకు, ఈ విధంగా మూడుతరాలవరకు జన్మహక్కు ఉన్నది. కాబట్టి ఎట్లా తీసివేస్తారు? సమిష్టి కుటుంబములో విల్ వ్రాయడానికి లేదు. Joint కుటుంబములో దానము చేయడానికికూడ లేదు. కాబట్టి మితాక్షరము చట్టముక్రింద కొడుకులకు ఉన్నటువంటి ప్రత్యేక హక్కులు తీసివేయకుండా కూతుళ్లకు ఏమి ఇస్తారని చాలా తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఇవ్వడానికిలేదు. కొడుకులకు ఉన్నటువంటి ప్రత్యేకహక్కులు రెండు విధాలు, కొడుకులకు ప్రత్యేక హక్కుతీసివేసి, ఈ పుట్టుకవల్ల కలిగేటటువంటి హక్కులు తీసివేసె దాయభాగము క్రింద ఏర్పాటుచేయవలెనని కొందరు కోరుతున్నారు. అది ఒప్పుకోలేదు. ఎందుకంటె, కొడుకులకు, మనుమలకు, మునిమనుములకు నష్టంవస్తుంది. పుట్టుకతో ఉండే హక్కులు తీసివేయవద్దు అని అంటున్నారు. దాయభాగమునకు Convert చేయకూడదని, దాయభాగముక్రింద వేస్తేనే వారికి స్వతంత్రభాగముగాని, హక్కుగాని ఉంటుంది. Personal property నస్తుంది. అతని ఇష్టము వచ్చినట్లు చేసుకోవచ్చు. రెండవది లేకపోతే, కూతుళ్లకు, కొడుకులతోపాటు పుట్టుకతోటి ఇచ్చిన, సమానంగా ఉంటుంది. ఇద్దరు కొడుకులు ఉన్నారు అనుకోండి, ఆ ఇద్దరు కొడుకులకు పుట్టుకవల్ల హక్కుఉన్నది. తండ్రులయొక్క ఆస్తిలో, ఆ హక్కులు న్యాయమైన కార్యాలకుతప్ప అన్యాక్రాంతము చేయలేదు. ఒక కుటుంబములో, ఇద్దరు కొడుకులు, ఇద్దరు ఆడపిల్లలుఉంటే నలుగురికి హక్కుఉండేటట్లు చేయ

వచ్చుఅంటే దానికి ఒప్పుకోనడంలేదు. మితాక్షర చట్టముబట్టి, ఆడపిల్లలకు న్యాయంగా హక్కులు కొడుకులతోపాటు సమానంగా రానడానికి అవకాశము లేకుండాఉన్నది.

SRI P. SUNDARAYYA :—ఇప్పుడు రాజ్యసభలో జరుగుతున్న బిల్లుప్రకారం కొడుకుకు ఎంతవాటా ఉంటుందో కూతుళ్లకుఅంత వాటా ఉంటుంది. అటువంటిబిల్లు అక్కడ pass అవుతున్నది. కూతుళ్లకుకూడ న్యాయమైనహక్కు ఇచ్చేదానికి, ఆ బిల్లు చేయడం జరుగుతున్నది. అయితే ఈ వరకట్నాల సమస్యలేదు. దాని నిషేధములో మాకేమి అభ్యంతరంలేదు.

SRI A. KALESWARA RAO :—కొంచెము క్షమించాలి. సుందరయ్యగారికంటె నేను Hindu Law లో expert ను కనుక నేను అదంతా జాగ్రత్తగా చూస్తున్నాను. ఇంకా దీని విషయము తర్జన భర్జనలు జరుగుచున్నాయి. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా చెప్పుచున్నారు చివరకు అది ఏ shape లో వస్తుందో చెప్పడానికిలేదు. రెండుసభలలోను Pass అయినస్తే సంతోషమే. కాని ఈ వరకట్నాల బిల్లుకు దానికి సంబంధంలేదు. కూతురుకు తన వాటా రావలసినప్పటికిని, కూతురుకు పెండ్లి చేసేటప్పుడు అల్లుడు అడుగుతాడు. ఇస్తాడో లేదో అని అది ఇప్పుడే ఇవ్వమంటాడు. లేకపోతే పెండ్లి చేసుకోనంటాడు. ఈ విధంగా ఉంటుంది.

కాబట్టి వరకట్నాలబిల్లుకున్నూ, ఈ ఆడపిల్లలకు కొంత ఆస్తివస్తుందనేటటువంటి వుద్దేశ్యానికిన్ని ఏమిసంబంధంలేదని నేను మనవిచేయుటానికి ప్రయత్నిస్తున్నాను. ఇదంతా రాజ్యసభలో పెట్టినటువంటి amendments. తర్వాత మరల అవి Lok Sabha కు బోయి అక్కడ చర్చజరిగి పూర్తిఅయిన తర్వాతగాని, ఆ బిల్లుయొక్క సమగ్రరూపముచూస్తే అది ఎంతవరకు వస్తుందో, చూసుకుందాము. సరే, ఏది ఎట్లావున్నా, దానికి, యీ వరకట్నాలబిల్లు అవసరంలేదని చెప్పడం న్యాయంకాదు. దీనికి రెండే ఆక్షేపణలువున్నవి. (1) అమలుజరిగేదెట్లాగు? (2) వాళ్ళకు ఆస్తివస్తుంది, ఏమిపరవాలేదు, అనేటటువంటిది. ఈ రెండుమాటలున్నవి. అల్లుడు నాకుకావాలంటాడుగాని, కూతురుకిచ్చుకునేదిగూడ అతను లక్ష్యపెట్టడు. నాకేమియిస్తావంటాడు. ఇవ్వాళే వ్రాసియివ్వమంటాడు. అదిగాక తండ్రికి నలుగురుకూతుళ్లు వుంటారు. ఇతను అడిగేది చాల ఎక్కువ. ఆ పిల్లలకు agricultural land లో ఎంతో వస్తుందో? కనుక ఆ వంతుకే సరిపెట్టుకుంటాడనికాదు. కాబట్టి ఈ వరకట్నాలున్నవే. యిదియొక బేరం. బేరం ఏమిటంటే "నేను మొగవాడిని, నేను ఏదో English చదువుకున్నాను, పరీక్షలు ప్యాసు అయ్యాను, గనుక వుద్యోగం చేస్తున్నాను. అంటే నా విలువ ఎంత అంటె పదిహేనువేలు, నా విలువ ముప్పది వేలు," అంటాడు. ఈ ఆడపిల్ల అనేది

ఒక పురుగు క్రింద లెక్క. ఏమి విలువలేదు. ఆ ఆడపిల్లకు విలువలేదు. ఆ యువతికి మానవ విలువలేదు. "నా డబ్బే విలువ. నా కింతయిస్తే చేసుకుంటాను. లేకపోతేపో, అవతలకి, పో! ఆ మోస్తరుగ వుండటం అనేది అది పురుషులయొక్క నిరంకుశత్వానికి ఉదాహరణగా వున్నది. అది తొలగించడమే యీ బిల్లు యొక్క ముఖ్య వుద్దేశ్యం. నేను చాలాసేపు time తీసుకున్నాను. ఉపాధ్యక్షుల వారితో మనవి చేస్తున్నాను. ఈ బిల్లులో పెట్టినటువంటి కొన్ని clauses తమకు చదివి వినిపిస్తాను.

ఈ బిల్లులో ఏమి వ్రాసి యున్నదిన్నీ నేను మనవి చెయ్యడం-నా ధర్మం. ఈ బిల్లు రెండు విధాలుగా వర్తింస్తుంది. ఆంధ్ర దేశంలో నివసించే శాశ్వత నివాసం కల్గినటువంటి వారికి యిది వర్తింస్తుంది. ఈ వివాదపు వారి రెండు పార్టీలలోనూ, ఏ ఒక్కరు శాశ్వతంగ నివాసులయినప్పటికీ, వారిని domicile అని అన్నారు. ఆ domicile కు Indian Succession Act దానియొక్క sections క్రింద, వాళ్లు పుట్టడం, వాళ్ళ తాత తండ్రులు పుట్టడం యిదివారిని పౌరసత్యపు హక్కు, కనుక యిది ఆంధ్ర దేశంలో వున్నది. ఆంధ్ర దేశం అంటే ఏమిటి? Audhra State అంటే యిప్పుడు ఆంధ్రలో వున్నటువంటి area. ఈ area ఇదివరకు Madras రాష్ట్రంలో వున్నప్పటికి ఈ area కు వర్తింస్తుంది. ఎందుకంటే, వెనుకటి సంబంధం అంతా, domicile అంటారు. వాళ్ళ తాతల, ముత్తాతల సంగతి చెప్పుతున్నాను. గనుక, ఈ area కు అంతా శాశ్వతంగా వర్తింస్తుంది. ఇక్కడ ఇక్కడ శాశ్వతంగా వుంటే వాళ్ళకు వర్తింస్తుంది. ఆ శాశ్వతంగ వుంటే వాళ్లు, వివాహపు పార్టీలో ఒకరైనప్పటికినీ, వారి వివాహానికీ వర్తింస్తుంది. ఆ వివాహానికి, ఆ వివాహము విషయంలో, ఈ పిల్లను చేసుకోటానికి ప్రతి ఫలముగ, పురుషుడికి గాని, పురుషుని తరఫు వారికిగాని ఆఖరుకుపిల్లకైనా సరే అగి వర్తింస్తుంది. ఎందుకంటే, మీ పిల్లకు 10 (పది) వేల రూపాయిల నగలు పెట్టితే చేసుకుంటాను అంటాడు. కాబట్టి పిల్లకుగాని, పిల్లవాడికిగాని, ఇతరులకుగాని, ఈ పిల్లను చేసుకోడానికి, ప్రతి ఫలముగ ఏమి యివ్వకూడదు. అదే dowry. దానిపేరే dowry. ఈ dowry చెల్లదు. ఇకను ఆడ పిల్లకు అత్తవారు పెట్టే నగలు అవన్నీ వీటి క్రిందకురావు. అవన్నా మనము పెట్టుకోలేదు. Mohammadan Law లో యిస్తారు. దానికేమి సంబంధంలేదు. కాని వివాహకాలంలో, బంధువులు ఆడిపిల్లకుగాని, మొగపిల్లవాడికిగాని, 300 రూ॥ లు కంటే మించని బహుమతులు యిస్తారు. ఆ బహుమతుల్లో మొగవాడికిచ్చేదే యిందులోనికి వస్తుంది. మొగ వాడికిగాని అతని తరఫు వారికిగాని యిచ్చేవి ఎవరికైన వ్రాసి యివ్వవచ్చును. లేకపోతే అతని మేన మామకు నోటు వ్రాసి యిస్తారు. కాబట్టి అది వస్తుంది.

MR. DEPUTY SPEAKER :—మగపిల్లవాడికి సొమ్ములు చేయించి యిస్తారనుకొండి. అప్పుడు అది వస్తుందా ?

Sri A. KALESWARA RAO :—అది కూడా వస్తుంది. మగవాడికి బంగారు సొమ్ములు చేయించినా, నోట్లు వ్రాసియిచ్చినా, డబ్బుయిచ్చినా. తాకట్టు వ్రాసియిచ్చినా, దీని క్రిందికి అన్నీవస్తాయి. మగవాడికి యిచ్చేది అంతా వస్తుంది. మూడు వందల రూపాయలకు మించనివి ఏదో పట్టు బట్టలు వస్త్రాలు చిన్న చిన్నవి తప్ప, మిగిలిన అన్నీ యిందులోకి వస్తాయి. ఇంకొక విషయము యేమిటంటే, యితర చోట్లలో వున్నవారు యిక్కడికి వచ్చి పెళ్ళిచేసుకుంటే, వాళ్ళకు యిది వర్తిస్తుంది. బొంబాయి వాళ్లు వస్తారు. పెళ్ళి యిక్కడ జరుగుతుంది. వారు domiciles కాదు, వాళ్ళకు గూడ వర్తిస్తుంది. కాబట్టి యిది ఆంధ్ర దేశములో జరిగే పెళ్ళిళ్లకు వర్తిస్తుంది. ఆంధ్రులు అనేవారు ఎక్కడికిపోయి పెళ్లి చేసుకుని వచ్చినప్పటికినీ, యిది వర్తిస్తుంది. పెళ్లి యిక్కడే చేసుకోనక్కరలేదు. ఎక్కడకుబోయి చేసుకుని వచ్చినా, వర్తిస్తుంది. పెళ్లికి సంబంధించిన వరకట్నం కంట్రాక్టు చెల్లదు. ఆ కంట్రాక్టు నిషేధము క్రిందకు వస్తుంది. డబ్బు యిస్తే, నేరమవుతుంది. డబ్బు యిచ్చినా, పుచ్చుకున్నా, కంట్రాక్టు పుచ్చుకున్నా, అది నేరమే అవుతుంది. కాబట్టి ఆ నేరము క్రింద పోలీసువారు కేసుపెట్టవచ్చును. ఇంకా యితరులు ఎవరైనాగూడ కేసు పెట్టవచ్చును. పదహారు సంవత్సరాలు మించని వయస్సుగల వారికి శిక్షలేదు. ఈ వయస్సుకు పైబడి మించినవారందరికీ శిక్షవుంటుంది. శిక్ష ఒక ఏడాది తప్పకుండా వుంటుంది. ఈ శిక్ష చాలా అవసరము.

Mr. DEPUTY SPEAKER :—మగవారికి marriageable age యింత అని prescribe చేశారా ?

Sri A. KALESWARA RAO :—Marriageable age అనేది యిక్కడ శిక్షకులేదు. ఎందుకంటే 12, 13 ఏండ్లవాళ్లు మైనర్లు కాబట్టి, వారికి శిక్ష లేదు. అంతేకాదు. Marriageable age, marriage నిషేధంకాదు, యిది marriage నిషేధించదు. Marriage చెల్లకపోవడము అనేదికాదు. శిక్షకే యీ age limit 16 సంవత్సరాలు అని చెప్పింది ఎందుకంటే, అందులో అట్లాగే పెట్టాము. బహుభార్యత్వపుబిల్లులోకూడా 16 సం॥లపై వారికే జైళ్లకు పంపడమనే నిర్బంధము పెట్టాము. జరిమాన వేయవలసిందేగాని, ఖైదీ లేకుండా చేయడముగాని, లేక fine వేయడముగాని, యివి రెండున్నూ యిందులోని ప్రధానభాగాలు. పోతే, యిందులో ఏమి పెట్టాలంటే, రెండేళ్లలోపల పదిహేనురూపాయల స్టాంపుమీద సివిల్ కోర్టులో డౌరీ యిచ్చినవారు, తిరిగి దాన్ని రాబట్టుకోటానికి వ్యాజ్యము వేసుకోవచ్చును. స్టాంపు మాత్రము పదిహేనురూపాయలు. అది Original Petition గా వేస్తారు. Plaint

కాదు. సివిల్ కోర్టులో వేయవచ్చును. దానిమీద అప్పీలు వుంటుంది. ఆమోస్తరుగా దావావేసి రాబట్టుకోవచ్చునుగూడా. ముఖ్యంగా రాబట్టుకునేది ఎక్కడఅంటె, ఎక్కడో వివాహము జరుగుతుంది, ఎక్కడో కంట్రాక్టు జరుగుతుంది, జరిగితే, యిక్కడ పోలీసుకేసు పెట్టటానికి అవకాశమువుండదు. Criminal law లో ఎప్పుడూకూడా, ఎక్కడైతే నేరము జరుగుతుందో అక్కడ పెట్టాలి. నేరము అంటే, యివ్వడం, పుచ్చుకోవడం, యివ్వటానికి జరిగిన agreement ఇది అప్పుడు కాకపోయినా, యింకొకరోజున జరగవచ్చు. అటువంటివాటిల్లో యిచ్చినటువంటి వాళ్లు వ్యాజ్యమువేసి రాబట్టుకోవచ్చు.

Sri RAJA V. V. KRISHNAMRAJA BAHADUR :—On a point of order, Sir. కాళేశ్వరరావుగారు యింత మొత్తము అని పుచ్చుకుంటే, శిక్షపడుతుందని అన్నారు. ఈ శిక్ష పెళ్ళిఅయిన పెళ్ళికొడుకా? పెళ్లికూతురుకా? లేక సంబంధము మాట్లాడిన తండ్రికా? లేక పెళ్లికూతురు తండ్రికా? రెండవది, పదివేలరూపాయల వస్తువులు చేయించి నా పిల్లకు అలంకారముగా పెట్టుతాను. అదిగూడ శిక్షయేనా? అదియేమిటో సవిస్తరముగా తెలియజెప్పాలి.

Mr. DEPUTY SPEAKER :—వివరంగా చెప్పండి.

Sri A. KALESWARA RAO :—అత్తవారు కోడళ్లకుపెట్టే నగలు యేవీగూడా యిందులోనికిరావు. అది వారి యిష్టము. భాగ్యవంతులు అయినవారు, ఆడపిల్ల మా యింటికి కోడలుగా వచ్చిందని, ముద్దుముచ్చట్లుగా ఎన్నినగలన్నా పెట్టుకోవచ్చు. అవిఏవీ యిందులోనికి రావు. మగపిల్లవాడికి ఆడపిల్లతరపు వారు యిచ్చేదే వరకట్నము క్రిందకు వస్తుంది. అదే నేరము. శిక్ష ఇప్పుడు మనలో అవి మూడువిధాలుగావున్నవి. కన్యాశుల్కము, వరశుల్కము, యింకొకటివున్నది. కన్యాశుల్కముఅంటే, ఆడపిల్లను కొనుక్కొని రావడము పుట్టింటివారు పెళ్ళికూతురు యొక్క వివాహకాలములో లంచముగా పెట్టకూడదుగాని, మామూలుగా పెట్టుకోవచ్చు. (Interruption by hon members) on a point of information Sir. ఇప్పుడు వరకట్నము యిచ్చేది రొక్కమురూపములోగాని, యింకాయితర విధాలుగా గాని, నిషేధముఅని పంతులుగారు శెలవిస్తున్నారు. ఇప్పుడు కాబోయే అల్లుడు తిరగటానికి పదివేలరూపాయలుపెట్టి కారుకొనియిచ్చినా, లేక రాబోయే ఎలెక్షను ఖర్చులక్రింద ఒక పాతిక వేలరూపాయలుయిచ్చినా, లేకపోతే, వెయ్యి

రూపాయలు పెట్టి రేడియో కొనియిచ్చినా, యిటువంటివియిస్తేగూడా అని నిషేధం క్రిందకు వస్తాయా ? వీటికి definition చెబుతారా ?

MR. DEPUTY SPEAKER :—సభ్యులు ఏవో వివరాలు అడుగుతున్నారు చెప్పండి.

SRI A. KALESWARA RAO :—అదే మనవి చేస్తున్నాను. పిల్లను చేసుకోటానికి కండిషనుగా కోరుకొని యిచ్చినా వస్తుంది. ఎలెక్షను ఖర్చులు యిచ్చినా వస్తుంది. లేకపోతే ఆస్తిరూపముగా యిచ్చినా వస్తుంది. అది అంతా అందులోనే చేరుతుంది. ఫలానా అని అక్కరలేదు. కోరుకొనియిచ్చినది ఎలెక్షను కోసము కాదు. పిల్లను చేసుకున్నదానికే. (Interruption) ఆ అభిప్రాయము యిప్పుడు ఎందుకు ? నేను తరువాత చెబుతాను. కనుక అక్కడెక్కడో నేరము జరిగితే, అది పోలీసు యాక్షన్ క్రిందికి రాకపోవచ్చును. ఇక్కడ పెళ్లిజరగటానికి వీలులేనప్పుడు, యిచ్చినది రాబట్టుకోటానికి ఒక provision గూడా యీ బిల్లులో పెట్టాము. కనుక వరకట్నాలు ఏ రూపములో యిచ్చినా, ఆఖరుకు అది కారు రూపములోనైనా, వరకట్నమే. నోటురూపములోనైనా వరకట్నమే. డబ్బురూపములోనైనా, వరకట్నమే. ఎలెక్షనులో సహాయము చేసినా వరకట్నమే. వరకట్నముఅంటే, పెళ్లికొడుకు అయ్యేవాడికి పెళ్లికి పూర్వము గాని, పెళ్లిజరిగేటప్పుడుగాని, దరిమిలాగాని, యిస్తే, అది కంట్రాక్టు ప్రకారము వరకట్నము క్రిందకు వస్తుంది. అది నిషేధం. దానికి శిక్ష వుంటుంది.

శిక్ష ఎవరికిఅని కృష్ణంరాజ బహదూర్ గారు అడిగారు. పెండ్లికుమారునకు పెండ్లికూతురును ఇచ్చినవారికి పుచ్చుకున్న వారికి, సహాయం చేసినవారికీకూడాఅందరికీ శిక్షవున్నది. ఇచ్చినవారు పుచ్చుకున్నవారు అసలు నేరస్థులు. వారికి సహాయముచేసినవారు abettors. వారికి సగముశిక్ష అని శిక్షపెట్టాము. పిల్లను యివ్వడముద్వారా, పిల్లను చేసుకోవడముద్వారా లాభము పొందినవారికి సంవత్సరమునకు మించకుండా శిక్షఉంటుంది. సహాయము చేసినవారికి, పౌరోహితునకు, బంధువులకు 6 నెలలకు మించమించకుండా శిక్షవుంటుంది. ఇది ఈ బిల్లుయొక్క తాత్పర్యము. ఈ బిల్లును ప్రజాభిప్రాయమునకు పంపిస్తున్నాము కనుక దానికి ఏప్రెలు ఒకటవతేదీనాటికి. ప్రజాభిప్రాయము వస్తుంది. అన్నిసంఘాలు, అన్నిపార్టీలు ముఖ్యంగా స్త్రీల సంఘాలు, యువకులు, యువజనులు అందరూకూడా దానిని గురించి అభిప్రాయాలు ప్రాయాలు చెబుతారు. అప్పుడు దానిని సెలక్టుకమిటీకి పంపించి తరువాత చూద్దామని ప్రస్తుతం ఇంతవరకే మనవిచేస్తున్నాను.

[1st December 1955

Mr. DEPUTY SPEAKER :—కాళేశ్వర రావు గారి బిల్లుకు విజయభాస్కర రెడ్డిగారు పెట్టిన సవరణ ఒప్పుకున్నాము కాబట్టి, ఆ సవరణతో సహా ఇప్పుడు యీ బిల్లుమీద చర్యజరుగుతుంది. ఇందులో పాల్గొనేవారు పాల్గొనవచ్చును.

SRI M. R. APPA RAO :—ఉపాధ్యక్షా, మన కాళేశ్వరరావు పంతులు గారు మన అసెంబ్లీకి జాంబవంతుడువంటివారు. వీరు చాలా పెద్దవారు. చాలా కాలము నుంచి ఈ బిల్లు వారిఉద్దేశ్యములోవున్నది. చాలామంది ఉద్దేశ్యమే, కాని బిల్లులో వున్న కొన్ని విషయాలుమటుకుచూస్తే వారు ఇతరదేశములలో వున్న ఆచారాలతో పాటు మన ఆచారాలుకూడా చేసేపద్ధతిలో వున్నారు. కొన్నిటికి మాత్రము నాకే ఒప్పుకుంటారని నేను మనవిచేస్తున్నాను.

SRI. A. KALESWARA RAO :—ఉపాధ్యక్షా, ఒకమాట చెప్పడము మరచిపోయినాను. ఈ బిల్లును మనము ఇక్కడ ప్రవేశపెట్టిన తరువాత అప్పడే మొరార్జీదేశాయిగారు బొంబాయిలో ఈ బిల్లును ప్రవేశపెట్టేందుకు ప్రచురించారు.

MR. DEPUTY SPEAKER :—అయితే మీకు పోటీగా వచ్చిందన్నమాట.

SRI A. KALESWARA RAO :—ఇప్పుడు మళ్ళీ పోటీవచ్చింది. ఈ విషయం మద్రాసుమెయిలులో అక్టోబరు 25 వ తేదీన పడింది. వారు గెజెట్‌లో ప్రకటించుకున్నారు. అది అధికారబిల్లు కాబట్టి ప్రచురించుకున్నారు. U. P. నుంచి ఒకరు నాన్ అఫీషియల్ బిల్లు ప్రవేశపెట్టాలని నాకు ఉత్తరంవ్రాశారు. ఒకకాపీ వారికి పంపాను. ఇదికూడా మీకు మనవిచేస్తున్నాను.

MR. DEPUTY SPEAKER :—అందరికంటె మీరే ముందంజ వేశారన్నమాట.

**Now, the Andhra Dowry Prohibition Bill, 1955 moved by Sri A. Kaleswara, and the amendment moved by Sri K. Vijaya Bhaskara Reddi are before the House for discussion.**

SRI P. NARASIMHAPPA RAO:—అధ్యక్షా! బొంబాయిలో పెట్టబోతున్నవారుకూడా వారిలాంటివారేనని నాఉద్దేశ్యము. ఎందుకుఅంటేవారు వీరియొక్క ఉద్దేశ్యప్రకారం వెళ్ళడానికి ప్రయత్నించారు కాబట్టి. అసలు బ్రిటిషువాళ్లు మన దేశానికి వచ్చినప్పుకూడా మన కుటుంబసాంప్రదాయాలలో మాత్రం వారు జోక్యం

Sri P. Narasimhappa Rao] [1st December 1955

కల్పించుకోమని, అప్పటి రాణీగారుకూడా ప్రకటించారని చాలామంది పెద్దలు చెప్పుకుంటారు. కాని యిప్పుడు వారు చెప్పేటప్పుడు పోలీసువారు action తీసుకో వలసిందన్నారు. పెండ్లిచేసుకోడానికి దొంగతనముచేస్తే పట్టుకొనే పోలీసువారు action తీసుకొంటే దానిలో ఎంతవరకుఇచ్చింది వుందో వారు కొంచెము యోచించుకోవాలని మనవిచేస్తున్నాను. మన కుటుంబ వ్యవహారాలలో భార్యాభర్తలు పడుకుంటే పోలీసువారువచ్చి action తీసుకుంటే ఎట్లావుంది? పెండ్లిచేసుకొంటే కట్నం వీరు చూసేటట్లుగా ఇవ్వాలనే ఉద్దేశ్యంఉన్నదా? చూసినట్లుగా ఇస్తారని వీరివుద్దేశ్యమా? ఎవరుకూడా ముందు కట్నంతీసుకోకుండా పెండ్లి చేసుకోరు, అటువంటప్పుడు వీరుపెట్టే బిల్లుకనుక ప్యాసుఅయితే ఇప్పుడు ఎంతోమంది స్త్రీలు రజస్వల అయినవారు వారి యిష్టానుసారంగా ఎవరితోనో లేచిపోయే పరిస్థితి ఈ బిల్లు వల్ల కలుగుతుందనిపిస్తోంది కారణం యేమిటంటే బహిరంగంగా కట్నం యివ్వకూడదు, కట్నముయిస్తే శిక్ష, కట్నంయిస్తేనేగాని పెండ్లాడడు. లోపాయికారీగా ఇస్తే వాడు ఒప్పుకోడు. అటువంటప్పుడు ఎవరికిస్వేచ్ఛ. వారు చెప్పినట్లుగా విదేశాలలో ఎవరు యిష్టమువచ్చినటు వారు డ్యాన్సులు చేసుకొని ఇష్టానుసారంగా ఎట్లా వెళ్లిపోవచ్చో ఇక్కడకూడా అదేరకంగా కనబడుతున్నది. ఇప్పుడు వారు చెప్పినట్లుగా కట్నం చేతికి యివ్వరుగదా? మధ్యవర్తివచ్చి ఏ 20 వేలో 30 వేలో ఇస్తేనేగాని పెండ్లికి ఒప్పుకోరు. అందువల్ల కొందరు 15 రోజులకు ముందరే ఇచ్చివేస్తారు.

మావూరిలో ఒక పెండ్లి అయింది. కట్నం 5 వేలకు ఒప్పుకొన్నారు. ఇంటికి వెళ్లినతరువాత ఎనిమిదివేలు యిస్తేనేగాని చేసుకోమన్నారు. అప్పుడు వెంటనే 3 వేలు పంపి 5 రోజులు తరువాత పెండ్లిచేసుకున్నారు. ఈ విధంగా జరిగితే మనకు ఎక్కడ ఋజువుఅవుతాయి? ఈబిల్లును అల్లరికి తీసుకువచ్చారేగాని, జరిగేది ఎట్లాగు జరిగితీరుతుంది.

ఇప్పుడు మారిటోరియంబిల్లు పెట్టారు. అది ఆగిపోయిందా? ఎక్కడఅయితే పార్టీవున్నదో అక్కడే కేసువస్తుంది. లేనిచో 3 మాసముల పిల్లవానికికూడా మా ప్రాంతంలో వివాహము చేస్తున్నారు. మీరుచేసేది మంచిఉద్దేశ్యమే. కాదనడములేదు. మనం నీతులు చెప్పవచ్చును గాని, వాటిని ఆచరణలో పెట్టడమే కష్టమవుతుంది. వారికి పిల్లలు లేకపోవచ్చును. కొంతమంది అగ్రహారకులు బ్రాహ్మణులు వున్నారు. వారికి యిప్పుడు అగ్రహారాలు పోయినాయి. వారికి యిప్పుడు యింకేవిధమైన ఆస్తిలేదు. కట్నం ఇచ్చుకోవడం చాలాకష్టము అవుతుంది. అందులో చాలా యిబ్బంది ఉన్నదని మన గోపాలకృష్ణయ్యగారుకూడా చెప్పారు. నిజమే.

ఇప్పుడు వివాహం కాకుండా 10, 15 ఏళ్లు రాగానే ఎంతమంది రజస్వలఅయి వివాహముకాక 25 ఏళ్లవరకు వచ్చినవారు ఉన్నారు. ఇప్పుడు వారు చెప్పినట్లు విదేశాలలో మోస్తరుగా జరగాలా ? అక్కడ 30 ఏండ్లవరకు పెండ్లిచేసుకోరు. మన ఆడవారు 30 సంవత్సరాలు వచ్చేప్పటికి ముసలివారు అయిపోతారు. ఇక్కడికి అక్కడకు తేడావున్నది. ఆదేశ ఆచారాలను ఇక్కడ ప్రవేశపెట్టడం కుదరదు. అందువల్ల వారు ఈ విషయము మరల జాగ్రత్తగా ఆలోచించి కొన్ని సవరణలుచేసి కొన్నికొన్ని జాతులకు పెట్టితే బాగుంటుంది. గాని ఇలా మొత్తమువీద పెట్టడము బాగుండదని వారికి ముఖ్యంగా మనవిచేస్తున్నాను.

ఇప్పుడు కొంతమంది 10 రోజులకుముందర డబ్బు ఇస్తేనేగాని ఒప్పుకోరు. అప్పుడు వీరు ఏ act పెట్టుతారు. ఏ పోలీసువారినిపోయి పట్టుకోమంటారు. పుచ్చుకున్నవాడికి ఇచ్చేవాడికి తప్ప ఇంకెవ్వరికి కట్నం పుచ్చుకున్నట్లు తెలుస్తుంది. దానికి ఎక్కడనుంచి C. I. D. లను వేస్తారు. దానికొరకు వీరు staff కూడా పెంచాలి. ఇప్పుడే పోలీసులకు మద్యనిషేధంఒకటి అప్పగిస్తున్నారు. ఇప్పటికే ఒకటికి, రెండుపనులు అయినాయి. ఇప్పుడు ఇందుకు మూడుపనులు అవుతాయి. అందువల్ల దానినిగురించి పూర్తిగా ఆలోచిస్తే బాగుంటుందని చెప్పి యింతటితో విరమిస్తున్నాను.

Sri P. THIMMA REDDI :—అధ్యక్షా, ఇది ముఖ్యమైన సమస్య. స్త్రీ పురుషుల సమ్మేళనంచేతనే ప్రపంచంఅనేది వున్నది. స్త్రీ పురుషులులేకుండా ప్రపంచంలేదు. ఇది దేనిచేత సంబంధించబడింది అనేది సమస్య. స్త్రీవుంటే పురుషుడువుండాలి. ; పురుషుడువుంటే స్త్రీ వుండాలి. వీరుఇద్దరూ కలిస్తేనే సంసారం వున్నది. సంసారంవుంటేనే ప్రపంచం అవుతుంది. పురుషుడు స్త్రీని కొనడమా ; స్త్రీ పురుషున్ని కొనడమా—స్త్రీ పెత్తనం పురుషునిపైకావాలా, పురుషుని పెత్తనం స్త్రీపై కావాలా—అనేది యిప్పట్లో వుండేవిషయం. స్త్రీ పురుషులు ఒకటే body. ఒకేశరీరంలో రెండుభాగాలుమాత్రమే. అక్కడనుంచి ఒకటి, ఇక్కడనుంచి ఒకటి తెచ్చి ఎదో జతచేస్తున్నాము అనుకోవడం సరికాదు. వియ్యానికి, కయ్యానికి, నెయ్యానికి సరిసమానంగా వుండాలనిశాస్త్రం, నెయ్యానికి ఇద్దరిభావాలు ఏకీభవిస్తేనే మిత్రవర్గం. Differ అయితే శత్రుసర్గం. శత్రువులైనా సరిసమానంగా ఉండాలి. అలాగే వియ్యానికికూడా కావాలి. సరిసమానం అనేపదానికి అర్థంఏమిటి ? ఆస్తియా, కులమా, వయస్సా—ఏమిటి సరిసమానంఅంటే ? స్త్రీ పురుషులమధ్య ముఖ్యంగా కావలసింది ప్రేమ. పశువులమాదిరిగా మోహించడంకాదు ప్రేమంటే ఏమిటి—ఒకరినొకరు అర్థంచేసుకోవాలి. ఆదికాలంలోకూడా ప్రకృతి పురుషుడు అనేవారు.

ప్రకృతి—అంటే స్త్రీ—పరబ్రహ్మ—అంటే పురుషుడు—పరబ్రహ్మ సంకల్పించి నంతమాత్రాన సృష్టిఏర్పడింది. అందువల్ల సృష్టిముందా, బ్రహ్మముందా అని చెబుతుంటారు. దానినే జన్మముందా, కర్మముందా అని మాట్లాడుతుంటారు. కాని జన్మనుబట్టి కర్మ, కర్మనుబట్టి జన్మ అంటుంటారు. ఆదిపురుషుడుకూడా సంకల్పించినాడు. సంకల్పంతో మాయాసృష్టి అయినది. మాయాప్రతిబింబమే ప్రపంచము. ప్రపంచసృష్టి తరువాత మానవసృష్టి. ఇది అందరూ తెలుసుకోవలసిన విషయం. ఎప్పుడో అక్కడకు వచ్చేదికూడా కాదు. ఇప్పుడే సంసారంలో ఉపయోగించేది ఆదిపురుషుడు సంకల్పించి మాయను సృష్టించాడని యీ మాయా ప్రతిబింబమే ప్రపంచమని చెప్పాను. దానికి ఒక తార్కాణం చెబుతాను. ఇక్కడ current అనేది పరబ్రహ్మ—అంటే పురుషుడు. పంకా, లైట్లు ఇవన్నీ ప్రకృతి-అంటే స్త్రీ. పంచభూతములచే చేయబడింది ప్రకృతి. అది జడం. జడమూ, చైతన్యమూ అంటారు. పురుషుడు చైతన్యము.

MR. DEPUTY SPEKER :—మీరుచెప్పేది వినేవాళ్ళకు, వ్రాసుకొనే వాళ్లకుకూడా వీలుగావుండాలి.

SRI C. P. THIMMA REDDI :—వ్రాసుకునేవారు వ్రాసుకోకపోతే నాతప్పుకాదు, వినేవాళ్లు వినకపోయినా నాతప్పుకాదు. సంగతి చెబుతున్నాను. అర్థంచేసుకొనడానికి ఎవరైనా ప్రయత్నం చేస్తారేమో. ప్రయత్నంచేస్తే మంచిది. ఒక్కొక్కపదానికి నిర్వచనం కావాలంటే మళ్ళాగంటకావాలి. ఇదిఅంతా పరిభాష. అదిరానపుడు ప్రపంచాన్ని అర్థంచేసుకొనక పోవడం జరుగుతుంది. ఒక ఇంజనీరు వున్నాడనుకోండి. సంపూర్ణంగా సర్వభాగములు, వాటి స్వరూపం తెలుసుకొనకుండా repiar ఎట్లాచేస్తాడు. అందరమూ repiar చేయడానికి పూనుకుంటే ఇంజను చెడినట్లే, మనం ప్రపంచాన్ని సరిదిద్దాలని కూర్చునప్పుడు ప్రపంచ స్వరూపం తెలుసుకొనకపోతే ఎట్లా సరిదిద్దుతాము ? ప్రపంచంలోనికి వచ్చామంటే ప్రపంచాన్ని సంపూర్ణంగా అర్థంచేసుకొని అందులోవుండే లోపాలను అర్థంచేసుకుంటేనే దానిని సవరించడానికి వీలవుతుంది. మానవులకు సంబంధించిన విషయాల మీద ఎన్నోచట్టాలు చేస్తున్నాము. ఇది పిపీలకాది బ్రహ్మపర్యంతంవరకు వుండిన సర్వప్రపంచమునకు సంబంధించిన వ్యవహారం. సర్వం తెలుసుకోవలసిన విషయం. current ను ఏమిఅంటారు—పురుసుడు అంటారు. బల్బులు వగైరాలను ఏమి అంటారు—స్త్రీ అంటారు. గీతలోకూడా ఏమిచెప్పారంటే ప్రకృతిలోపల బీజం పడునపుడే వుత్పత్తిఅవుతుందని చెప్పారు. ఈ బల్బులో current pass అయినది కాబట్టి ఒక action ను ఇచ్చింది. పంకాతిరిగింది ; లైటువెలిగింది, అందుచేతనే పురుషుడు ఆధారం ; స్త్రీ ఆధేయం ఆధారంగా లేకుండా ఆధేయం వుండదు.

టేబిలు ఆధారం; "ఇది" అనగా స్పీకర్ టేబిలులేకుండా "ఇది" వుండలేదు. అట్లాగే పురుషుడు లేకుండా స్త్రీలేదు; స్త్రీ లేకుండా పురుసుడు వుండడానికి అవకాశంవున్నది. ప్రకృతిలేకుండా పరబ్రహ్మ వుండవచ్చును కాని పరబ్రహ్మ లేకుండా ప్రకృతి వుండడానికి లేదు. పంకా తిరగాలిఅంటే current వుండాలి; పంకాస్వరూపం వుండాలి. వీటిసమ్మేళనం action ఇస్తున్నది.

స్త్రీ పురుసులు ఏకీభవించడం అనేది ప్రేమ, ప్రేమ అంటే వారిద్దరి హృదయాలు కలువడం అన్నమాట వాళ్లు ఒక కుటుంబంలోనికి వచ్చారు. బాల్యావస్థను కొద్దిగా చర్చిస్తాము బాల్యములో ఏమీ తెలియదు. ఏ భాష వారికి నేర్పుతామో ఏ చర్యలు వారికి నేర్పుతామో ఏ ఆటలు, పాటలు వారికి చెప్పుతున్నామో తెలియవు. వ్యక్తుల పరిసర లక్షణాలను బట్టివారు నేర్చుకుంటున్నారు. ప్రపంచంలో పెద్దలు వారిని contact చేస్తున్నారు, అమ్మా, నాయనా, అని చెబుతున్నాము. తరువాత ఆట వస్తువులతో పరిచయం చేస్తున్నాము. తరువాత ప్రపంచ విషయాలలోనికి దిగుతాడు. పుస్తకాలతో సంబంధం ఏర్పరచుకుంటున్నాడు. కొంత కాలమైన తరువాత నూతన ప్రాయమైన తరువాత భార్య కావాలి అంటాడు. వీరిరువురు జతగావుండి సంసార సముద్రమును ఈదవలసియున్నది. దీనికై జత కావలసి వచ్చింది-ఒకరికి శక్తిలేదు. ఇదంతా ఎందుకు? సునాయాసంగా ఆనంద ప్రాప్తి; దుఃఖరాహిత్యాన్ని పొందుటకు ఇద్దరూ కలిసి ప్రపంచంలో సుఖం అన్వేషిద్దాము అని బయలుదేరారు, ఈ రెండు కాడెద్దుల 'జట్టే' బయలుదేరింది. ఒకరు లేకుంటె మరొకరులేరు, ఇద్దరూ లేకుంటే ప్రపంచంలో ఆనందంలేదు, ఒక చెట్టు ఉన్నదనుకోండి పైన ఎంత చెట్టు ఉన్నదో క్రింద అంత చెట్టు ఉన్నది. Home శాఖ, foreign శాఖ అంటుంటారు, పైభాగం చేసేపని పైభాగం చేస్తుంది. అట్లే సంసారంలో కూడా, Home శాఖను స్త్రీకి పూర్తిగా అప్ప చెప్పారు. గృహకృత్యాలన్నింటిలోను పెత్తనదారు ఆమె, వస్తుసామగ్రిని తెప్పించేది ఆమె, పురుషుడు foreign శాఖను చూస్తున్నాడు. అంటే బయటకు వచ్చి సంపాదించి ఇంట్లో పడవేయడం వరకే.

Mr. DEPUTY SPEAKER :—భార్యా భర్తలు ఏకమైన తరువాత చేసే వ్యవహారం గురించి చెబుతున్నారు, భార్యా భర్తలకు dowry, లేకుండా చేసే బిల్లు ఇది, ఆ విషయానికి రండి.

Sri C. P. THIMMA REDDI :—తొందరగా చెప్పాలంటే ఎట్లా ఇది, వారి సంబంధం చెప్పిన తరువాత మిగతా వాటికి proceed కావచ్చును, లేదంటేమానివేస్తాను.

MR. DEPUTY SPEAKER :—ఉపోద్ఘాతం సరిగానే ఉన్నది, బిల్లు విషయమై చెప్పండి.

Sri C. P. THIMMA REDDI:—ఈ స్త్రీపురుషుల సంసారం చెట్టుతో సమానమైనది, కొంతకాలం నువ్వు లోపలికిపో; నేను పైకి వస్తాను అనడానికి వీలులేదు. ఒకవేళ చెట్టును తీసి-కాదని-పైభాగాన్ని లోపల పెట్టాము అనుకోండి. లోపలది తీసి పైకి పెట్టాం అనుకోండి, ఆకులు లోపలకు పెడితే మాడిపోతాయి, క్రింద ఉండవలసిన వ్రేళ్లను పైన పెడితే ఆకులు పూలు పూస్తాయా ? అది స్వభావికమైన అనగా నైజగుణం అట్లాగే స్త్రీ చెబుతోంది అనుకోండి-నీవు ఇంట్లో వంట చెయ్యి; నేను బైటకు వెళ్ళి వస్తాను అంటే అపహాస్యంగా ఉంటుంది. కొన్నాళ్లు నువ్వుకూడా బిడ్డలు కనవలెనంటోంది అనుకోండి. అది సాధ్యం అవుతుందా ? ఇటువంటిది సృష్టిలోనేలేదు. స్వేచ్ఛ ఉన్నది ఇద్దరకు, స్వేచ్ఛ అనేది ఎంతవరకు-ఆయాశాఖపై మాత్రమే. ఎంతవరకు స్త్రీకి సర్వాధికారం కావాలి-ఇంటి విషయానికి సంబంధించినంతవరకు సర్వాధికారం కావాలి. అనాది నుంచి హిందూ దేశంలో వస్తున్న గొప్పతనం ఇది. ఇంటి విషయంలో సర్వం ఆమెకు అప్పచెప్పినారు. స్త్రీ చెప్పిన విధంగా పురుషుడు చేస్తాడు స్త్రీ పురుషునికి ఒక మంత్రి అని చెప్పవలసి వచ్చింది, సర్వ విషయాలలో భర్తకు తగిన సలహాలు ఇచ్చిన ఆమెనే స్త్రీ అని చెప్పవలసి వుంటుంది.

కాబట్టి యిటువంటి సంబంధం కలిగినటువంటి వ్యక్తులు భావాలచేత ఏకం కావాలి, ఎప్పుడు వీళ్ళకు పొత్తు కుదురుతుందంటే భావనాలు తాదాత్మ్యం కావాలి. ముఖ్యం ఆస్తిపాస్తులుకాదు. గుణాన్ని బట్టి ఉంటుంది. ఇద్దరి గుణాలు ఏకీభవించాలి. ఆహార విహార మొదలగు సర్వవిషయాలలో కూడ యేకీభావం కుదరాలి. ప్రేమ. ఇద్దరికీ సమానమైనటువంటి ఆహారం, విహారాలలోకూడ, ఏకీభావం కలిగినప్పుడు స్నేహం చక్కబడుతుంది. స్త్రీ పురుషులకు ఒకరితో ఒకరికి అన్యోన్యత కలిగినప్పుడు జీవితం ఆనంద దాయకం. లేనియెడల దుఃఖమయం. పెద్దలు సత్వగుణం రజోగుణం, తమోగుణం బట్టి మూడు తెగలు గలిగిన వ్యక్తులిని చెప్పారు. కాలం ఎక్కువలేదు కాబట్టి brief గా చెబుతున్నాను. ఈ విభజని గుణాన్ని బట్టిగాని కులాలనుబట్టి జరుగలేదు. సత్వగుణం పూర్తిగా కలిగిన వారిని బ్రాహ్మణుడు అన్నారు. సత్వగుణం రజోగుణం కలిసివున్నవారిని క్షత్రియుడు అన్నాడు. రజోగుణం తమోగుణం కలిసివున్నవారిని వైశ్యులు అన్నారు. కేవలం తమోగుణ ప్రధానంగా వున్నవారు. శూద్రులన్నారు. సత్వగుణ లక్షణం అంతఃకరణ శుద్ధిగా వుంటుంది. Brain చాలా ప్రశాంతంగా వుంటుంది. అందువల్ల విజ్ఞానం కలిగినటువంటి వారంతా బ్రాహణులు, తెలివినిబట్టి నిర్ణయించారు. ఈ బ్రాహ్మణులకు

ధార్మిక సంబంధమైన వ్యవహారం అనే portfolio అప్పచెప్పారు. ఇది గుణాన్ని బట్టి గాని కులాన్ని బట్టి కాదు. వారంతా బ్రాహ్మణులు ఇక క్షత్రియుడు క్షత్రియునికి తెలివితో గూడిన సాహసం వుండాలి. శుద్ధంఅయిన యినుంకోక ఉక్కు అయితే గాని కత్తులు కటార్లు చేయడానికి పనికిరావో అట్లానే వట్టి తెలివి పనికిరాదు. తెలివితో కూడిన ధైర్యసాహసాలు క్షాత్రంఅనగా సత్వగుణాలో, రజోగుణాలో కలిసినవారు క్షత్రియులు. అది కావాలి, యిది కావాలి, అది యిట్లా సేకరించాలి, యింకా పెద్దది అనే కేవలం కోరికల పుట్టి రజోగుణం. కృషి. వాణిజ్యం యీ వైశ్యులకు అప్పచెప్పారు. తమోగుణం ప్రధానంకలవారు శూద్రులు శూద్రులంటే చేసేవారేగాని స్వతహాగా బుద్ధితక్కువగా వుంటుంది. ప్రకృతి గుణాలోనైన సత్వ, రజస్సు తమస్సు గుణముల ప్రకారంగా వచ్చినటువంటి విషయం కాబట్టి వివాహాదులలో ఒకటి పెట్టారు. సత్వగుణం కలిగినటువంటివారు క్రిందివారిని అనగా, సత్వగుణాలో, రజోగుణాలో వివాహం చేసుకోవచ్చునన్నారు. ఎందుకంటే ఎక్కువ తెలివికలిగినందువల్ల తక్కువ తెలివికలిగినవారిని Control చేసేదానికి వీలుంటుంది. తక్కువ తెలివి గలవారు ఎక్కువ తెలివిగల ఆమెను పెండ్లిచేసుకుంటే భార్యపెత్తనం సాగిస్తుంది. పతనం ఆరంభిస్తుంది. ఆహారవిషయంలో మాంసాహారు లుంటారు. శాకాహారికి మాంసాహారం సహించదు. అందుచేత ఆహారవిహారాలలో సరిసమానంగా వుండాలి. ఇంక విహారం విషయంలో కొందరు గోషా వగైరా యితర సంకోచనలతోనుండి బయటికి రారు. అది కొందరికి నచ్చదు. మనస్తత్వం ఏకీభవించాలి. స్త్రీకిగాని పురుషునికి గాని కావలసిందేమిటి ? ప్రేమ ఇది చట్టబద్ధం చేయవలసినదికాదు. ధర్మయుక్తమైనది. దేశకాలపరిస్థితులనుబట్టి యిది మారుతూవుంటుంది. పూర్వం చంటిబిడ్డలకు అయిదేండ్లకు మించకుండా వివాహాలుచేసేవారు. మహమ్మదీయుల రోజులలో కనపడిన హిందూస్త్రీని వివాహం లేకపోతే బలాత్కరించి వివాహం చేసుకునేవారు. కాని మంగళసూత్రం లేనటువంటివారిని పోయి చేసుకోవచ్చునన్నారు. అందుచేత రజస్వల కాకముందే వివాహంచేసి వదలిపెట్టారు. ఆ పరిస్థితులలో అక్కరకువచ్చింది. అప్పుడు చట్టానికి Amendment పెట్టారు. తరువాత మహమ్మదీయులలో అవతార పురుషుడైన బైరాంఖాన్ ఏమిచేశాడు ? అప్పట్లో పెద్ద అలజడివుండేది. ఆధారంలేని స్త్రీలను ఎవరంటే వారిని తీసుకుపోతున్నారు. అప్పుడు పురుషులు ఎంతమందినన్నా పెండ్లి చేసుకోవచ్చునన్నారు. కాని వ్యభిచారం కూడదన్నారు. స్త్రీలకు ఆధారం యివ్వడానికి చెప్పారు. ఇట్లానే ధర్మానికి దేశకాలపరిస్థితులనుబట్టి మార్పులు వస్తాంటాయి. కావలసినది మానవులలో అన్యోన్యత. కలుగబోయే బిడ్డలయొక్క సంపత్తి, సంగమం చేసేటపుడు యిద్దరి భావాలు ఏకీభవించివుంటే సరియైన సంతతికలుగును. ఇదీ శాస్త్రోక్తంగా యిటువంటివన్నీ వుంటాయి. ఇద్దరి భావాలు కలుసుకుంటే

ఒక Spirit పుడుతుందన్నమాట. ఒక Power ఉత్పత్తి అవుతుందన్నమాట. ఇప్పుడేమి కావాలంటే సద్భావాలుకలిగిన వ్యక్తుల మనస్సు ఏకీభవించాలి. ప్రేమ ప్రధానం, డబ్బుకాదు.

MR. DEPUTY SPEAKER :—వరకట్నం యివ్వవచ్చునా లేదా అనే విషయం చెప్పండి.

SRI C. P. THIMMA REDDI :—సంగ్రహం తెలిసికోకుండా ఎట్లామరి? ముహూర్తం చూసి పెండ్లి అయింది అని అయ్యవారు చెప్పినట్లుంటుంది. బలవంతంచేత వివాహాలు చేయడం ప్రారంభం అయిపోయింది. ఇద్దరికి హృదయాలు కలిసినాయా లేదా ఒకరినొకరు ప్రేమించుకున్నారాలేదా, భావాలు ఏకీభవించాయాలేదా అనే టటువంటి సమస్యకు ప్రాధాన్యత హిందూ శాస్త్రం యిస్తున్నది. ఇతర శాస్త్రాలు కూడా యిస్తున్నాయి. ఇప్పుడు డబ్బుకు ప్రాధాన్యం యిచ్చేసి బజార్లో వేలం పెడుతున్నారు. వెయ్యి, రెండు వేలు అంటున్నారు. ఇట్లాగే అమ్ముడుపోతున్నాం. పురుషులంకూడా అమ్ముడుపోతున్నాం. ఒకప్పుడు స్త్రీలు అదేరకంగా అమ్ముడుపోయే వారు, ఇప్పుడు పరస్పర విరుద్ధమైన చట్టాలు కొన్ని వున్నాయి. ఒక వైపున బహు భార్యా నిషేధం అంటారు, ఒకరి కొక్కరే అంటారు, కొందరు స్త్రీలు మిగిలి పోతున్నారు. Widow marriage వల్ల యింకా కొంతమంది స్త్రీలు మిగిలి పోతూ యున్నారు. అంతే మిగిలినవారందరూ ఉత్తమ మయిన సంబంధం కావాలనే కోరతారు. పైదృష్టికే పోతుందిగాని క్రింద దృష్టికాదు. తన status కంటే పై status గలిగిన అల్లుడు కావాలనే కోరుతారుగాని క్రింది status కోరరు.

ప్రతివారుకూడా అమ్మాయి మంచి ఇంటికి వెళ్తే మంచిదే అని అనుకుంటారు. తల్లి తండ్రులు అందరికి తమకుమార్తె సుఖపడాలని వుంటుంది. కాని కష్టపడా లని ఉండదు. కాని కొన్ని కొన్ని సందర్భములలోనో యేదో పెండ్లి అయి పోయింది అనే తృప్తి కోసం పెండ్లిండ్లు జరిగిపోతున్నవి. ఇవన్నీ దృష్టిలో పెట్టు కొని చూచిన Dowry System మంచిదికాదు. కొనుక్కునే ప్రేమ ఎన్ని రోజులు ఉంటుంది ? వెనుకటికి ఒక ఋషి తన భార్యను అడిగినాడట "నన్ను బాగా ప్రేమిస్తున్నావుకదా. నా కోసం నన్ను ప్రేమిస్తున్నావా, ని కోసం నన్ను ప్రేమిస్తున్నావా" అని అడిగితే ఆమె చెప్పింది నా కోసం నిన్ను ప్రేమిస్తున్నాను అని అందుచేత స్త్రీ పురుషుడిని ప్రేమిస్తున్నది అంటే స్త్రీ తనకోసమే పురుషుడిని ప్రేమిస్తుంది అట్లానే పురుషుడు తనకోసం స్త్రీని ప్రేమిస్తున్నాడు అన్నమాట కాబట్టి ఇది ఇచ్చి పుచ్చుకోవడంగా ఉన్నది. ప్రపంచాన్ని దూషిస్తే నిన్ను ప్రపంచం దూషిస్తుంది. స్త్రీ పురుష సంబంధాలు యీ విధముగా ఉన్నవి డబ్బుకు

ప్రాధాన్యం ఇవ్వకూడదని చెబుతున్నాను. స్త్రీ పురుషుల సంబంధం ప్రేమకు సంబంధించిన వ్యవహారము.

ఇంకా చాలామంది మాట్లాడేవారు ఉన్నారు. ఇప్పుడు బిల్లు ఉండవలెనా వద్దా అనేదే సమస్య దీనిలో కూడా అనేక దృక్పథాలు ఉన్నాయి. బిల్లు ఎందుకు ఉండవలెను. ఏవిధముగా ఉండవలెను. ఏవిధముగా చేస్తే offence.

SRI P. SUNDARAYYA :—మీరు మాట్లాడుతున్నది వరకట్నాల మీదేనా ?

MR. DEPUTY SPEAKER :—బిల్లులోని వర కట్నాలమీద.

SRI C. P. THIMMA REDDI :—ఇప్పుడు వరకట్నాలను గురించి విమర్శనలు జరుగుతున్నవి. ఎందుకంటే వివాహం ప్రేమబంధం కావాలి కాని డబ్బు బంధం చెయ్యకూడదు. ఇది అందరకు తెలిసినదే. కాని ఇది అమలులో పెట్టవలె నంటే చాలా చిక్కులు ఉన్నవి. Support ఇచ్చినవానికి punishment చేసు కున్నవారికి punishment, ఒక పెద్ద ఉద్యోగస్తుడు గుమస్తా ఉద్యోగం ఇప్పిస్తాను నా పిల్లను చేసుకోమంటే దాని విషయం ఏమిటి కుమార్తెకు సొత్తులు ఇస్తానంటాడు గాన యేది తప్పో తెలుసుకొనడం కష్టం. ఇది అంతా సంసారానికి సంబంధించిన విషయము కాబట్టి చట్టము ఏ విధముగా చెయ్యవలెనని ఆలోచించవలెను. హిందూ code బిల్లు వస్తున్నది కాబట్టి గానిలో స్త్రీలకు ఆస్తులలో హక్కు ఉంటుంది. వారికి స్వేచ్ఛ, అధికారము ఉండనే ఉన్నది. ఇంటికి పెత్తనం దారులు స్త్రీలు. తండ్రి సంవత్సరానికి సరిపడు చీరెలు నగైరా ఖర్చులు తనే భరిస్తూవున్నారు. పుట్టింటివారు ఆడపడచులయందు చాలా అభిమానం కలిగివుంటూవున్నారు, కావలసిన సహాయం చేస్తూవున్నారు. చట్టం ద్వేషమును పురికొల్పును. రోజులు మారినవి కాబట్టి కొన్ని చట్టాలు చెయ్యవలసి వచ్చింది. హిందూకోడ్ బిల్లుకూడా వస్తే ఈ బిల్లు అవసరంవుండదు. కాశీశ్వరరావు అమెండు మెంటుకు ఒప్పుకున్నారు బిడ్డలు ఉన్నవారు కావలెను అంటే కొడుకులు ఉన్నవారు వద్దు అంటారు. ఇది ప్రజలకు సంబంధించినది కాబట్టి ప్రజల ఉద్దేశములను తెలుసుకోవలెను. దీనిని గజెటు నోటిఫికేషను చేసి ప్రజల అభిప్రాయము తెలుసుకోవచ్చును. హిందూలా code బిల్లు వచ్చిన తరువాత దానికి అవసరం అనేది ఉండకపోవచ్చును. ఈ అమెండు మెంటు ఒప్పుకున్నారు కాశీశ్వరరావుగారు. బాగా ఉంటుందని చెబుతూ విరమించుచున్నాను.

MR. DEPUTY SPEAKER :—సభ 2-30 గంటలకు తిరిగి సమావేశ మౌతుంది.

AFTER LUNCH 2-30 p. m.

Sri S. KASI REDDI :—ఉపాధ్యక్షా, వరకట్నములు ఈ పద్ధతి సంఘాభివృద్ధికి చాల అరిష్టదాయకం అనేది గుర్తించిన విషయం అయితే దానిని నిర్మూలించడానికి ఒకబిల్లు తీసుకొని రావలెననిచెప్పి ప్రవేశపెట్టడం మంచిది. కాని ఈ వరకట్నాలవల్ల వచ్చేటటువంటి అనర్థాలు ఏమిటి ? ఈ వరకట్నాలకు కారణాలు ఏమిటి, ఇవి అన్నికూడా సమగ్రంగా ఆలోచించి ఈ మూలకారణాలకు పరిష్కారమార్గం చూపెట్టినపుడే వరకట్నములు ఆగడం అనేది జరుగుతుంది. అందువల్ల వరకట్నాలు ఈనాడు సంఘంలో చాలప్రధానంగా సంబంధాలను చెడపటానికి తోడ్పడుతుంది. ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబంలో భాగ్యవంతులైన కుటుంబంలో ఈ వరకట్నాలు తీసుకొనడంలో ప్రధానపాత్ర మధ్యతరగతి కుటుంబంలో వరకట్నాలవల్ల అప్పులపాలు కావడం తరువాత కుటుంబభారాన్ని మోయలేక చిదిగిపోవడం అనేది జరుగుతుంది. అంతేకాకుండా సంబంధాలలో కూడ అభిప్రాయభేదములు రావడం జరుగుతుంది. చదువుకొన్న తరువాత కుమారుడు ఏదో ఇష్టమువచ్చిన అమ్మాయిని పెండ్లాడవలె అనుకొంటే, కేవలం తల్లిదండ్రుల అభిప్రాయం ప్రకారమే పోవలెనను ఉద్దేశం ఉన్నందువల్ల అప్పుడు తల్లిదండ్రులకు కుమారునికి అభిప్రాయభేదాలు రావటం, అనుకొన్నటువంటి కట్నములు తీసికొని రాలేదు కాబట్టి అమ్మాయికి అబ్బాయికి మధ్య అభిప్రాయభేదములు రావడం, భర్త తన కట్నాన్ని తెమ్మంటున్నాడు కాబట్టి తల్లిదండ్రులను అడిగినట్లయితే తల్లిదండ్రులు మేముఉన్న కష్టాలుచూస్తున్నావుకదా ఇది ఏమిటి అని కుమార్తెమీద విసుగుకోవడం, ఇవి అన్ని ఈనాడు మనము సంఘంలోచూస్తూ ఉన్నటువంటి విషయాలే అంతే కాకుండా, ఇక అమ్మాయిని చదివించినట్లయితే ఏదో చదువుకొన్నభర్త కావాలఅంటుంది. బాగాఉన్న కుటుంబాలనుంచి కావాలంటుంది. కాబట్టి కట్నములు ఇవ్వవలసివస్తుంది. కాబట్టి అసలు అమ్మాయినే చదివించకుండా ఉంటే ఎవరికో ఒకడికిఇచ్చి పెండ్లిచేయవచ్చును. అనేటటువంటి భావాలుకూడా తల్లిదండ్రులలో రావటం, అందువల్ల స్త్రీకిఉన్న స్థానంకూడ పోయేటటువంటి ప్రమాదం ఇవిఅన్నికూడ చాల అనర్థదాయకముగ ఉంది. కాశీశ్వరరావుగారు సెలవుఇచ్చినట్లు మరి స్త్రీలకు స్వతంత్రం లేలపోవడమే ప్రధానమైన విషయమని చెప్పారు. నిజమే సంఘంలో స్త్రీలకు హక్కులులేవు. కేవలం వంటఇంటిలో పడిఉండేటటువంటి భావాలే ఉండాలనే భావాలు ఈనాడు ఉన్నాయి. పైగా ఆస్తిలో హక్కు లేకుండా పోవడమే ఒక ప్రధానమైన కారణం విద్య తక్కువగా ఉండడం, స్త్రీ ఏదో స్వతంత్రంగా జీవించటానికి ఒకపని చేయడింఅనేది, ఒకవృత్తి తనకు స్వతంత్రంగచేయటానికి అవకాశాలు లేకపోవడం

వల్ల ఇవి అన్ని ఉన్నందువల్లనే ఏదో ఇంట్లోవస్తే పడిఉంటుంది. కాబట్టి ఏదన్నా ఆస్తిఅన్నా తెస్తుంది. అనేటటువంటి ఉద్దేశంతో అలాంటి భావాలురావడంకూడ తటస్థించుచున్నది. అందువల్ల వాటి అన్నింటిని సాకల్యంగా, ఆలోచించి స్త్రీలకు హక్కులను కలిగించటానికి, ఆస్తిలో హక్కు సగభాగం కావలెనంటే పురుషులతో పాటు హక్కు కావలెననేది మంచిది. అది పార్లమెంటులో చర్చలోఉంది. అది చాల ముఖ్యమైనది. అంతేకాకుండా విద్యవిషయంలోకూడ స్త్రీలకు తగినటువంటి ప్రాధాన్యము, తరువాత స్వతంత్రంగా జీవించటానికి ఏదో చదువు, చదువుకొన్నంత మాత్రాన, ఈనాడు B. A. నో, M. A. నో చదివినాకూడా, ఉద్యోగం అనేది లేకుండా, ఉండడం అనేది ఇటు పురుషులలో, ముఖ్యంగా స్త్రీలలోకూడ అలాంటి అవకాశాలులేకుండా పోవడంఉంది. అందువల్ల ఏదో పనిచేయగలిగినటువంటి తాహతు స్త్రీలకుకూడా అవకాశాలు కలిగినపుడే, పురుషులుకూడ మనతోపాటు వాండ్లు ఏదో సంపాదిస్తున్నారు కాబట్టి ఆస్తిరాకపోయినా పరవాలేదనే భావం వస్తున్నది. అందువల్ల అలాంటిదికూడ కలుగచేయడంఅనేదికూడ చాల అవసరం అందువల్ల ఈ వరకట్నములు తీసుకోకుండా ఉండడానికి చట్టం తీసికొనివస్తే చాలనిచెప్పి చట్టంతీసుకొని రావడంమంచిది అని తీసుకొనివచ్చారు. అయితే త్రాగుతూఉంటే త్రాగకుండా ఉండటానికి చట్టంపెట్టితే త్రాగుడుపోతుందని ఒక చట్టం పెట్టాం. అది నిరుపయోగంఅయింది. ఈనాడు వరకట్నములు తీసుకోకుండా ఉండటానికి ఒక చట్టము తీసుకొనివచ్చి పెట్టాము. దీనితో పనిఅయిపోతుంది. కట్నాలు ఆగిపోతాయిఅని మీరు అనుకొన్నట్లయితే అది పొరపాటు అవుతుంది. కేవలం దానివల్లనే అది సఫలంకాదు. ఇది రావటం మంచిదే. దానితోపాటు, ఆస్తిలో హక్కు, విద్యాభివృద్ధి చేయటానికి స్త్రీలకు ప్రత్యేకసౌకర్యాలు, ఉండవలెను. రెండవది చదువుకొన్న తర్వాత ఒక ఉద్యోగంఅంటే ఏదో తాహతు కలగటానికి అవకాశాలు, సంపాదించటానికి అవకాశాలు, ఇవి అన్ని కలుగచేసినపుడే, తప్పకుండా స్త్రీని హీనముగ చూడక, సమానంగా చూడడానికి అవకాశాలు ఉంటాయి.

చదువుకొన్న తరువాత ఒకఉద్యోగం అంటూఉంటే ఒక తాహతుకలగడానికి అవకాశాలు పని సంపాదించడానికి అవకాశాలు యివన్నీ కలగచేసినప్పుడు తప్పకుండా స్త్రీని హీనంగా చూడకుండా సమానంగా చూడడానికి అవకాశాలు ఉంటాయి. అందువల్ల యిలాంటి అవకాశాలు కలగటానికి చట్టాలరీత్యా కాకుండా ప్రోత్సాహం ప్రత్యేకంగా ఇవ్వడం అనేదికూడా చాలఅవసరం. తరువాత పురుషులుకూడా ఇట్లాంటి కోరికలు కోరడానికి, ఇంట్లో వున్నటువంటి ఆర్థికవిధానం కూడా ఒకకారణం. చదువుకొనడానికి ఎంతోకొంత ఖర్చుపెట్టడం, చదువుకొన్న

తరువాత ఉద్యోగాలు లేకపోవడం, తల్లిదండ్రులు ఇంతఖర్చు పెట్టాము నీకు ఇప్పుడు సంపాదనలేదు, రెండవది కట్నాలు ఒప్పుకోవు అనిచెప్పి ఈ విధంగా ఒత్తిడి తీసుకురావడం దానికి లొంగిపోవడం, ఇదికూడా కొంతవరకు జరుగుతోంది. అందువల్ల చదివే విధానంలోనే ఒకలోటు పైగా ఈవిధంలో ఉత్తీర్ణులైన తరువాత కూడా స్వతంత్రంగా బ్రతికేటటువంటి మార్గాలులేక ఉద్యోగాలు ప్రభుత్వం సక్రమంగా చూపలేకపోవడంవల్ల యిలాంటివికూడా జరుగుతాయి. అందువల్ల విద్యావిధానంలో తగినమార్పు తీసుకురావడమే కాకుండా స్వతంత్రంగా జీవించేటటువంటి విద్య తరువాత కొన్ని ఉపయోగకరమైన sources కూడా ప్రభుత్వం కలుగజేయవలసిన అవసరం ఉన్నది. సరిగా ఒక యువకునికి ఒకపనియందు గ్యారంటీ వున్నప్పుడు తల్లిదండ్రులు డబ్బుకోసరమే పెళ్లిచేసుకోమని అడిగినప్పటికికూడా స్వతంత్రంగా తనకాళ్ళమీద నిలువగలిగినటువంటి శక్తివుంటే అలా చేయడం అనేది సంభవించదు. అందువల్ల ఆర్థికవిధానంకూడా చాలా ప్రధానమైనటువంటి పాత్ర వహిస్తున్నది. అందువల్ల దానినికూడా సక్రమంగా ప్రభుత్వం ఆలోచించినప్పుడు ఆ విధానాన్ని అరికట్టడానికి వీలువుంటుంది. అందువల్ల ఈ సమస్య పరిశీలించవలసినటువంటి అవసరం ఉంది. అయితే దీనిమీద అనేక అభిప్రాయాలు వున్నాయి. దానిని కొంతమంది ప్రజల అభిప్రాయానికి పంపించాలనేటటువంటి అభిప్రాయం ఉంది. కాని ప్రజల అభిప్రాయంఅన్నది ఈనాడు మరల అవసరంలేదని నాఉద్దేశ్యం ఎందువల్లనంటే ఇది చాలాకాలంనుంచి యిది ప్రజలలో అసహ్యించుకోబడుతోంది. దానిని ఎవరూకూడా ఈనాడు అంగీకరించడంలేదు. ఏదో మరీ వెనుకబడినటువంటి భావాలు ఉన్నవాళ్లుతప్ప ఈనాడు అత్యధికభాగం ప్రజలు ఈ వరకట్నాల విధానానికి వ్యతిరేకం. అందువల్ల దానిని ప్రజాభిప్రాయమునకు పంపాల్సినటువంటి అవసరం ఎక్కడా ఏమీ కనబడడంలేదు. కాకపోతే final touches యివ్వడానికి select committee కి పంపడంఅనేది మంచిది. అందువల్ల దానిని select committee కి పంపించాలని కోరుతున్నాను.

**2-30 to 3 p. m.**

SRI S. RANGANATHA MUDALIAR :—Mr. Speaker, Sir, it is agreed on all sides by men belonging to all political parties that this dowry system is one of the greatest evils that pester our society. That being the general view I should feel that it would be unnecessary to refer this measure for eliciting public opinion. The Bill was published as early as October last, and so, many of the legislators would have gone through the Bill. When it is recognised as an evil it is

our duty to see that it is put an end to. So no purpose will be served by circulating the Bill to elicit opinion. On the other hand, as the hon Member who spoke previous to me, said, it would be useful if the Bill is referred to the select committee Because the matter has to be brought and discussed and the dowry system put an end to as early as possible. Now this dowry system, so far as I know things in our country, and especially in the Tamil districts, the dowry system was originally confined only to the Brahmin community ; and in those days it was confined to the large number of educated men among the Brahmins only. Afterwards when the other communities emulated them and became forward they also got into the fashion of asking for dowry, so much so, the dowry system now is felt as a kind of evil by the other communities also, as it is among the Brahmins. It is felt by and by, by the parents, that girls are a curse ; the more girls one has the greater is the parents' cursed position. So if a father belonging to a decent middle class wants to secure a bridegroom of some decent status, with some education, he must be prepared to shell out money in terms of thousands. The more educated the bridegroom the greater the dowry that is demanded. So when people were not educated in the modern sense of the term, it was not difficult to secure a bridegroom. A man may be well versed in Tamil or Telugu ; he may be a Tamil scholar, or he may be a Telugu scholar ; he may be well versed in any branch of Oriental literature ; there is no difficulty about the marriage of those people. As I said, a Tamil pandit, however scholar he may be, cannot hope to get any big dowry. It is only when the English educated young man, when becomes a graduate, he demands a big dowry. There is a schedule prevalent depending upon the stage of education one has. Supposing a man has passed S.S.L.C., he is expected to get a certain amount ; if he has passed the Intermediate Examination he is expected to get a larger amount ; if he is a Graduate he is expected to get a much largeramount ; and if he is an M.B.B.S. Graduate he is expected to get a still more larger amount ; and the most costly bridegroom is the engineering graduate. The

engineering graduate has got the largest market value at present. So it is rather difficult for a man like me who belongs to the middle class to secure a brridegroom who is an engineering graduate. To-day the evil has become so great that it is very necessary that some sort of legislation is passed to check this growing evil. Therefore the intention behind the measure is a very very good one, even as the intention behind the Prohibition Act has been quite unquestionable and as the intention behind the Child Marriage Prohibition Act has been good. All these legislative measures seek to set right certain social evils which have become a curse to Hindu society. But the question now is, whether a legislation like this is easily enforceable. That is the difficulty we find with regard to the Prohibition Act, and that is the difficulty we have experienced in the enforcement of the Sarda Act. The difficulty in the present measure is made all the more greater, because both parties to the alliance are interested, the who gives and the man who takes the man dowry. Therefore when both parties are interested parties it is very difficult to secure evidence against this objectionable practice. First of all, evidence will not be easily forthcoming, and if at all it is forthcoming, it will be only false fabricated evidence, particularly in villages which are rampant with factions. This measure will therefore be another handle for persecution of innocent persons particularly in factious villages. But because of that reason, I do not condemn this measure. I only warn Government that we must be prepared for some such danger. We have known where the Sarda Act was misused. People living in factious villages found it handy--for some time at least to foist cases against persons whom they did not like or against whom there was enmity. Even with regard to the administration of the Prohibition Act, it must have come to the notice of the Government that there have been instances of false cases put up by interested persons against their enemies. But all those are not arguments for not having a legislation of this kind. I only say all this only to show that it is necessary for us to find out how best we can

enforce the measure. It should not be allowed to be a dead letter. It must be made a daily and strictly enforceable measure.

Having said so much by way of introduction, I would like to invite the attention of Sri Kaleswara Rao to a certain aspect of the measure now before the House. In this measure, I would suggest, not only dowry but also what is called Kanyasulkam ought to be prohibited. There is no prohibition under any law for the time being in force of an old man or a man with physical deformity or suffering from some loathsome disease from marrying a young girl or woman of any age. Therefore, in these circumstances there is no provision, as the clauses stand in the Bill at present, preventing a very old man taking a young girl of considerable disparity of age for his wife by paying huge sums of money or gifting valuable property to her or her relations. We know of cases, unfortunate cases, of young girls, children of very very poor parents, being sold simply for the love of money, offered by old men, who for some reason an old man might say, he wants a companion, or, a man of seventy years of age might say 'I want a young wife to be my companion,' or, an old man might think, he will be going to hell if he died a widower, and for that sentiment he might like to have a young wife, or another old man might like to have the perpetuation of his dynasty, by whatever means he does not care, and so he wants to have a young wife and through her a child—all these are circumstances under which a young girl is practically sold by her parents for the sake of money—and so this sort of practice also ought to be prevented.

(At this stage Mr. Speaker resumed the Chair).

It may be that such cases are not as much prevalent as cases of dowry, but still there are many cases of ill-matched marriages taking place in the country and so it is very necessary that that evil should be put an end to, for it is more pernicious than the dowry system itself.

Sir, I do not want to offer any remarks on the several clauses of the Bill, I reserve my remarks to the stage when the Bill is taken up for consideration clause by clause. I shall then speak at length on them. On the whole I should think that this Bill is absolutely necessary, and the only thing we have to do is to see that this measure is passed and made as much enforceable as possible. Thank you.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అధ్యక్ష మహాశయా! ఈలాంటి social reforms కు సంబంధించిన బిల్లులన్నీ ప్రవేశ పెట్టే అవకాశము శ్రీ కాశీశ్వరరావుగారికే కలుగుతూ ఉంటుంది. బహు భార్యానిషేధ బిల్లును మద్రాసులో వారు అసెంబ్లీలో ప్రవేశపెట్టడము, అది చట్టము కావడము బాగుంది. అది చాలా ఉపయోగకరమైందనే అనుకొంటున్నాను. అయితే ఈబిల్లు ఎంతవరకు ఉపయోగపడుతుందో ధృఢంగా చెప్పలేక పోతున్నాను. ఈ రోజులలో డబ్బు ఇచ్చి అల్లుణ్ణి కొంటున్నారనే విషయము అందరికి తెలిసినదే. రేపు శ్రీ కాశీశ్వరరావుగారి బిల్లు ఫలితంగా ఈ వరకట్నాల రేటు black market లో హెచ్చుగా పెరిగి పోతుందేమోనని భయపడుచున్నాను. ఈ చట్టము ప్రకారం ఆ విధంగా పుచ్చుకొన్న వాళ్ళను prosecute చేయడానికి, ఇచ్చినవాళ్లుగాని పుచ్చుకొన్నవాళ్లుగాని, తల్లితండ్రులుగాని ఎవరుగాని ఇచ్చినట్లు సాక్ష్యం చెప్పుతారని నేను అనుకోను. ఇచ్చినవారు, తీసుకొన్నవారు అందరు collude అయితే ఆ కేసు జయప్రదంగా సాగదు. ఇటువంటి వాటికంతా, యోగ్యులు, చదువుకొన్నవారు, reformers, వీరేశలింగం లాంటివాళ్లు కావలెనేగాని చట్టరూపకంగా దీన్ని జయప్రదంగా చేయగలమనే విశ్వాసం నాకు మాత్రం వ్యక్తిగతంగా లేదు. ఈ చట్టం చేస్తున్నటువంటి కాశీశ్వరరావుగారికి ఇవ్వవలసిన అవసరంగాని, పుచ్చుకొనే అవకాశాలుగాని, రెండులేవు. ఈలాంటి బాధలు ఉన్నవారికి మాత్రము ఈ బిల్లు వల్ల ఇబ్బందులు ఇంకా ఎక్కువ అవుతాయేమో ననేవారు ఉన్నారు. ఏమైనాసరే, చట్టము వుంది కాబట్టి నేను పుచ్చుకోను అని నీతికి కట్టుబడేవాళ్లు కొంతమందైనా ఉండవచ్చు. అటువంటివారు ఈ చట్టమునుచేస్తే మంచిదంటారు. కనుక దీన్ని రెండు పక్షాలుగా గూడ వాదించవచ్చు. చట్టము చేసిన తరువాత, అది సరిగా అమలు జరుగకపోతే ప్రభుత్వ పరిస్థితులే హాస్యాస్పద మయిపోతాయి, నగుబాట్లు అయిపోతుంది. ఇప్పటికప్పుడే social reforms చట్టాలు చాలా చేసినాము. మధ్యపాన నిషేధచట్టము విషయం తీసుకోండి. అది చాలా ఉత్తమమైన చట్టము అని అందరు ఒప్పుకొంటున్నాము. దానికి ఇంత సిబ్బందిని పెట్టి, ఇంత కఠినమైన శాసనాలు చేసినాగూడ దాన్ని నూటికి నూరుపాళ్లు గాకపోయినా,

కొంతవరకైనా జయప్రదంగా చేసుకొంటున్నామని చెప్పుకోడానికి లేకపోతున్న పరిస్థితులలో, ఇక్కడ వర కట్నాలు ఇచ్చినవాళ్లు, పుచ్చుకొన్నవాళ్లు, పురోహితులు అక్కడ వచ్చిన పెద్దమనుష్యులు అందరు collude అయి అలాంటిదేమి జరగలేదని చెప్పితే, ఎవరిని శిక్షించగలము ? కనుక ఇది కొంచెము ఇబ్బందికరమైన విషయము. కొంతమంది మిత్రులు దీనిని వెంటనే చట్టరూపకంగా చేయాలని చెప్పారు. కాశిరెడ్డిగారు రష్యానుంచి ఇప్పుడే దిగారు గాబట్టి వారు రష్యా విప్లవాత్మక భావాలతో వచ్చి వెంటనే దీనిని select committee కి పంపమని చెప్పుతున్నారు. అయితే ఇలాంటి social reforms కు సంబంధించి నంతవరకు ప్రజాభిప్రాయము అవసరంలేదను కొంటాను. అయితే ఈ విషయంలో కాశీశ్వరరావుగారు తెచ్చిన చట్టాన్ని బలపరచడమో, బలపరచకపోవడమో నా మనస్సులోనే తేల్చుకో లేక పోయినప్పుడు, ఇక ప్రజాభిప్రాయము ఏ విధంగా ఉంటుందో తెలుసుకోవాలంటే, దీన్ని publish చేసి కొన్ని నెలలు వదలి పెడితే, ప్రజల అభిప్రాయము తెలియడానికి వీలవుతుంది. తరువాత కాశీశ్వరరావుగారు దీన్ని ఉపసంహరించుకోవచ్చు, లేదా ఇది బాగుంది ఉండవలసిందే అని ప్రజలు అభిప్రాయపడితే, కాశీశ్వరరావుగారు, శాసనసభ్యులు, ప్రభుత్వము అందరుకలసి వెంటనే దీనిని చట్టము చేయవచ్చును. ఇప్పుడు దీనిని ప్రజాభిప్రాయమునకు పంపవలసిందిగా నేను కూడ బలపరుస్తున్నాను.

SRI K. SUBBA RAO :—అధ్యక్షా, బ్రహ్మర్షి శ్రీ వెంకటరత్నంగారి శిష్యుడు, ఆంధ్రదేశంలో సంస్కరణ విషయంలో ముందంజవేసి పనిచేస్తూ వున్నటువంటి శ్రీ కాశీశ్వరరావుగారు తెచ్చినటువంటి తీర్మానమును, దానికి సవరణగా శ్రీ విజయభాస్కర రెడ్డిగారు తెచ్చిన సవరణనుకూడ అందరు ఏకీభవించి ప్రత్యేకముగా ప్రజాభిప్రాయమునకు పంపవలసిన అవసరమేమో, దాన్నిగురించి కొన్ని విషయాలు చెప్పచున్నాను. కన్యాశుల్కాలు, వరశుల్కాలు చెడ్డవిఅని ఇదివరకే ధర్మశాస్త్రములు చెప్పినాయి. "సత్యంవద" "ధర్మంచర" అని వేదములు వ్రాసినదాన్ని తీసివేయడానికి వీలులేదు. వరశుల్కము తీసుకొన్నవాడు, కన్యాశుల్కము తీసుకొన్నవాడు మంచివాడు అని ప్రపంచములో ఎవరు, ఎప్పుడూ, ఎక్కడా, ఏ కాలములోను వ్రాయలేదు. కాని, కాలానుగుణంగా ఈ దేశములో కాలదేశ పాత్రల ననుసరించి, ఈ జీవితములో వ్యవహారములు ఎప్పటి కప్పుడు మారుతూ వుండబట్టి కొన్ని దుర్గుణాలు సుగుణాలుగా మారిపోయి ఏదో ఒకవ్యాపారంక్రింద జరుగుతూవుండేది. అందరకు తెలిసిందే. అందులో కాశీశ్వరరావుగారికి ఇప్పుడు మిత్రులు సంజీవరెడ్డిగారు చెప్పినట్లు, ఆడపిల్లలులేరు. కనుక అతనికి నష్టము లాభమేమి తెలియవు. కొడుకులకు బిడ్డలున్నట్లయితే, ఇంకా కొంచెము కష్టాలు బాగా తెలిసివుండేది.

Sri K. Subba Rao] [1st December 1955

అంతమాత్రముచేత వరశుల్కము మంచిదిఅని చెప్పేవాడినికాను నేను. ఇది ప్రచారానికి ముఖ్యమైనటువంటి అని అందరికీ తెలుసు. ఇది మంచిదిఅని ఎన్నిసార్లు ప్రజలకు చెబుతూ వచ్చినప్పటికినీ, ఏ ఒకరు యిద్దరుఅయినా బాగుపడితే చాలా సంతోషమే. అప్పుడు దాన్ని మనమందరము స్వీకరించవచ్చును. కాబట్టి యీ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపించమని విజయభాస్కర రెడ్డిగారుకూడా చెప్పారు. వరశుల్కాలు యిందులో ఎన్నిరకాలు వున్నప్పటికినీ, యీ బిల్లును చట్టముచేస్తే పెండ్లిచేసుకున్న వరుడు, వధువు, వారి తల్లిదండ్రులు, పెళ్ళిచేయించిన పురోహితుడు, పెళ్ళికుదిర్చి వ్యవహారం నడిపించినవారికి శిక్షపడుతుందని వున్నది. ఇందులో ఎవరికీ శిక్షపడదు. కారణము యేమిటంటే, ఎవరో పెళ్ళివ్యాపారము జరిపినవారు వీరుఅని ఎవరికినీ తెలిసేదిలేదు. ఈనాడు దేశములో వరకట్నాల విషయములో అందులో వధూవరులకు యీ విషయము తెలిసేదిలేదుకూడా. రాయదుర్గములో ఒక తల్లిదండ్రులకు పదిహేను సంవత్సరముల కుమార్తెకలదు. ఆమె పెళ్ళికి ఇప్పుడు అడిగేమాదిరి యాభైవేలరూపాయలు కట్నముకాకుండా పిల్లతండ్రి వెయ్యి రూపాయల కట్నము కోరాడు. పిల్లకు వయస్సువచ్చింది. పెళ్ళిచేసుకుని భర్తతో కాపురము చేయాలనే కుతూహలముతోవుంది. కాని, పెళ్ళికొమార్తెకొరకు వచ్చిన వారందరితో వెయ్యిరూపాయలు యిస్తేనేతప్ప నేను పిల్లనిచ్చి పెళ్ళిచేయనుఅని పట్టు పట్టాడు. ఆ మాదిరిగా పిల్లతండ్రి పట్టుపట్టగా, ఒకఆయనవచ్చి ఏమైనాసరే, యీ పిల్లను ఎట్లాగయినా పెళ్ళిచేసుకొని పోవాలనే వుద్దేశ్యముతో, పిల్ల తల్లిదండ్రులను యిబ్బంది పరచవలెననే వుద్దేశ్యముతో 999 రూపాయలే యిస్తానుగాని, వెయ్యి రూపాయలు మాత్రము యివ్వను అని గట్టిగాచెప్పగా, పిల్లతండ్రి వెయ్యిరూపాయలకు మూర్ఖపుపట్టు పట్టాడు. పెళ్ళిజరగకుండాపోయే పరిస్థితి వచ్చింది. పెళ్ళి చేసుకొని పోవలెనని వచ్చిన ఆయన వెళ్ళేసమయములో ఆపిల్ల యీ పెళ్ళి ఆగిపోతుం దేమోనని భయము, ఆతురతతో బైటికివచ్చి "నేను 999 రూపాయలు విలువచేసే టప్పుడు, యిక ఒక్కరూపాయి విలువచేయనా అనిచెప్పి, నన్ను తీసుకొనివెళ్ళమని వచ్చినఆయనను కోరింది. అప్పుడు ఆయన ఆ వెయ్యిరూపాయలు యివ్వగా, తక్షణం తల్లిదండ్రులకు తన శరీరముమీదవున్న చీర వగైరాలు యిచ్చివేసి, పెళ్ళి కుమారుని పైబట్టతీసుకుని, తనుధరించి, భర్తవెంట వెళ్ళిపోయింది. కాబట్టి యీ విషయములో దండించబడవలసినది తండ్రా, తల్లా? ఇందులో ఎవరిని దండించవచ్చును? కాబట్టి యిందులో కొంత ఆలోచించవలసిన విషయము వున్నది. అంతేకాకుండా యింకా ఎక్కువైన సంగతులు జరుగుతున్నవి. అవన్నీగూడా ఆలోచించవలసిఉంది. చాలామంది వరకట్నము యివ్వవలసివచ్చి, చివరకు యిబ్బందిపడేవారు వున్నారు. అందువల్ల సొమ్ములు వగైరాలు యివ్వడం, జరుగుతోంది. వ్యవహారము ఎట్లాజరుగు తున్నదో, కొంతమటుకు వారికి చెప్పినట్లయితే, వారికి తెలుస్తుంది. పెళ్ళికుమార్తెకు

పదివేల రూపాయలు విలువగల బంగారునగలు కోరినప్పుడు దానికి తగినట్లుగా పెళ్ళి కుమారునికి చేతికి కంకణం, సైకిలు, రిస్టువాచి యివన్నీయిచ్చి యింకను పెళ్ళి కుమారుడు డాక్టరుపరీక్ష చదువుతున్నయెడల డాక్టరుకు కావలసిన పరికరములు పుస్తకములు వగైరాలకుకూడా మీరేయివ్వాలి అనిఅడిగి పిల్ల తల్లి దండ్రుల వద్దనుంచి నిర్బంధముగా తీసుకున్నవారిని నేను చూచాను. ఆ విషయము యావత్తూ గుర్తించినవారు యిక్కడనే వున్నారు. కాబట్టి అంతంత విలువగల కట్నములు నగలు యివ్వాలంటే డబ్బుగలవాడుఅయితే యిస్తాడు. ఇక యివ్వలేని పేదవానిసంగతి ఏమిటి ? ఇవ్వటానికి ఆయనవద్ద ఏమీవుండదు. కాబట్టి డబ్బు వున్నవారు ఎన్నోవిధాలుగా చేస్తూవుంటారు. ఒక విషయములో నాకీ అనుభవము అయినది. నావద్దకు ఇంజనీరింగు కాలేజీలో సీటు యిప్పించమని ఒక పెద్దమనిషి వచ్చాడు. అదే మాదిరి ఇంకా ఎంతోమంది వస్తూ వుంటారు. అందులో ఒక ఆయన, అయిదువేల రూపాయలు ఖర్చు అయిననూ పరవాలేదు, సీటు మాత్రము యిప్పిస్తే చాలు అని కోరాడు. అటువంటి వారు ఎక్కువగా కృష్ణా గోదావరి జిల్లానుంచి వస్తూవుంటారు. వారుఆవిధంగా చెప్పడముతో నేను ఆశ్చర్యపడి ఎందుకు యీవిధంగా కోరుతారు అని అడగగా, అయిదువేల రూపాయలు ఖర్చు చేసినను, యింజనీరింగు చదువుతున్నాడు పిల్లవాడు, అని అంటే, ఆపిల్లవాడికి, పది వేలుకాదు, యాభైవేలు అయినను కట్నముయిచ్చి పిల్లను యిచ్చి పెళ్ళిచేయటానికి వస్తారట. ఈవిధంగా వచ్చే ఆశాపాత్రులు ఎంతోమంది వున్నారు. ఇంజనీరింగు కాలేజీలోగాని, డాక్టరు కోర్సు చదువుచున్నాడని గాని అంటే చాలట. వేలకు వేలు కట్న రూపములో సంపాదించవచ్చునట. ఇది ఒక వ్యాపారము క్రింద నడుస్తున్న వ్యవహారము. పిల్లను యితర గొప్ప కట్నములో యివ్వదలచు కున్న వారు పిల్లవాని యోగ్యతా యోగ్యతలు చూడరనుకుంటాను. ఊరకనే ఆ కాలేజీలలో చదువున్నాడు అంటేనే గొప్ప, గౌరవమాట. అంటే, పెళ్ళి అయిన తరువాత, పెళ్ళి కుమారుడు ఆ కోర్సులో ఉత్తీర్ణుడు కాకపోతే, యీవిధంగా కట్న రూపములో వచ్చే 50 వేలు, 60 వేల సొమ్ముతో, భార్యభర్తలు యిద్దరూ గూడ జీవిస్తారు, పరవాలేదనేది, వారి మనస్సులలో వున్న ఆలోచన అని తెలిసింది. కాబట్టి యిటువంటి దురాశాపరులు లోకములో ఎంతమంది వుంటారో కొంచెము ఆలోచించవలసి వుంటుంది. ఇంకొక ఉదాహరణ చెబుతాను. ఆయన బెజవాడలోనే వున్నారు. మన కాశేశ్వరరావుగారికిగూడ తెలుసును. డాక్టరుగా వుండేవారు. తమ పిల్లలకు పెళ్ళి చేయవలసి వచ్చినప్పుడు, వారు ఎన్ని విధములైన యిబ్బంది పడ్డారో ఆయనకు తెలియదు. మధ్వులలో కొన్ని ఆచారాలుగూడ వున్నవి. పెళ్ళి కుమార్తెకు సొమ్ము పెట్టేది కాకుండా, పెళ్ళి జరిగే సమయములో, మంగళ సూత్రముకట్టేటప్పుడు పెళ్ళి కుమారుని తల్లి దండ్రులు ఎక్కడికోపోయి అలిగి

కూర్చుని వుంటారట. పిల్లవాని తల్లి తండ్రులకుగూడ వెయ్యినూట పదహార్లు కట్నము సమర్పించ వలెనట. ఆవిధంగా అలిగిపోయి కూర్చున్నప్పుడు ఆ తల్లితండ్రులను మేళతాళములతో పిలుచుకుని వచ్చి పాదపూజచేసి, వారికి సమర్పించవలసిన కట్నము సమర్పించవలెనట. ఆహా! మా పిల్లవాడిని కని పెంచి, పెద్ద వానిని చేయడము వలనగదా. మాపాదపూజ జరిగిందని సంతోషిస్తారట. కొంతమంది తల్లి తండ్రులు పూలహారములు వేసి, మేళ తాళములతో పిలుచుకుని వచ్చి పాదపూజ చేస్తే సంతోషించేవారుగూడ వున్నారు. కాబట్టి డబ్బుగలవారి విషయము నేను చెబుతున్నాను. ఈవిధంగా కట్నముల రూపములలో పెళ్లి కుమారుని తరఫున వారు పెళ్లి కుమార్తెల తరఫున వారిని పీల్చి పిప్పిచేయడము, యేవిధంగా నడుస్తున్నదో సభ్యులు గ్రహించాలి. కాబట్టి యీ విషయములు జరుగుతున్నప్పుడు యీ బిల్లును ప్రజలలో ప్రచారము చేయించి, ప్రజలయొక్క అభిప్రాయములు సేకరించడము చాలా అవసరము. ప్రజా ప్రతినిధులమైన, మనలో ప్రతి ఒక్కరూ కూడా, యీ విధంగా జరగడము హేయమైనది, మంచిదికాదు అని ప్రజలకు వెల్లడిపరచి, సంఘములో "Make the Hindus know what there is in fame is sufficient punishment" అని పెద్దలు చెప్పినట్లుగా, యిది ప్రచారము చేయటానికి ఒక పద్ధతిగా వుంటుంది. ఇదివరలో శారదా బిల్లు వస్తున్నదని తెలిసిన తరువాత, అది చట్టం కాబోయే ముందు సుమారు నలభైవేల పెళ్లిళ్లు మన దేశములో చేశారు. అదేవిధంగా యీ శారదా యాక్టు వచ్చిన తరువాత జరిగిన పెళ్లిళ్ల విషయములో, అది ప్రచారముగా ఉపయోగించింది గనుక, యిప్పుడు దీన్నిగూడ ప్రచారానికి పంపడము సరియైనదే కాబట్టి, ప్రచారానికి పంపే సందర్భములో ప్రజాప్రతినిధులుగా వున్న యిక్కడ శాసన సభ్యులు తమ తమ నియోజక వర్గములలో, యీబిల్లు సంగతి చెప్పి, యీ కట్నములు యివ్వడము మంచిదికాదు అని చెప్పి, ప్రజల అభిప్రాయాలు సేకరిస్తే బాగా వుంటుంది. ఇప్పుడు దీన్ని ప్రజాభిప్రాయానికి పంపవలసింది అనే సవరణను అందరు ఏక గ్రీవంగా ఆలోచించి ప్రజాభిప్రాయానికి పంపటానికి ఆమోదించవలసిందిగా కోరుతూ విరమిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ బిల్లు ప్రజలందరికినీ చాలామట్టుకు సంబంధించినదే. ఇందాక సభ్యులు చెప్పినట్లు దేశములో యీనాడు ఆడపిల్లలుగలవారే ఎక్కువమందివున్నారు. నిజమే. అందువల్ల యీబిల్లు చట్టముచేస్తే బాగానేవుంటుందని, అనుకుంటారు. సంఘములో యిటువంటి సంస్కరణ జరగడము అవసరమేకాని, యీ విధమైన బిల్లులు, చట్టాలుచేస్తే, యిది అమలులోకి వచ్చేసరికి, సరిగా అమలు జరుగుతుందా అనే నాకు సందేహము. ఇది ప్రధానసమస్య. ఈ బిల్లు Public opinion కు పంపించడమునకు శ్రీ

కాళేశ్వరరావుగారు ఒప్పుకున్నారు. కాని దేశములోవున్న యువకులుగూడా యిది ఒక ప్రతిజ్ఞ, ఒక సవాలుక్రింద తీసుకోవాలని నా అభిప్రాయము. అప్పుడే యీ బిల్లుయొక్క ప్రధాన్యత, గుర్తించబడి, ఉపయోగపడుతుంది. ఈనాడు ఆంధ్ర దేశములో సంఘసంస్కారము కావాలని, రాజకీయ జీవితంలో మార్పురావాలని ప్రజలు కోరుతున్నప్పుడు, యువకులకు వారి తల్లితండ్రులు పెళ్లికొడుకు కేవలం వేలంపాట పెట్టడము ఎంత సమంజసమో యువకులే గుర్తించాలి. ఈనాడు యీ వేలంపాట ఎంత వరకు పోతున్నదంటే యువకులుగా వున్నవారు. S.S.L.Cవరకూ చదివితే రు. 1000 Inter చదివితే రెండువేలు, బి.ఏ. చదివితే మూడువేలు, యింకా ఈ తరగుతులలో, పీలుఅయితే, యింకా సమయము దొరికితే, జాస్తి సొమ్ముకే ఫాటపెట్టి కట్నరూపములో కోరుతున్నారు. ఈ వేలంపాట పిల్లతలితండ్రులయొక్క ఆర్థికశక్తినిబట్టి వుంటుంది. ఇదిగాక పిల్లగూడ చదివినట్లైయితే, యింకా ధర పెరుగుతుంది. అందువల్ల దేశములో పేదలైన వారిసంగతి ఏమిటో గ్రహించాలి. అందువల్ల దేశములో యిటువంటి పరిణామాలు అన్నీ మారిపోవటానికి మనము ప్రయత్నించాలంటే, దీనికి యువకులు ముందుకురావాలి. యువకులందరు కట్నాలను నిషేదించాలి, అని ఒక ప్రతిజ్ఞగాను, సవాలుగాను తీసుకుని "మేము ఎవరవూకూడా కట్నాలు తీసుకోము" అని ఏకగ్రీవముగా నిలబడేటట్లుచేసి, యిది యింకను దేశములో వారిచేతనే ప్రచారముచేయిస్తే, యీ బిల్లుయొక్క వుపయోగము కనబడుతుందిగాని, దీన్ని అమలులోకి తీసుకొని రావటానికి యింకొకమార్గము కనబడదు. దీనిని బాగుగా ప్రచారము సాగించాలి. ఇది చాలా అవసరము. ఈ బిల్లును శాసనసభ ఎదుటపెట్టి శాసనము చేయించేదానికి ముందు, దీన్ని రాష్ట్రములో ప్రజాభిప్రాయముకొరకు పంపించడము మంచిదని సభ్యులు చెప్పినప్పుడు, నేను గూడా దాన్ని బలపరుస్తూన్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—The mover has accepted the amendment. Therefore let the mover reply.

Sri A. KALESWARA RAO :—అధ్యక్షు మహాశయా, ఇంక నేను ఎక్కువసైము తీసుకోనవసరములేదు. విజయ భాస్కరరెడ్డిగారు ఉపపాదించిన సవరణను నేను అంగీకరించాను. కాని నిజముగా యీ బిల్లు యిప్పుడు ప్యాసుచేయతగినదే. సెలెక్టుకమిటీకి పోవడం నామమాత్రమేనని అనుకోవచ్చును. ఇప్పటికి ఎన్నో సంవత్సరాలనుంచి సంఘములో వేళ్లు పాతుకొనిపోయిన యీ దురాచారమును అందరు యీనాడు ఖండిస్తున్నారు. కాని పెళ్ళికుమారుని బజారులో వేలము పాటపెట్టి కొనుక్కునేస్థితి ఏర్పడ్డది. ఇది చాలా నామోషీగావున్నది. కొంతమంది చెప్పుకుంటూ

Sri A. Kaleswra Rao] [1st December 1955

వుంటారు. మా అబ్బాయికి పదివేలుయిచ్చారండి అని ఒకరు, మా అబ్బాయికి పది హేనువేలండి అని యింకొకరు, ఈ విధంగా సిగ్గులేక చెప్పుకుంటారు. ఆంధ్ర దేశములో ప్రజలు యీ స్థితిలోనికి వచ్చారు. ఇది వినటానికిగూడా చాలా సిగ్గుచేటు, శోచనీయం. నేనుయింకాక నేచెప్పాను. యువకులకు యిదిఒకసవాలుగా పరిగణిస్తుంది. నిజానికి యువకులేగనుక యీ కట్నాలు తీసుకోకూడదు, యిది చాలా హీనమైనపని, యువకునికి అత్తవారియింట్లోనూ, ప్రజలలోనూ విలువవుండదు అనేది గ్రహిస్తే, దేశము బాగుపడుతుంది. దేశములో ఆడపిల్లలుగలవారిని మరింత హీనస్థితిలోనికి పోకుండా కాపాడినవాళ్లు అవుతారు. ఇచ్చినవారిని పుచ్చుకున్నవారినిగూడ యీ యువకులే పట్టిస్తారు. కాబట్టి సంజీవరెడ్డిగారు చెప్పినదానికి అభ్యంతరము వుండనక్కరలేదు. ఈ బిల్లు ప్రభుత్వముమీద ఎక్కువగా ఆధారపడివుండదు. ఇది కేవలం సంఘముమీద ఆధారపడివున్నది. మంత్రులు సంఘాన్ని బాగుచేయలేరు. ఈ బిల్లును చట్టముచేస్తే, సంఘములో మంత్రులకు అప్రతిష్టవస్తుందని అనుకోనక్కరలేదు. ఇందులో అటువంటిది యేమీలేదు. ఇది ప్రజాభిప్రాయానికి పంపించవలసినదే. ప్రచారము చేయించవలసిందే. కట్నాలుయిచ్చినవారిని, పుచ్చుకున్న వారిని శిక్షించవలసిందే. ప్రజాభిప్రాయము యీ బిల్లును ఆమోదిస్తుందని నా గట్టి నమ్మకము. జ్ఞానముగల యువకులు అయితే దీనికి వెన్నెముకగావుండి, బాగాపట్టు పట్టుతారు. ప్రజాభిప్రాయము సేకరించటానికి నేను సుముఖుడనే. కాబట్టి వచ్చే ఏప్రిల్ ఒకటవతేదీలోపల ప్రజాభిప్రాయము వచ్చేటట్లు చేయవలసిందిగా కోరుతున్నాను. వెనుక నేను బహుభార్యత్వ నిషేధపుబిల్లును తెచ్చినప్పుడు, దాన్ని ప్రజాభిప్రాయము సేకరించటానికి పంపవలసిందనికోరితే, నేను ఒప్పుకున్నాను. అందులో కొంతమంది దక్షిణాదివారు యిద్దరు పెళ్లాలు లేకపోతే ఎట్లాగండి. మొదటి భార్యకు పిల్లలు పుట్టకపోతే, ఎట్లాగండి అని అన్నారు. దక్షిణాది వారు కొంతమంది, ఇద్దరు పెండ్లాలు లేకపోతే ఎట్లాగని, పిల్లలు పుట్టకపోతే రెండవ పెండ్లి చేసుకోకపోతే ఎట్లాగండి అని అన్నారు. ఆ విషయము కౌన్సిలులోకూడా వచ్చింది. పెద్దవారు చాలామంది ఆక్షేపించారు. మొగవాడి వల్ల పిల్లలు పుట్టకపోతే రెండవ పెండ్లి చేసుకోవడము అర్థములేదు అని నేను చెప్పాను. ఈ సందేహాలన్నీ ఇట్లాగే ఉంటాయి. ఇవన్నీ ఇప్పుడు తేలే సంగతులు కాదు. ఇది నైతికమైన బిల్లు. బహుభార్యాత్వనిషేధము ఎట్లాంటిదో ఈ వరకట్న నిషేధంకూడా అట్లాంటిదే. కాబట్టి దీనిని ప్రజాభిప్రాయానికి మీరందరూ ఏకగ్రీవంగా తోడ్పడి ఆంధ్ర దేశముయొక్క మర్యాద నిలుపవలసిందని కోరుతూ, నేను అనువరణను అంగీకరిస్తున్నాను.

1st December 1955]

MR. SPEAKER :—The question is.

"That the bill be circulated for eliciting public opinion thereon before 1st April 1956."

The motion was carried.

## (2) THE ANDHRA TENANTS PROTECTION BILL, 1955.

MR. SPEAKER : Sri Vavilala Gopalakrishnayya will move his Bill. You have right only to make a statement and not a speech.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Sir, I beg leave of the House to introduce the Andhra Tenants' Protection Bill, 1955.

(అధ్యక్షా, నేను Andhra Tenants Protection Bill, 1955 అనేటటువంటి ఒక non-official bill ను ఉపపాదిస్తున్నాను.)

దీనికి సంబంధించిన సంస్కరణలు దేశములో అనేకము తెస్తామని చెబుతున్నారు. కొంత కాల వ్యవధిలో తేవలసి ఉంటుంది. అందువల్ల ఇవాళిటి రోజున కౌలుదార్లు సాగు చేస్తున్న భూములన్నింటినికూడా ఏదో వస్తుందని వాటి యజమానులు కౌలుదార్లనందరిని భూములనుండి తరిమి వేస్తున్నారు. ప్రభుత్వము తెస్తాము అని చెప్పిన శాసనములు అమలులోకి వచ్చేటప్పటికి అసలు కౌలుదార్లే లేని పరిస్థితి తయారవుతున్నది. జమీందారీ బిల్లు వచ్చినప్పుడు ఏమిజరిగిందో మనకందరికి తెలుసు. దీనిని అమలు జరుపమని ప్లానింగు కమీషను ఖచ్చితంగా చెప్పింది. ఆంధ్ర ప్రభుత్వముకూడా Land reforms committee ని వేశారు. వారు రిపోర్టు తయారు చేశారు. అది గవర్నమెంటు consideration లో ఉన్నదని వింటున్నాము. విశాలాంధ్ర త్వరలో వస్తోంది కాబట్టి, దానిని ఇప్పుడు తీసుకొని రానవసరములేదు. వచ్చిన తరువాత ఈ బిల్లును తీసుకు వస్తామని ఇప్పుడు దానిని గురించి ఆలోచించ నవసరములేదని వారు చెప్పారు. ఆ విషయం పత్రికలో వచ్చింది. వాళ్ళకు, వీళ్ళకు వున్న పరిణామాలలో Land reforms లో చాలా తేడాలు ఉన్నాయి, అవన్నికూడా integrate కావలసిన అవసరము ఉన్నది. అందువల్ల వారికి కొంత time ఇవ్వమని చెప్పి ప్రజలు, కమీషనువారుకూడా చెప్పారు. అంత కాలవ్యవధి అవసరములేదు వెంటనే integrate చేసుకోవచ్చును అని చెబుతున్నాము. అందువల్ల ఏవిధమైన సంస్కరణలు అమలు జరుగబోతాయో, మనము

time చూసి, బిల్లు తీసుకువచ్చేలోగా అక్కడ land reforms లో గాని, ప్లానింగు కమీషను చూస్తున్నటువంటి సీలింగ్సులో గాని లేకపోయి నట్లయితే, ఇప్పుడు వచ్చినటువంటి సుబ్బారావుగారి కమిటీ రిపోర్టు ప్రకారంగా గాని, లేకపోతే ఇంతవరకు ఉన్న సుబ్రహ్మణ్యం రిపోర్టు ప్రకారంగా గాని జరిగే పరిణామాలు అమలు జరిగేవరకు ఇవ్వాళిటి రోజున వున్న రైతాంగమును పొలాలనుంచి తొలగించకుండా వాళ్లు వుండేందుకు హక్కు వుండే పద్ధతిలో వాళ్ల యొక్క tenancy ని protect చేయడానికి ఈబిల్లు తీసుకురావడము జరిగింది.

అంతే కాకుండా బస్తీలలో ఉన్న ఖాళీ స్థలాలలో ఇండ్లు కట్టుకొంటే, స్థల యజమానులు ఆ కట్టుకున్న వారిని ఆ tenancy నుంచి ఖాళీ చేయమంటున్నారు. అట్లాంటివారికికూడా రక్షణ కలుగ చేయడానికి ఈబిల్లు తీసుకురావడము జరిగింది. ప్రభుత్వమువారుకూడా దీనికి వ్యతిరేకము కాదు అనుకొంటాను. ఇదివరకు అందరికి కూడా మేము రక్షణ ఇస్తాము అని చెప్పారు. విశ్వనాథం గారు ఆంధ్ర ప్రభుత్వము రాగానే ఇటువంటి బిల్లు తేబోతున్నామని చెప్పారు. బిల్లు తెస్తున్నాము అంటే ఎంతోమంది రైతాంగము నోరు తెరుచుకుని కూర్చున్నారు. అటువంటి బిల్లు గవర్న మెంటు తెస్తాము అనగానే 100 ఎకరాలు ఉన్నవారు, 200 ఎకరాలు వున్నవారు ఆ భూములలో ఉన్న కౌలుదార్లను బయటకు గెంటుతున్నారు. ఉదాహరణకు ఇవాళ సత్తెనపల్లిలో 100 ఎకరాలు భూమి కౌలుకు ఇచ్చినవి ఉంటే యజమానులు అందరూ కలిసి ఆ కౌలుదార్లను నెట్టివేస్తున్నారు. వాళ్లు లేవనిచో కోర్టులద్వారా eviction ద్వారా బయటకు నెట్టుతున్నారు. అటువంటి పరిస్థితులలో వాళ్ళకు రక్షణ ఇవ్వడానికి శాసన పూర్వకమైన అవకాశాలు కల్పించడానికి ఈ శాసనమును మేము తీసుకురావడము జరిగింది. దీనిని ప్రభుత్వాన్ని అంగీకరించమని కోరుతున్నాను.

MR. SPEAKER :—You have not explained the provisions of your Bill. The Government will see whether they can accept and the House also will see whether the provisions are acceptable or not. Please give a brief resume of the same.

* SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, బిల్లు ఉద్దేశాలు తెలియ జేస్తున్నాను.

"While the pronouncements of the high personalities and the Ministers of their intention of land reforms have created hope in the tenants, at the same time it has given a serious caution to the landlords. Where the tenants are waiting for

their good days to come, the landlords are forceably and unjustly evicting the tenants from the lands who are cultivating since a long time. Cultivating Tenant is placed in helpless condition. These unjust evictions are going on a large scale. These large scale evictions, if allowed to continue, will lead to aggrarian trouble and breach of peace."

"In the same way the landlords in the urban areas are also forcing the evictions of hutments and other buildings constructed on the lands which were given on long leases. When residing tenants were to evict the structure without any adequate compensation.

"As these problems of the cultivating and residential tenants are to be finally solved by comprehensive legislation, it is imperative to protect these tenants from unjust, forceble evictions. As the Government and the Planning Commission are trying to expediate these legislative measures the tenants will have to be protected at least for three years till the comprehensive legislation is enforced".

"However, a tenant will not be entitled to protection if he is in arrears of rent or has done any act which is destructive of or injurious to, the land or crop thereon, or has ceased to cultivate the land or has used for any other purpose other than that for which it was suitable provision has been made for restoring the land to any cultivating tenant who was in possession of it on or before October 1953."

"The object is to protect the tenants from unjust eviction for a period of three years, and hence this Bill."

ఇవ్వాళిటి రోజున భూములు ఎవరి చేతుల్లోనైతే ఉన్నాయో, ఆ భూముల యొక్క యజమానులు ఆ కౌలుదార్లను మూడు సంవత్సరములవరకు ఆ కౌలునుంచి తొలగించకుండా ఆ భూములలోనే వుంచాలని దీంట్లోని ప్రధాన ఉద్దేశ్యము. ఒక వేళ వాళ్లు rent ఏదైనా కట్టవలసివస్తే అది 3 నెలలలోగా Act వచ్చిన తరువాత డిపాజిటు చేయడము, డిపాజిటు చేసినదానిని గవర్నమెంటు వాళ్ళకు అప్ప చెప్పడము, ఆ విధంగా వారిని రక్షించడము జరుగుతుంది. భూస్వాములకు ఉన్న హక్కులను తొలగించకుండా భూములలో ఉన్నటువంటి కౌలుదార్లను మాత్రం తొలగించకుండా ఉంచేదే దీనిలోని ప్రధాన ఉద్దేశ్యము.

Sri Vavilala Gopalakrishnayya] [1st December 1955

చిన్న చిన్న ఇళ్లు ఇవన్నీ కట్టుకోవడానికి అతనికి అవకాశము ఉంటుంది. అతనికి కేటాపద్ధతిలో మాత్రము మార్చడానికి వీలులేకుండావుండే ప్రయత్నము వరకే దీని ఉద్దేశ్యము. తరువాత Consequential గా అమలుజరిపే procedure ఎట్లాగో దానిని గురించి మొత్తము బిల్లులోఉన్న ప్రధానవిషయాలు పట్టణాలలో ఖాళీస్థలాలు ఉంటే, అది ఎవరికైనా ఇండ్లు కట్టుకోడానికి ఇచ్చినప్పుడు, ఆ tenant ఇల్లు కట్టుకొనిఉంటే అతనికి ఖాళీచేయమని నోటీసు ఇస్తున్నారు. అది మద్రాసులోకూడా జరిగింది. ఆ tenant ఖాళీచేసే వెళ్ళేప్పుడు ఆ ఇల్లు చిన్నదిఅయినట్లయితే ఇంటిఖరీదు ఇవ్వమని అడుగుతున్నారు. (అతను అక్కడ ఉండడు కాబట్టి)

దానికన్నా ముఖ్యమైనది పొలాలలోఉన్న రైతాంగము, యజమానులు అంతా కూడా ఇప్పుడు Estate Land Act సమస్య తెలిపోయింది. అగ్రహారాలకు సంబంధించిన Whole Inam bill ఒకటి వస్తుందని అంటున్నారు. గెండవది ఖండ్రి కలకు సంబంధించిన వాటిని తొలగించకుండా ఉండేందుకు రాష్ట్రపతి శాసనముల ప్రకారంగా అమలు జరిగింది. ఇవి ఏవీకాకుండా ఇంకా కొన్ని పొలాలుఉన్నాయి. వాటినుంచి తొలగించడము జరుగుతున్నది. అది రైత్వారీఅని చెప్పారు. రైత్వారీ అమలు జరుగుతున్న దాంట్లో tenancy ని రక్షించడము ఎట్లాగు అన్న సమస్య మీదనే ఇవాళ ప్రధానముగా ఆలోచిస్తున్నాము. ఆ tenancy ని తొలగించ వద్దు. ఏమిచేస్తారు ? అతనికి హక్కువస్తున్నదా సీలింగువస్తున్నదా ? లేకపోతే పొలాలు తీసుకుంటూరా ? లేకపోతే అతనికి డబ్బు ఇవ్వవలసివస్తుందా ? మళ్లీ మద్రాసు Act ప్రకారము కౌలుకు 5 సం।ల వరకు ఇప్పిస్తారా? లేకపోతే ఇటువంటి Act ప్రకారం 10 సం॥ముల వరకు తొలగించకుండా వుంటూరా? అన్ని సమస్యలన్నీ కూడా మీరు తీర్చండి. అందుకు సంబంధించిన లెక్కలుతీసుకున్నాము అంటున్నారు. మీరు అట్టి లెక్కలుఇస్తే మా కేమీ అభ్యంతరములేదు, మీరు తేబోయేబిల్లును లేద నడములేదు. వీటికి కావలసింది మన అందరి అభిప్రాయముకదా ? అక్కడ ఏ కౌలు దారు అయితే ఉన్నాడో ఆ Tenant కి రక్షణకావాలనేది ప్రధానమైన భాగము అవుతుంది. రక్షణకలిగిస్తాము. 3 సం॥ల వరకు ఈ Act అమలు జరుగుతుంది అని ఉన్నది. ఆ రక్షణ ఇప్పించడానికి ఈ Act ను అంగీకరించమని కోరుతూ నేను దీనిని ఉపపాదిస్తున్నాను.

**MR. SPEAKER :—Motion moved :—**

"That leave of the House for the introduction of the Andhra Tenants' Protection Bill, 1955 be granted."

1st December 1955]

THE HON. SRI N. SANJEEVA REDDI :—అధ్యక్షా, వారు tenancy ని గురించి చేసిన ఉపన్యాసముతో అభిప్రాయభేదము వెలిబుచ్చడానికి అవకాశములేదు. రైతులకు రక్షణ ఇవ్వాలనేది అందరూకూడా వారితో ఏకీభవించే విషయమే, కాని కమిటీరిపోర్టు ఈ మధ్యనే పూర్తిఅయింది. వారు ఇప్పుడే ప్రభుత్వానికి పంపినారు. ప్రభుత్వము దానిని అమలు జరపడానికైనా అవకాశములేని ఈ సమయంలో గోపాలకృష్ణయ్యగారు ఇలాంటి తీర్మానము ఇక్కడ చర్చించడానికి పెట్టడము అనవసరము అనుకుంటున్నాను. వారి అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. రైతులకు రక్షణ కావాలనేది నిస్సందేహమైన విషయము. దానికి ఏమిచేయాలి, ఎప్పుడు చేయాలి అనే విషయమై కొంత వ్యవధిఇస్తే ప్రభుత్వము దీనిని సమగ్రంగా పరిశీలనచేసి తగినచర్య తీసుకుంటుంది. కొంతమంది పెద్దలు దాదాపు ఒక సంవత్సరముపైన కూర్చొని ఒక నివేదిక తయారు చేసినారు. అది ప్రభుత్వవారి పరిశీలనలో ఉన్నది. ఆ నివేదికలో ఎన్నో విషయాలు ఉండవచ్చు. వాటి యోగ్యతలు పరిశీలించి అభివృద్ధికరమైన శాసనం చేయబోతున్నప్పుడు Non-official బిల్లు ఒకటి ప్రవేశపెట్టడము అనవసరము అనుకొంటాను. ప్రభుత్వము దృష్టిలో ఈ విషయాలుకూడా ఉన్నాయి. ఇవన్నీ ఆలోచిస్తుంది. కాబట్టి శ్రీ గోపాలక్రిష్ణయ్యగారు వారి బిల్లును ఉపసంహరించుకొని మేము ఏమిచేయగలుగుతామో, ఏమిచేస్తామో కొంత నిరక్షించి చూడమని వారిని కోరుతున్నాను. వారి ఉపన్యాసమునకు సమాధానముగా నేనుకూడా ఇంత పొడుగున ఉపన్యాసము చేయవలసిన అవసరములేదు. వారుచెప్పిన principle తో అంగీకరిస్తూ, దానికి సరియైన అదను ఇంకా రానేలేదని వారికి సమాధానము చెబుతున్నాను.

MR. SPEAKER : The question is :

"That leave of the House for the introduction of the Andhra Tenants' Protection Bill, 1955 be granted.

The motion was lost."

## III. NON-OFFICIAL RESOLUTION

*Distribution of banjar lands.*

SRI B. SANKARAIAH : I beg leave of the House to introduce the following resolution :—

"This Assembly recommends to the Government that all kinds of Banjar or Poramboke Government lands may be given free to all the landless poor and poor ryots.

Sri B. Sankaraiah] [1st December 1955

అధ్యక్షా, నా తీర్మానం బంజరు భూములను పేదలకు ఉచితంగా పట్టాలకు యివ్వాలనేది ఏమీ నూతనమైన విషయంకాదు. ఇదివరకు 1954లో ఏకగ్రీవంగా ఈ తీర్మానాన్ని శాసనసభవారు pass చేసినారు. ఈ సమస్య అనేకరూపాల్లో ఏ జిల్లాకుపోయినా ప్రజలను తీవ్రంగా ఎదుర్కొంటోంది. ఒకచోట విపరీతమైన పెనాల్టీలు వేసారనో, మరొకచోట నాలుగైదు నెలలుగా పెంచిన పైరులను కోసుకో నివ్వకుండా మేము స్వాధీనం చేసుకుంటాము; మీరు పైరులనువదలి వెళ్లిపోవాలని అంటున్నారనో మరొకచోట 10, 15 సంవత్సరాలనుంచి సాగుచేసుకొనే భూములను యిదివరకే ప్రభుత్వము అనుమతించి temporary పట్టాలుయిచ్చిన భూములను వదలి వెళ్లిపోవాలని eviction notices ఇచ్చారని పట్టాలుయిచ్చే కార్యక్రమాన్ని ఆపుచేసి assignments చేస్తామన్న భూములనుకూడా సివాయి జమాదారులకు కాకుండా ఇతరులకు assign చేయడం, lease కు ఇవ్వడం—రకరకాలుగా యీ సమస్య రాష్ట్రంలోని ప్రజలను ఎదుర్కొంటోంది. దాదాపు 10 సంవత్సరాలుగా ఉన్న యీసమస్య ఎందువల్ల పరిష్కారంచేయలేకుండా ఉన్నారు? ఇదిబ్రహ్మాండమైన సమస్యకాదని ప్రభుత్వానికి తెలుసును. కొన్నిలక్షల కుటుంబాల జీవితం ఆధారపడివున్న ఈ సమస్యను సవ్యంగా ఆలోచించి పరిష్కరించడానికి ప్రభుత్వం ఎందువల్ల పూనుకోడంలేదు? ప్రభుత్వ లెక్కలప్రకారమే 31 లక్షల 42 వేల ఎకరాల బంజరులున్నాయని తెలుస్తోంది. forests అని నమోదుచేయబడి, చెట్లులేకుండా చాలాచోట్ల సాగుచేస్తున్న ప్రాంతం ఈ లెక్కలోనికిరాదు. ఇవన్నీ కలుపుకుంటే 40 లక్షల ఎకరాలవరకు ఆంధ్రదేశంలో బంజరుభూములున్నాయని తేలుతున్నది ప్రభుత్వంఇచ్చే statements లో రకరకాలుగా చూపిస్తున్నారు. 16 లక్షల ఎకరాలున్నాయని ఒకప్పుడు అంటున్నారు. ఈ సమస్యను పరిశీలించి సమగ్రంగా పరిష్కరిపచాలని ప్రభుత్వం పూనుకోక పోయినందువల్ల ఈ సమస్యపై యింతతీవ్రమైన గందరగోళం బయలుదేరింది. గత ఫిబ్రవరిలో ఎసంబ్లీలో తీర్మానం చేసిన తరువాత ఏకగ్రీవంగాచేసిన ఆ తీర్మానాన్ని ప్రభుత్వం అమలుజరుపుతుందని ప్రజలు విశ్వసించారు. ఆ తీర్మానం pass చేసిన తరువాత మార్చిలో ప్రభుత్వపక్ష సభ్యులైన టి. ఎన్. వెంకటసుబ్బారెడ్డిగారు ఈ విషయంపై అర్ధగంట చర్చించాలని అనుమతి తీసుకున్నమీదట చర్చజరిగింది. ఆ సందర్భంలో అసెంబ్లీలో ఒకసారి తీర్మానం ఆమోదించిన తరువాతకూడా ప్రభుత్వం యీ సమస్యను సరిగా పరిష్కరించడంలేదని మరల తెలియచేశాము. పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా పరిష్కారం చేయాలనే ఉద్దేశంతో అప్పుడు అధికారంలోవుండే ప్రకాశం ప్రభుత్వం వారు ఒక G. O. పాసుచేశారు. కొన్నిరకాలైన బంజరులుమాత్రం వెంటనే యిచ్చే కార్యక్రమం ప్రభుత్వంవారు తీసుకోవాలని యీవిధంగా ప్రారంభించారు. కొన్ని G. Os. ఇచ్చారు. కొంత కార్యక్రమం నడిచింది. ఈ బంజరు సమస్యను

పూర్తిగా పరిష్కరించినట్లయితే ప్రజలకు ఉపయోగిస్తుందని అనుకోకపోయినా పాక్షికంగానైనా ఈ సమస్య పరిష్కారం అవుతుందని అనుకున్నాము. కాని ఈ ప్రభుత్వం వచ్చినతరువాత అంతా తిరగతోడి ఇదివరకు ప్రభుత్వంతీసుకున్న చర్యలకు విరుద్ధంగా 1955 లో క్రొత్త G. Os. పంపించారు. ఈ రకంగా ప్రభుత్వం చేయడానికి తగిన కారణాలు ఏమైనా వున్నాయా ? తక్షణం విశాలాంధ్ర కావాలని కోరుతున్నాము. విశాలాంధ్ర నిర్మాణానికి ఈసమస్య పరిష్కరిస్తే ఇది అడ్డువస్తుందా? పంచవర్ష ప్రణాళికకు అడ్డువస్తుందా ? ఎందువల్ల యీ సమస్యను సవ్యంగా పరిష్కరించడానికి పూనుకోడంలేదు? ఒక్కొక్కచోట ఒక్కొక్కవిధంగా ఈ సమస్యను ప్రభుత్వం లేవదీస్తోంది. మా నియోజకవర్గంలో జరిగిన విషయం చెబుతాను. వావిళ్ల చెరువులో 240 ఎకరాలను 15, 20 సంవత్సరాలనుంచి 20 సెంట్లు మొదలుకొని శివాయి జమాదారులు సాగుచేసుకుంటున్నారు. వాళ్లందరికి ఏడురోజులలో పైరులు వదలి వెళ్లిపోవాలని, లేకపోతే ప్రభుత్వంస్వాధీనంచేసుకుంటుందని నోటీసుయిచ్చారు. చెరువుసాగు అంటే రైతాంగానికి నష్టం అనుకుంటారేమో. అటువంటిది ఏమీలేదు. ప్రభుత్వం యిచ్చిన నోటీసు ఇందుకనికాదు. అక్కడఉండే రాజకీయ బాధితులకు వందఎకరాలు కేటాయించారు కాబట్టి అక్కడవుండే శివాయి జమాదారులు తొలగిపోవాలని అన్నారు. చెరువు బాగుచేసుకోడానికి వీలులేకపోతే రైతులకు నష్టం వుంటే, దానిని రాజకీయబాధితులకు కేటాయించడానికిలేదు. ఇబ్బందిఅని ఎవరూ అనుకోడంలేదు. డెల్టా క్రిందవుండే చెరువు 300 ఎకరాలు సాగుచేసుకుంటున్నందువల్ల ఎవరికీ నష్టంలేదు. నాలుగు గ్రామాలలోవుండే వ్యవసాయకూలీలు పేదరైతులు 400 మందివరకు సాగుచేసుకుంటున్నారు. రాజకీయ బాధితుల సంఘాధ్యక్షుడైన జిల్లాకాంగ్రెసు అధ్యక్షునితో మాట్లాడాను. 10, 15 సంవత్సరాలనుంచి సాగుచేసుకుంటున్న భూములను రాజకీయ బాధితులకు యివ్వాలి కాబట్టి మీరు వదలి వెళ్లిపోవాలనడం న్యాయమా ? మరొకచోట భూములు తీసుకోనడానికి ఎవరూ అడ్డురావడంలేదు. ఈ భూములే మీకు ఎందుకు కావాలని అడిగితే, యీ విధంగా చేసుకున్నట్లే మాకు తెలియదు. అందరమూ ఆలోచించి పరిష్కరిస్తాము అని చెప్పారు. ఇదేవిషయాన్ని కలెక్టరు ఆఫీసుకుపోయి అడిగితే, evict చేస్తేనే కాని మరొకవిషయం ఆలోచించడానికి లేదుఅని చెబుతున్నారు.

అందువల్ల యీ విధంగా ప్రభుత్వం యిచ్చేటటువంటి G. O. ల వల్ల అధికారుల చర్యలవల్ల ఎన్నోరకాలుగా రైతులు నష్టపడుతున్నారనేటటువంటి విషయం స్పష్టంగా తెలుస్తున్నది. కోవూరుతాలూకాలో నెల్లూరుతాలూకాలో కొన్నివందల ఎకరాలకు ఆ విధంగా notices యిచ్చారు. 4, 5 నెలల పైరు పెరిగింది. కొన్నిచోట్ల కోతలు ప్రారంభించారు. తక్కిన చోట్లకూడా

పంటకోసిపారేసిన పరిస్థితివస్తుంది. ఈ రోజులలో వున్నట్టి యీ సమస్య చౌకపల్లి చెరువులో 100 ఎకరాలు, ముడివర్తి చెరువులో 100 ఎకరాలు, పాపిరెడ్డిపాలెం చెరువులో 100 ఎకరాలు ఈ విధంగా నెల్లూరు కోవూరు తాలూకాలలో వుండేటటువంటి చెరువులలో చాలాచోట్ల ఎవరికీ ఎట్టి అభ్యంతరం లేనటువంటి, పట్టాలు యిచ్చినటువంటి భూములు, Grow more food scheme ను ప్రోత్సహించాలని allot చేసిన భూములు, వీటన్నిటివిషయంలోకూడా యిప్పుడు యీ విధమైనటువంటి eviction notices యిచ్చి పైరులు వశపర్చుకోవడం జరుగు తున్నది. ఇదిఏవిధంగా న్యాయం ? ప్రభుత్వం యీ సమస్యగురించి సరిగా ఆలో చించడంలేదు. కనిగిరి Reservoir క్రింద పర్వతరెడ్డి రమణారెడ్డి అనే ఒకాయన 200 ఎకరాలు దున్నుతున్నాడు. దువ్వూరు చెరువులో ఒకవంద ఎకరాలు దున్నుతున్నారు. అటువంటివాళ్లకు ప్రభుత్వం notices యివ్వడంగాని penalties వేయడంగాని ఏమీ వుండదు. కాని 10 సెంట్లు చేసుకొనేవాళ్లకుకూడా 16 రూపాయలు penalties వేశారు. పనులులేని కాలంలో మేము వచ్చేముందు రైతులంతా Nellore Collector Office కు పోయి పైరు పండిందాక stay యివ్వండి, కొంత time యిచ్చినట్టయితే కడతాం అన్నారు. ఈ సంవత్సరం జమాబందీ జరగడమే అక్టోబరులో జరిగింది. తిండికూడా దొరకని యీ సమయంలో కనీసం మాకు వాయిదా అయినా యివ్వమనికోరారు. ఈ Penalty లు 25 రెట్లు వేశారు అని ప్రభుత్వపక్ష సభ్యులే చెప్పారు. అక్టోబరులో జమాబందీ జరిగినసంగతి ప్రభుత్వానికి తెలుసును. పేదరైతులదగ్గర బొత్తిగా డబ్బులేదు. ఈ విధంగా 15, 20, 50 రూపాయలు పెనాల్టీలు వసూలు చేయాలంటే ఎంతోకష్టంగా వుంటుంది. వారు ఏ విధంగా చెల్లించగలరు ? ఇటువంటి విషయాలన్నీకూడా ఆలోచించాలని కోరు తున్నాను. ఆ విధంగా రాష్ట్రంలో చూచినపుడు యీ G. O. లో రొంపేరు భూములు తీసుకున్నా, 400 మంది రాజకీయ బాధితులకు అంతకుముందు 20, 30 సంవత్సరాలనుండి సాగుచేసుకుంటున్న శివాయి జమాదార్లనుండి తీసి వాళ్లకు యివ్వాలనిచెప్పారు. దీనికి ఇంకో G. O. పంపించారు. మొదట్లో శివాయిజమా దార్లకు assignment చేసినప్పటికీకూడా యీ విధంగా చేస్తున్నారు. వావిళ్ల చెరువు, దువ్వూరు చెరువు assign చేసినప్పటికికూడా కొన్నేళ్లు నీరు రాకపోయి నందువల్ల సాగుచేయకపోతే మధ్యలో సాగుచేయని time లో assign చేశారు కాబట్టి ఆ భూములు రాజకీయబాధితులకు యివ్వాలంటారు. ఇంతకుముందు అసెంబ్లీలో చర్చ జరిగినపుడే ఒకొక్కరికి వందలు ఎకరాలుకూడా lease కు యిచ్చినట్లు ప్రభుత్వదృష్టికి తెచ్చినాము. ఇటువంటివి ఎన్నో భూములున్నాయి. అలపాక నరశింహం అనే ఆయన ఎన్నో సంవత్సరాలనుండి P. W. D. పోరంబోకులు సాగుచేసుకుం టున్నారు. ప్రభుత్వానికి తెలియజేసి యిక్కడనుంచి శిపార్సు తెచ్చిన వేగూరు సుబ్బా

రామిరెడ్డికి lease కు తీసుకున్నారు. ఈ విధంగా బాగుచేసి కష్టపడి చేసుకున్నటువంటి భూమిని ప్రభుత్వం ప్రత్యేకంగా lease కు యిచ్చేటప్పుడు కనీసం ఆ lease కు అయినాకూడా ఆ పేదరైతులకు వ్యవసాయ కూలీలకు యివ్వకుండా భూస్వాములకు యివ్వడంవల్ల వందలాది పేదరైతులకు అన్యాయం జరుగుతున్నది. ఈ విషయం చర్చించేటప్పుడు పార్టీ భేదాలు పాటించనవసరంలేదు. ఇటువంటి విషయాలు అందరూకలిసి పరిష్కరించవలసివుంటుంది, ఈ రోజు బంజరుభూములను పేదలకు యీయవద్దనే వారెవరూలేరు. కొంతమంది project area లోని బంజర్లను అమ్మితే అమితలాభం వస్తుందంటున్నారు. ఇది సరైనకారణం కాదు. పెద్ద రైతులే, మంచిభూమిగల రైతులే, సాగుకు వీలైన వసతులివ్వాలి, bull dozers కావాలంటున్నారు. Project area కాని కొవ్వూరు తాలూకాలో ఆపవలసిన పనేమి వచ్చింది? అటువంటిచోట్ల బంజర్లను అమ్మితే కొనేవారుంటారా? కృష్ణా జిల్లాలో ఆపవలసిన పనేమొచ్చింది? గోదావరి జిల్లాలో ఆపవలసిన పనేమొచ్చింది? ఇదివరకు అనాధీనపు భూములకు పట్టాలు యివ్వడానికి ప్రభుత్వం కొంత కార్యక్రమం నడిపింది. కాని యిపుడు కొత్తగా project area లో ఆపుతున్నారు. ఈ సమస్యను సరిగా పరిష్కరించకుండా ఏదో యిక్కడ రాజకీయ బాధితులకని ఒకరి దగ్గర, project area అని ఒకరి దగ్గర, యింకోచోట యింకో కారణంతోను యీ విధంగా శివాయి జమాదార్లకు భూములు లేకుండా చేస్తున్నారు. ఆఫీసుకుపోయి అడిగితే కాంగ్రెసు సెక్రటరీవద్దనుండి జాబు వచ్చింది, యీభూములు శివాయి జమాదార్లు సాగుచేయడానికి వీలులేదు అని P. W. D. office లోను, Revenue Office లోను చెబుతున్నారు. ఈవిధంగా స్థానిక ప్రయోజనాలకు లొంగి, ప్రభుత్వం సరైనటువంటివైఖరి తీసుకోనందువల్ల యీవిధమైన గందరగోళం ఏర్పడింది. గుంటూరులో యీ బంజర్ల విషయంలో ఒక పెద్ద మహాసభ జరిపారు. ఈ సమస్య ఎంత ఆందోళనకరంగా వున్నదో తెలియజేస్తూ తీర్మానంచేసి ప్రభుత్వానికి పంపించారు. కొవ్వూరులో యీ బంజరుభూమి సమస్యమీద సభ జరిపినపుడు వేయిమందికి పైగా అప్పటికప్పుడు తహసీల్దారు దగ్గరకు వచ్చారు. ఈ విధంగా రైతులు బలపరుస్తున్నారు. మా తాలూకాలో తరుణవాయి చెరువు abandon చేశారు. వేగూరుచెరువు abandon చేయమన్నారు. 4, 5 వందలమంది గ్రామాలలో సాగుచేస్తున్నారు. వాళ్లందరికి eviction notices జారీచేశారు. ఈవిధంగా ఇవ్వడంవల్ల కొన్నివేలమందికి నష్టం జరుగుతున్నది. మీరు భూసంస్కరణలు తెస్తాం అంటున్నారు. కాని ఈలోగా eviction notices ఆపండి, పైరులు వశపరచుకోడం ఆపండి Penalty లు వేయండి ఆపండి అని కోరుకున్నాం. సెంటో కుంటో సాగుచేసుకునేవారిమీద 20, 30 రెట్లు penalty లు వేస్తున్నారు. ఈవిధంగా penalty లు వేయడం మంచిదికాదని ప్రభుత్వ పక్షంవారు

కూడా చెప్పారు. Penalty లు త్రోసివేయమని వంగల కోదండరామ రెడ్డిగారు కలెక్టరుతో చెప్పారు. పనులులేని యీ కార్తికమాసం రోజులలో penaltyలు వేస్తే రైతులకు కష్టంగావుంటుంది. కాబట్టి eviction notices యివ్వడం మానండి. తక్షణం, eviction notices, పైరులు పెళపర్చుకోడం మానండి. పట్టాలుయిచ్చే కార్యక్రమం నెమ్మదిగా చూడవచ్చు. రాజకీయ బాధితులకు భూములు యీయ దలచుకున్నా యిదివరకు సాగుచేస్తున్న భూములు ముట్టుకోరాదన్నదాంట్లో అభిప్రాయభేధం ఉండదనుకొంటున్నాను. మిగాతా సభ్యులు వారి అభిప్రాయాలను చెప్పాలని కోరుతూ యీ తీర్మానాన్ని బలపరుస్తూ శెలవు తీసుకుంటున్నాను.

SRI P. SUNDARAYYA: I second the resolution.

MR. SPEAKER: Motion moved:

"This Assembly recommends to the Government that all kinds of Banjar or Poramboke Government lands may be given free to all the landless poor and poor ryots.

SRI D. KONDAIAH CHOWDARY:—అధ్యక్షా, బిల్లు ప్రతిపాదనకు శంకరయ్యగారియొక్క హృదయములోవున్న అభిప్రాయముతో ఏకీభవించవచ్చును. అయితే తీర్మానములో చెప్పిన పారము చదివితే పూర్తిగా ఏకీభవించడానికి వీలులేదు. బంజరు పోరంబోకులు ప్రతిగ్రామంలో వున్నవి. ఈ బంజర్లు ఇచ్చేవిషయము స్వల్పమైనది కాదని వారికితెలియదు. కాంగ్రెసు ప్రభుత్వం అధికారములోనికి వచ్చిన తరువాత ఎన్నోవేల ఎకరాలు పేదవారికి ఇచ్చింది. ఈరోజున బంజర్లను పంచాలనడం గ్రామాలకు ప్రభుత్వం యింతవరకు ఏమీ చెయ్యనట్లు శంకరయ్యగారి తీర్మానంవల్ల ప్రజలకు తెలియడానికి ఈ తీర్మానము తీసుకొనిరావడము జరిగిందని స్పష్టముగా ఉంది. ప్రభుత్వం చేసినదానికి నాయకత్వం వహించినట్లు ఉన్నది. ప్రభుత్వం చేస్తున్నదానికి దోహదముఇచ్చే పనిచేస్తే బాగుంటుంది. ప్రభుత్వం ఏమో గుడ్డిగా చేస్తున్నట్లు వారిద్వారా పెద్ద reform పెట్టబోతూవున్నట్లు చెబుతున్నట్లు వుంది. ఈ తీర్మానములో పనిలేదు. బంజర్లు పంచేవిషయములో భేధాభిప్రాయాలు ఇదివరకునుంచీ ఉన్నవే. గ్రామాలలో అన్నిబంజర్లను పోరంబోకులను పంచిపెట్టడానికి ఈ ప్రభుత్వం సిద్ధముగాలేదు. నాకు తెలిసినంతవరకు మా తాలూకాలో మోపాడులో బంజర్లను పోరంబోకులను కొన్నింటిని పేదవారికి ఇవ్వడం జరిగింది. ప్రభుత్వం చేస్తున్నపనికి మనమందరము సహాయము చేయవలయును. ఈతీర్మానానికి ఆస్కారము లేదుఅని మనవిచేస్తున్నాను. ఈతీర్మానములో అన్ని పోరంబోకులను పంచాలని తెలుస్తున్నది. All porambokes and banjars

అని అన్నారు. గ్రామాలలో గ్రామనత్తం పోరంబోకు, స్మశానం పోరంబోకు, cattle stand poramboke, tank bed poramboke, వీటన్నింటిని పేద వారికి పంచాలన్నారు. వారిమీద సానుభూతి అందరికివున్నది. అయితే యీ పోరంబోకులు ఏఉద్దేశముతో ఏర్పాటుచెయ్యబడ్డవో గమనించకుండా sweaping గా చట్టం చెయ్యాలనడం న్యాయంకాదు. కొంతమందికి బదులు గ్రామానికంతకుకలిగే లాభములను గమనించక పోవడము విచారకరమైన విషయము. ఈవిధముగా శాసనము చేస్తే గ్రామాలలో చచ్చిన వారినిదహనంచెయ్యడానికి స్మశానాలుకూడఉండవు. చెరువులుఅంతకంటె ఉండవు. 20 సంవత్సరాలక్రింద చెరువులు పుట్టినవి. Tank bed లు నీరువల్ల వచ్చే silt ను clear చెయ్యడానికి ఏర్పాటు చెయ్యబడ్డాయి. Tank bed lands దున్ని వేస్తే భూమిలో వచ్చిన సిల్టును తీసి వెయ్యడానికి మార్గము ఉండదు. కొన్ని వేల కుటుంబాల రైతులు చాలా ఇబ్బందులు పడవలసి వస్తుంది. కొన్ని వేలమంది రైతులు నష్టపడవలసి వస్తుంది. ధాన్యం ఉత్పత్తి తగ్గవచ్చును. ఆర్థిక శాస్త్రం తెలిసినట్లు సుందరయ్యగారు ఈ విధముగా చెప్పడం సబబుకాదు. ఎటువంటి పరిస్థితులలోను గ్రామనత్తం పోరంబోకులను బీదలకు పంచి పెట్టడానికి వీలు లేదు. గ్రామం శుభ్రముగా ఉండవలెను అంటే, పిల్లలకు పార్కులు, స్కూళ్లకు స్థలములు కావలెను. గ్రామాభ్యుదయానికి, గ్రామాలు పరిశుభ్రముగా ఉండడానికి గ్రామాలు అందంగా ఉండడానికి ఇవి అవసరము. ఈ విషయములో జాగ్రత్తగా ఉండవలెను. All porambokes అని అనడం న్యాయం కాదు. అన్ని పోరంబోకులు ఇవ్వమనడం న్యాయంకాదు. గ్రామంలో ఉన్న పశువులన్నీపోయి cattle stand poramboke లో ఉండడం ఆచారం ఉన్నది. గ్రామాలలో, మాగాణీ గ్రామాలలో నాట్లు తరువాత ఈ cattle stand పోరంబోకులు లేకపోతే పశువులు నిలవడానికికూడా జాగా ఉండదు. అన్ని పోరంబోకులు ఇవ్వమని చెప్పడం న్యాయంకాదు. ప్రభుత్వానికి, ప్రజలకు, సంఘానికి, గ్రామానికి ఇబ్బందిలేని పోరంబోకులను convert అయినా చేసి ఇవ్వవచ్చును. యీాక ఉమ్మడి న్యాయముగా తీర్మానించడము శోచనీయము. అన్నింటికి పట్టాలు ఇవ్వడానికి అవకాశంలేదు. ఇదిక్రొత్త సిద్ధాంతముకాదు. ప్రభుత్వము అనుసరిస్తున్న సిద్ధాంతమే. ఇది అనవసరకాలయాపన. త్వరలో ఈ సమస్య పరిష్కారము కాబోతున్నది. ప్రభుత్వము అనుసరిస్తున్న విధానము 100 కి 200 పాళ్లు వారు చెప్పినదే కాబట్టి వారు ప్రభుత్వానికి సహాయముచేసి అది సఫలీకృతము అయ్యేటట్లు చెయ్యవలెనని, ఈ తీర్మానము ఉపసంహరించుకోవాలని నేను కోరుచున్నాను.

SRI M. NAGI REDDI :—అధ్యక్షా! ఇపుడు కొండయ్య చౌదరిగారు కొన్ని ఆక్షేపణీయములైన విషయములను చెప్పారు. స్మశానాలనుకూడా [illegible]గా

లేదంటున్నారు. రాజకీయ బాధితులకు ఇవ్వవలెనా ? హరిజనులకు ఇవ్వవలెనా ? మేము చెప్పేది కూడ అదే.

SRI D. KONDIAH CHOWDARY :—హరిజన బాధితులకే ముందు ఇవ్వాలి.

SRI G. SURYANARAYANA :-అధ్యక్షా, బంజరు భూములు ఇస్తామని ప్రభుత్వంవారు పదే పదే ప్రకటన చేశారు. పోతే ప్రకటనలు తప్పితే బంజరు భూములు ఇచ్చే విధానం ఈనాడు దేశంలో జరుగకుండా ఉంది. బంజరులని, పోరంబోకులని ఉన్నాయి. విజయనగరం ఎస్టేటులో ఎక్కువ ఉన్నాయి. ఈ పోరంబోకు బంజరులు వేలంవేస్తున్నాంగాని ఉచితంగా మాత్రం ఇవ్వడానికి వీలులేదు. ఇది ప్రభుత్వం నిర్ణయం చేసింది. వేలంవేయమని చెప్పుతున్నారు. అదే కాదు. Estate లోనే కాదు. ప్రాజెక్టు క్రింద ఉండవలసిన బంజరు భూములలో కూడ వేలం విధానం అనేది ప్రభుత్వం ఆలోచిస్తుంది. కేవలం ఈ వేలం మార్గాన్ని పేద ప్రజానీకం మాత్రం అనుమతించదని నా ఉద్దేశం. అయితే ఈ బంజరు భూములు ఎవరికి లభిస్తున్నాయి ? మామూలుగా ఇదివరకు వేలకొలది భూములు ఉన్నవారికే. వేలంలో కొనడానికి అవకాశం ఉంటుంది గాని పేద ప్రజానీకానికి ఎంతమాత్రం సావకాశంలేదని నేను ప్రభుత్వానికి తెలియపరుస్తూ ఉన్నాను. ఇకపోతే బంజరు భూములు ఇచ్చే విధానం 1947 సంవత్సరం Estates abolish అయిన లగాయితు ప్రతి గ్రామంలో వుండవలసిన బంజరు భూములు, అన్నికూడా వందలకొలది ఎకరాలు, భూములు కలవారే encroach చేస్తున్నారు. ఈ encroachment ఈనాడు మామూలుగా, అక్కడ స్థానిక ఉద్యోగులు ఆయొక్క భూకామందుల తరపున పనిచేస్తూ ఉన్నారు. కాని, అనధికారంగా encroachment చేస్తున్నారు. ఇదిచాల అన్యాయం అని చెప్పేది. మాబోటివారు చెప్పినా గాని, estate అధికారులు మాత్రము మేము ఏమి చేయాలి ? పేద ప్రజానీకానికి అని ప్రభుత్వం నిర్ణయం చేయలేదు. అంటే గ్రామాలలో ఉండే పేద ప్రజానీకానికి అందరికి ఇవ్వాల అన్నారు. కాని ఇక్కడ భూకామందులు చేస్తున్న ఆఘాయిత్యాలు ఏమంటే ఇక్కడ రెండువందల మూడు వందల ఎకరములు భూమిగల వాండ్లు ఆ ప్రక్కన ఉండే ఒక పేద కుటుంబం ద్వారా application పెట్టించడం, అది వాండ్ల తరపున చేయించడం, అది మామూలు మేరకు తిరిగి అయిదో, పదో ఇచ్చి మరల ఈ భూకామందులే ఆక్రమించు కొనడం నేను చూచిన చోట్లల్లా జరుగు తున్నది. పేద ప్రజానీకానికి భూములు ఇస్తానని ప్రత్యేకంగా ఇంతవరకు ఈభూమి

ఇస్తున్నాము అని నిర్ణయం చేయవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది. ఇది కాకుండా, హరిజనులకు బంజరు భూములు తప్పకుండా ఇస్తున్నామని అంటే, కొన్ని వేల ఎకరములు మాత్రం లభించినవి. హరిజనులకు పురోభివృద్ధి పూర్తిగ వెళ్ళబుచ్చింది దేశంలో అని పదే పదే చెప్పుతున్నారు. ఇందుకు నేను చాల విచారిస్తున్నాను. ఈనాడు విజయనగరం estate లో నాకు తెలిసినంత మటుకు ప్రతి గ్రామంలో కూడా బంజర్లు అన్నిటికికూడా ఆయా ప్రాంతములలో ఉన్న హరిజనులు దరఖాస్తులు పెట్టుకొని ఉన్నారు. కాని దరఖాస్తులు మాత్రం తీసుకున్నారు. ఎస్టేటు అధికారులు ఎంత మాత్రం action తీసుకోకుండా దరఖాస్తులన్నీ క్రింద తొక్కివేసి భూస్వాములకు support ఇస్తున్నారేగాని, ఇక్కడ పేద ప్రజానీకానికి, ఎంత మాత్రం సహకారం ఇవ్వలేదు అని నాకు పూర్తిగ తెలుసును. అందుచేత ప్రత్యేకంగా హరిజనులకు బంజరు భూములు ఇస్తామని చెప్పినప్పుడు దానికి ఇంతవరకు హరిజనులకుముందు ఇవ్వాలని ఒక నిర్ణయం చేయాలిగాని 1947 వ సంవత్సరంనుండి అనధికారంగా అనేక బంజరు భూములు వేలం వేయడం మూలంగా, ప్రతి గ్రామంలో ఆక్రమణచేసి ఉన్నారు. అనధికారంగా వాండ్లు దున్నుతున్నారు. పోతే హరిజనులు బంజరు భూములకు దరఖాస్తులు పెట్టుకొన్నారు. అది ఇవ్వండయ్యా అని అడిగితే మామూలుగా పేదవారికి ఇస్తామని నిర్ణయం చేసింది. మీరుకూడ సహకారం ఇస్తారని నేను మీకు విజ్ఞప్తి చేస్తున్నాను. ఏమి చేయాలని మేము అడిగితే అది ప్రత్యేకంగా హరిజనులకు ఇవ్వాలనిలేదు, ప్రత్యేకం బీద ప్రజలకు ఇవ్వాలనిలేదు, అని అధికారులు చెప్పుతున్నారు. ఇది కేవలం అన్యాయం. ప్రతి గ్రామంలో ఉన్న బంజరు భూములు అన్నీకూడ ఎక్కువగ భూములు, డబ్బు ఉన్నవాళ్ళే అనుభవిస్తున్నారు. కాబట్టి అది కేవలం అన్యాయం. కాబట్టి చట్టరీత్యా 1947 సంవత్సరం లగాయితు అనధికారంగా దున్నవలసిన భూములన్నీకూడ తీసుకొని పేద ప్రజానీకానికి త్వరలో అందజేసి, పేద ప్రజల పురోభివృద్ధికి సహాయం చేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. పోతే project ల క్రింద ఉండవలసిన బంజరు భూములు ఉన్నాయి. నందికొండ ప్రాజెక్టుకు కొన్నివేల బంజరు భూములు ఉండవచ్చును. అవి కేవలం అక్కడ ఆ ప్రాంతములనుంచి వచ్చిన పేద ప్రజలకు ఇస్తామని చెప్పారు. పేద ప్రజలకు బంజరు భూములు ఉచితంగా ఇవ్వాలని శాసన సభ తీర్మానం చేసింది. అవి అన్ని తొక్కిపెట్టి ఈనాడు వేలంమూలంగా ప్రభుత్వం తీసుకోవస్తుంది. అందుకు నేను చాల విచారిస్తున్నాను. దీని మూలాన మామూలు పేద ప్రజానీకం దేశంలో చాలా అడుగంటి పోతున్నది. పేదప్రజలకు ఎంతమాత్రం ఉపకారం జరుగదు కాబట్టి ప్రభుత్వం దానిని మార్చాలి. వెంటనే రాబోయే సంవత్సరంఅంటే మామూలుగ మన విశాలాంధ్ర బహుశ మనం

Sri G. Suryanarayana] [1st December 1955

Hyderabad ఎల్లకముందే ఈ బంజరు సమస్య అనేది సక్రమంగా న్యాయంగా ప్రతిగ్రామంలో పేదప్రజలకు అందేటట్లు ప్రభుత్వం ఆలోచించవలసిందని, ఈ బంజరు భూములు ఇచ్చేవిధానం కేవలం అధికారులకే మాత్రం హక్కు లేకుండా ఉండవలెను. అట్లాగే ప్రతిజిల్లాలో ఒక M. L. A. స్థానికంగా ఇద్దరు ముగ్గురు రైతులను, తర్వాత దానికి సంబంధించిన అధికారులను కొంతమందిని ఆ కమిటిలో వేసి, ఆయా జిల్లాలలో ఆ కమిటీలు తిరిగి ప్రతియొక్క గ్రామంలో బంజరు సమస్యను పరిశీలించి న్యాయముగా చట్టరీత్యా, ఆ బంజరుభూములను ఇచ్చే విషయంలో అన్యాయం జరుగ కుండా పేదప్రజలకు ఇస్తారని ఆశిస్తూ నేను ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ సెలవుతీసు కొంటూ ఉన్నాను.

Sri B. RATHNASABHAPATHI :—అధ్యక్షా, బంజరు భూములు, పేదవాండ్లకు పంపకం చేయాలని చట్టంచేసి గత ప్రభుత్వం రైతులకు ఎట్లా సహాయం చేసిందన్నీ ప్రజలంతా అనుకోవడం మనం వింటూఉన్నాము. గాని మన ప్రభుత్వం ఇచ్చినటువంటి లెక్కల ప్రకారమే అట్లా పంపకం చేయలేక ఉన్నటువంటి భూమి సాగుకు వినియోగపడేటటువంటి భూమి, 35 లక్షల ఎకరములు ఆంధ్రదేశంలో ఉన్నాయని మొట్టమొదట లెక్కలు తెలియజేశారు. ఆ తరువాత మళ్ళీ గవర్నమెంటు లెక్కలు అందించడంలో, అందులో కొంత కొన్ని గ్రామోపయోగకరమైన అవస రాలకుగాని, మరి యితర అవసరాలకుగాని ఈ 35 లక్షల ఎకరాలున్నా distribute చేయడానికి అవకాశంలేదు. అందువల్ల ఇందులో 13 లక్షలక్షలు ఎకరములు మాత్రమే మనము పంచడానికి వీలుఅవుతుంది అని తెలియజేశారు, ఆ 13 లక్షల ఎకరాలలో కూడ ఇప్పటికి distribute చేసి మనకు అందిన రిపోర్టుల ప్రకారం 12, 13 వేల ఎక రాలు మాత్రమే distribute చేసినట్లు తెలుస్తున్నది. ఈ చట్టంచేసి సుమారు రెండు సంవత్సరాలుఅయినా చాల చురుకుగా అన్ని పార్టీలు ఈ పంపకంలో అధికారులకు తోడ్పడి పంపకాలు చేయడానికి దోహదంఅయినా ఇప్పటికి కేవలం 13, 12 వేల ఎకరములు మాత్రం పంపకంఅయింది. అంటే ఇది చాల శోచనీయంగాఉంది. దానికి కారణభూతులు ఎవరైనదికూడ ప్రభుత్వం పరిశీలించలేదు. అట్లు పరిశీలించి ఏమి action తీసుకొంటున్నదో తెలియచేస్తే బాగాఉంటుంది అని ఉద్దేశపడుతున్నాను. తర్వాత మిగతా 13 లక్షల ఎకరాలుపోతే ! మిగతా ఉన్నటువంటి భూమిఅంతా కూడ ఎందువల్ల పంపకానికి వీలుకాదో అనే విషయం మనం పరిశీలించినపుడు కొంత communal land గాని, గ్రామం మొత్తంమీద ఉపయోగపడుతుంది. అందు వల్ల అటువంటి భూములు సేద్యానికి ఇవ్వడానికి వీలులేదని తెలియచేస్తున్నారు. ఇక్కడ మాతాలుకాలోనే కొన్ని గ్రామాలు ఉన్నాయి. ఆ గ్రామాలలో కొంత పోరంబోకుఉంది. అందులో కొంతభాగం గ్రామము మొత్తానికి ఉపయోగపడే భూమి ఉండవచ్చును. గాని మిగతాభూమి ఇప్పటికే unauthorised గ [illegible]వ్యవ

సాయం చేసుకొంటూ ఉన్నారు. దానిపైన ఎక్కువగ penalty లు వేయటం జరుగుతున్నది. వాటిని assignment చేయమని కోరినపుడు ప్రభుత్వంవారు అవి పోరంబోకులు, సముదాయానికి సంబంధించినవి కనుక వాటిని ఇవ్వటానికి వీలులేదు అని చెప్పతున్నారు. అటువంటి చట్టంలో ఉండేటటువంటి లోపము ఒక ప్రక్కన unauthorised వ్యవసాయానికి permission ఇస్తూ వాండ్లదగ్గర పెనాలిటీలు వసూలుచేస్తూ, ఇంకొకప్రక్క దానిని assignment చేయడానికి తీలులేదనటంలో anomaly కనిపిస్తుంది. గనుక ఈ బంజరు భూముల చట్టాన్ని కొంతవరకు amend చేసి దానిని అమలుపెట్టితే బాగా ఉంటుందని నేను సలహా ఇస్తున్నాను.

ఒకప్రక్క unauthorised వ్యవసాయం చేసుకోడానికి permission ఇస్తూ వాళ్లదగ్గర penalty వసూలుచేస్తూ ఇంకొకప్రక్క దీనిని assignment చేయడానికి వీలుకాదు అనడంలో ఒక anomaly కన్పిస్తుంది. కనుక బంజర్ల చట్టాన్ని అదివరకు amend చేసి అమలులోపెడితే బాగుంటుందని నేను సలహా యిస్తున్నాను. నిన్ననే ఒకప్రశ్నలో సమాధానంచెబుతూ కొంత పోరంబోకు భూమినుంచి assignment ఇవ్వడం లేకపోయింది. అందులో కొంతమాత్రం ఒక వ్యక్తికి ఇచ్చారనికూడా మంత్రిగారు తెలియజేశారు. ఇటువంటివి చాలాఉన్నాయి. వాటన్నింటిని గమనించి సరిదిద్దితే బాగుంటుందని వారికి తెలియజేస్తున్నాను. తరువాత unreserved forest ఉన్నది. వాటిలో చాలామటుకు చెట్లులేకుండా వుండడం అక్కడ పోరంబోకులులాగానే ఇక్కడకూడా unauthorised గా వ్యవసాయంచేయడం దానివల్ల రైతులకు ఎక్కువగానష్టపడడం జరుగుతోంది. ప్రతిసంవత్సరము కంటె ఈ సంవత్సరం మా తాలూకాలో ఎక్కువగా complaint చేయడం జరిగింది. ప్రతిసంవత్సరం పదివేస్తే ఈ సంవత్సరానికి ఎకరానికి 20 గాని 25 గాని వేయడం జరిగింది. ఈ విధంగా చాలా complaints వచ్చినాయి. అదికూడా సర్దటం చాలాఅవసరమని వారికి తెలియజేస్తున్నాను. Unreserved waste లో కూడా unreserved waste లాగానే చాలామంది వ్యవసాయము చేసుకొంటున్నారు. అది సర్వేకాలేదు. అందువల్ల సర్వే చేసినంతవరకు అది మేము assignment కు ఇవ్వడంలేదని ఒక objection చెపుతున్నారు. వాటికి సర్వే fees కట్టి రశీదులు పొందినగాని సంవత్సరాలకొద్ది సర్వే చేయడానికి అవకాశంలేక, staff లేక ఆలాగే మిగతా ఎన్నెన్నో ఇబ్బందులవల్ల వాళ్లుచేస్తున్నారు. అంతే కాకుండా ప్రత్యేకించి మా తాలూకాలో ఈ సమస్య వచ్చింది. ఈ December ఆఖరున బంజరు భూములకు ప్రత్యేకమైనటువంటి staffను, Deputy Tahsildarను వాళ్లను abolish చేసి regular department కు ఇవ్వాలని అంటే, ఇంతటితో బంజరుసమస్య తెగిపోయింది అన్నమాట. ఈ తాలూకాలో అవసరంలేదనే ఉద్దే

శ్యంతో abolish చేయాలనే ఉద్దేశపడినట్లు తెలుస్తున్నది. దానివల్ల యిప్పటికి ఉన్నటువంటి application లు, దానిపైన action తీసుకోక పోవడం రాబోయే application లకు అసలే అవకాశం ఉండదని చాలా భయోత్పాతం కలిగింది. అందువల్ల యిప్పటికిమాత్రం తహసిల్దారువాళ్లు రిపోర్టు చేసినట్లుకూడా నాకు తెలిసినది. దానికి dapartment abolish చేయనట్టి ఈ పోరంబోకులు గ్రామాలలో ఉపయోగపడుతున్నటువంటి పోరంబోకులు మినహా యిప్పుడు వ్యవసాయం చేసుకుంటున్నటువంటి penalty కట్టేటటువంటి పోరంబోకులు unreserved forest unreserved waste చేసుకుంటున్నటువంటి వన్నీకూడా వాళ్లకు assignment అయినంతవరకు పట్టాలు వచ్చినంతవరకు రైతులకు హక్కు కలిగినంతవరకు యీ department వేయడం మంచిదని సలహాయిస్తున్నాను. అంతేకాకుండా ఇప్పుడు కొండయ్యగారు మాట్లాడుతూ ఇదికేవలం ప్రచారంకొరకు అని వారు తీర్మానం ప్రతిపాదించినటువంటి శంకరయ్యగారు అన్నారు. ఇది నిజంగా ప్రచారంకొరకు అయితే అనుకోండి. ప్రతిపక్షపార్టీలకు ప్రచారం అవసరం గనుక చేసినారుఅనుకోవచ్చు. మన ప్రభుత్వపక్షమే ఇటువంటి చట్టాన్ని తీసుకువచ్చి చేసివుంటే ఇందుట్లో ప్రచారం ఏమీవుండదు కనుక అటువంటివి ఎందుకు చేయకూడదని వారిని ప్రశ్నవేస్తున్నాను. అటువంటిది చేయాలని ప్రతిపక్షంవారు సలహా యిచ్చినప్పుడల్లా ప్రతివిషయంలోను ప్రశ్నల విషయంలోనేమి చట్టాలవిషయం మాట్లాడేటప్పుడేమి ప్రతిదికూడా ప్రతిపక్షంవారిపై నేరంమోపి ప్రచారంకొరకు చేశారనడం చాలా పొరపాటేమోనని నేను వారికి మనవిచేస్తున్నాను. కనుక ప్రభుత్వపక్షమే ఇటువంటి మంచి మంచి చట్టాలన్నీ, తీర్మానాలను వాళ్ళే ప్రతిపాదించి తయారు చేసినపుడు ఏమీ ఉండదు కనుక అటువంటిది చెయ్యనపుడు ప్రతిపక్షం చేయక తప్పిందికాదు. కనుక చేసినారు గాని కేవలం ప్రచారంకొరకు రాజకీయాలలో ఉన్నారన్నమాట శుద్ధ అబద్ధము. వాళ్లు కేవలం తప్పుడు ప్రచారంకొరకు ఈ విధంగా ప్రతిపక్షాల మీద నెపం మోపుతున్నారని వారికి తెలియజేస్తూ యీ ప్రతిపాదనను నేను బలపరుస్తున్నాను.

Sri T. V. RAGHAVULU :—అధ్యక్షా, ఈనాడు తెచ్చినటువంటి ప్రతిపాదనమీద ఇప్పటికి సుదీర్ఘమైన చర్చజరిగింది. అందులో బంజర్లు పోరంబోకులు వీటికి ఉండేటటువంటి పరిస్థితులు వీటిలో ఉండేటటువంటి తరహాలు ఇవన్నీకూడ సవిస్తరంగా సభ్యులుచెప్పారు. అయితే నేను చెప్పవలసినది మాత్రము ఒకవిషయం ఉంది. బంజర్లు, ఇవ్వదగినటువంటి బంజర్లు అందులో ఉచితంగా ప్రతివారికి ఇవ్వాలనేటటువంటి విషయంలో ప్రభుత్వం ఒక ఖచ్చితమైనటువంటి ఒక నిర్ణయం చేసుకొనిఉంది. ఈ నిర్ణయాన్ని ఇదివరకు G. O. రూపంగాకూడా అవి ప్రకటనచేసి

ఉన్నది. G. O. అనుసరించి ఇప్పటివరకుకూడా ఇవ్వతగినటువంటి బంజర్లు అంటే శిస్తుకట్టినటువంటి గైరుభూములు వగైరాలు లేదా సాముదాయక ప్రయోజనాలకు అడ్డుతగులునటువంటి బంజర్లు, ఇటువంటివన్నీ కూడా ఇవ్వడానికి తగినటువంటి చర్య తీసుకోవడానికి ప్రత్యేకమైనటువంటి సిబ్బందికూడా ఇప్పటివరకుకూడా పనిచేయడం అన్నది సభ్యులకు తెలిసినటువంటి విషయం. ఇక పెనాల్టి కట్టడంవిషయంలో ఇద్దరు ముగ్గురు సభ్యులు చాలా గట్టిగా చెప్పిఉన్నారు. ఆ విషయంలో ఒకటి మనవి చేయాలి. Penalty అంటేనే హక్కులేకుండా ఆక్షేపణకరమైనటువంటి భూమిని నువ్వు ఆక్రమించిచేస్తున్నావు అని Notice ఇవ్వడం, ఇచ్చిన తరువాత తొలగక పోయినా కారణాల బాధకలిగి తొలగిపోతాడుఅనే ఉద్దేశ్యంపై penalty వేస్తున్నారు. Penalty విధించడంలో విధించమని Board Standing Orders కోరడంలో ఉద్దేశ్యం అది. ఇందులో పంటపండేది ఎంత? వీడు పెనాల్టి ఇవ్వగలడాలేదా అన్నదికాదు సమస్య. దానిప్రధాన ఉద్దేశ్యం, Penalty వేయడంలో ఉద్దేశ్యం ఇది. అందుచేతను Board Standing Orders చెప్పినంత మేరకు ఆ సందర్భంలో ఆజమాయిషీ Officers objectionable అని చెప్పినటువంటి పోరంబోకులు ఆక్రమించినవారికి ఈ Penalty వేయడం అనేది ఒక విధానం, ఇది తప్పేదికాదు. అందుచేత objectionab'e పోరంబోకు ఆక్రమించేవారు వీటిని కట్టుకోవడం మంచది. ఎందుచేతనంటే, పట్టాలమీద ఇవ్వడానికి ఎప్పుడూకూడా rules ఒప్పుకోవు గనుక అది లేకుండా మొండితనంగానే వీటిని ఆ విధంగానే continue చేస్తూఉండేవారు. Penalty వేయడం Penalty వేసారనేది' ఒక సాకుగా చెప్పుకోవడం లేదా జమాబందిరోజున 3/4 రు. Stamp మీద Petition పెట్టడం, క్లెయిమించడం అదేపద్ధతిమీద మనం చేసుకుంటూవచ్చాము. 1942 లో నిజంగా యుద్ధం time లో ఆహారక్లిష్ట పరిస్థితులలో ఇది ఒక ఆపద్ధర్మంక్రింద ఎక్కడభూములున్నా సరే ఆహారం పండించండి అన్నాము. నిజంగా యుద్ధం timeలో పోలెండులో కుక్కమాంసం తిన్నరోజులున్నాయి. ఇటువంటి పరిస్థితులలో సాముదాయక ప్రయోజనం అని శ్మశానవాటికని అది అని, ఇది అని, అనుకుంటూ చెయ్యండి అన్నారు. అయితే ఆహారపరిస్థితులు ఇపుడు కొంతవరకు బాగుపడ్డాయి. లేదా కేవలం ఈ బంజర్లుఅనే విచక్షణలేకుండా బంజర్లు ఇచ్చినంతమాత్రంచేత పేద వారందరికీ కూడా వెళ్లదు. మా హోసూరు గురించి చెప్పుతున్నాను. ఎవరికి ఏ మాత్రమైన ఉపకారం జరిగితేమాత్రం మనమందరం ఈ పీడిత ప్రజానీకానికి సేవచేయాలనే ఉద్దేశ్యంతో ఈ బిల్లు ప్రతిపాదించిన వారంతాకూడా గట్టిగా చెప్పవచ్చు. గ్రామంలోఉండే బంజర్లు అవి ఎంతమందికి ఇవ్వగలము? వీనివల్ల కేవలం ఇచ్చినపుడు ఇది ఎంతవరకు ఎవరికి సరిపోతుంది అన్నసంగతికూడా మాట్లాడేవారం

Sri T. V. Raghavulu] [1st December 1955

దరికికూడా ఎరగనటువంటి విషయం కాదు. నేను పుట్టి పెరిగినటువంటి గ్రామంలో $6\frac{1}{2}$ ఎకరాల బంజర్లు ఉన్నాయి. అది ఇద్దరు ఉపయోగించుకొంటూనే ఉన్నారు. అందులో ఒకటి శిస్తుకట్టిన సైరుభూములు. దానికేమో permanent assignment proposals పెట్టుకొన్నారు. అవి నడుస్తున్నాయి. ఇక రెండవది కాలువకు సంబంధించినటువంటి P. W. D. పోరంబోకులు, ఇవి గనుక ఆక్రమించినట్లయితే గట్లు తెగిపోయినప్పుడల్లా మట్టి తీసుకవచ్చి గట్టు పూడ్చుకోవాలి. రైతు భూమి త్రవ్వినట్లయితే అతనికి నష్టపరిహారం ఇవ్వాలి. ఆ దృష్టితో కొద్దిగా భూమి మినహాయించారు. ఏదో ఆపద్ధర్మంక్రింద దున్నుకొంటున్నారు. పండించుకొంటు న్నారు. Government ఏమీ ఇబ్బంది చేయలేదు. అది అంతా ప్రోగుచేస్తే $1\frac{1}{2}$ ఎకరం. ఇవి ఇచ్చినందువల్ల అతని దరిద్రంతీరదు సరికదా, దేశానికి ఏ మాత్రం కలిసివస్తుందో అదికూడా మనం ఆలోచించాలి. ఈ Penalty విషయంలో Government officers అభ్యంతరం అనిచెప్పి వారి అడంగులలో remarks వ్రాసి వాటిమీద ఆధారపడి జమాబంది officers penalty వేస్తున్నారు. దానిని గురించి మనం పెద్దగా విమర్శించడంలో కలిసివచ్చేదేమిలేదు. ప్రభుత్వంవారు ఒక నిర్ణయానికి కట్టుబడి ఇవ్వతగినటువంటి బంజర్లు ఇస్తున్నారు. వీరు ఇటువంటి తీర్మానం పెట్టడం అనేది ప్రచారాత్మకానికి ప్రచారసాధనకు అనిఅంటే వారికి పాపం కొంతమందికి బాధగావుంది. అందుచేత నేను మళ్ళీ చెప్పాను. గాని ఇప్పుడు చేస్తున్నపనినిగురించి పదేపదే ఇవి బంజరుసమస్య అని "రోజులు మారాయి" సినిమాతీశాడు కోరియన్. అట్లాగే మనంకూడా శాసనసభలో ఒక క్రొత్తసమస్యను గోరంతలు కొండంతలుచేసి పదేపదే ప్రయోగంచేసి గంట గంటన్నరసేపు మహోప న్యాసం చేయడం అవసరమేమో నాకు తెలియదు కాని ఇది విరమించుకోవడం ఉత్తమంఅని చెప్పుతూ యిప్పుడు కాంగ్రెసువారు ఆర్థికాభివృద్ధికికూడా condition grants వేలాది ఎకరాలకు ఇచ్చినటువంటి record ఉన్నది. అందుచేత దానినిగురించికూడా మనం పదేపదే తీర్మానం పెట్టవలసిన అవసరం లేదని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, ఇప్పుడు మన శంకరయ్యగారు తెచ్చిన దానినిగురించి కొద్దిగా నేను మాట్లాడదలచుకొన్నాను. వారు పెట్టే దానిలో అవి బంజర్లు అనిచెప్పి పెట్టేశారు. గ్రామానికి ఎంతవరకు బంజరుఉంది? పశుపోషణకు ఎంతవరకు ఉన్నది? శ్మశానాలకు ఎంతవరకు ఉన్నది? ముందు ఈ 3 points ముఖ్యంగా చూసుకోవాలి. కారణం ఏమిటంటే గ్రామాలలో ఉన్నటువంటి శ్మశానాలు ఇప్పుడు బంజరుభూములని అంటే government ఇస్తారని లోకమంతటాకూడా ఎక్కడలేని బంజరుభూములు ఇచ్చేస్తున్నారు. దున్నుకోవచ్చు అని

లోకమంతటా ఒకవాడుక ఉంది. వాటినిబట్టి ఎక్కడలేని స్మశానాలు, రహదార్లు మనుష్యులు వెళ్ళేదానికి దారులు కాదు. పశువులువెళ్లే దారికాదు. ఈ భూములను ఎక్కడికక్కడ దున్నివేయడం జరుగుతోంది. గాని అసలు ప్రజలు ఎంతయిబ్బంది పడుతున్నారు దానివల్ల ఎంతవరకు నష్టంవస్తోంది అనేయోచన ఎంతమాత్రంకూడా వారు యోచించలేరు.

ఎక్కడో కొద్దిగా బంజరుఉంటే పేదవాళ్ళకు ఇవ్వకపోతే ఇంకెవరికిస్తారు? పేదవాళ్లకు భూములిచ్చేందుకోసం, రేపు ఒకబిల్లు రాబోతున్నది. ఉన్నభూములన్నీ పంచిపెడతామని భావేగారు ఒకప్రక్కన బయలుదేరుతున్నారు. వీరుకూడా తప్పకుండా ఆ భూములన్నీ పంచేసి లేనివారికి యిస్తామని బయలుదేరుతున్నారు. వందల కొలది ఎకరాలు తీసుకొని పేదప్రజలకు యివ్వవలసిందని చెప్పవచ్చు. తప్పకుండా యిచ్చేదానికి అందరు సిద్ధంగావున్నారు. కాని పాలుయిచ్చేటటువంటి పశువులు, వ్యవసాయానికి కావలసిన పశువులుకూడ నిలబడడానికి అవకాశములేకుండా యిప్పుడు చేస్తున్నారు. ప్రతివాళ్లు బంజర్లనిచెప్పి ఎక్కడపడితే అక్కడ దున్నివేయడం, దార్లుఅంతా దున్నివేయడం, అల్లర్లులేపడం జరుగుతున్నది. ఈమధ్యన మాతాలూకాలో కొన్నికొట్లాటలు జరిగాయి. పోలీసుకు రిపోర్టు చేయడంకూడ జరిగింది. ఇదంతా, ఈ పొరంబోకులు, బంజర్లు దున్నివేసిన కారణంచేతనే జరిగింది. కనుక ఆవిధంగా అన్నిభూములు ఇచ్చివేయడం అంటే సబబుగాదు. ఎక్కడైనా కొద్ది కొద్దిగాఉంటే, అది భాగ్యవంతులకు ఇచ్చిఉంటే, అయ్యా మీరు ఫలానా భూమి భాగ్యవంతులకు యిచ్చారు, ఆవిధంగా యివ్వడం సబబుకాదు, ఆ భాగ్యవంతునికి కాదు ఈ పేదవారికి యివ్వండి అని చెప్పవచ్చు. తహశీల్దార్లకు, కలెక్టరుకు, అక్కడ వున్నటువంటి వాళ్లకు చెప్పవచ్చు. ఆ పేదవాళ్లకు ఇవ్వమనిచెప్పి గవర్నమెంటుతో, మంత్రులతో మనం దెబ్బలాడి పేదవాళ్లకు యివ్వమని చెప్పడం సబబుగాదు. ఈ ఉన్నదియావత్తు గ్రామాలకు చుట్టుప్రక్కల నిలబడానికి స్థలంలేకుండా పశువులు ఉండడానికి స్థలం లేకుండా, చచ్చిపోయినవాళ్లను కాల్చడానికి స్థలం లేకుండా ఉన్న పొరంబోకు అంతా ఇచ్చివేయమనిచెప్పడం సబబుగాదని మనవిచేస్తున్నాను. ఈమధ్యన ఒకసినిమా తీసేఆయన చాలాభూమియిచ్చాడు అన్నారు. ఆయనంటే పెదలక్షాధికారి. రోజులు మారాయి అనే సినిమాతీసి లక్షలు సంపాదించాడు. కాని అందరు ఆ విధంగా ఇవ్వగలరా? కనుక ఏలాగైన భూసంస్కరణల బిల్లు వస్తున్నది. భావేగారు ఒకప్రక్కన బయలు దేరారు. పేదప్రజలకు పంచుతారు. కాని ఉన్నదంతా యివ్వడమనేది సబబుగాదు. కొంతమటుకు యివ్వమంటే సబబుగా ఉంటుంది. గవర్నమెంటు తాలూకు వేలకొలది ఎకరాలు బంజర్లు ఉన్నాయి. అటువంటప్పుడు గవరమెంటుభూమి యింతఉంది, ఇన్నివేల ఎకరాలు పేదవాళ్లకు యిస్తు

Sri P. Narasimhappa Rao] [1st December 1955

స్నాము, దానికితోడు మీరుకూడ 17 వందలో, 15 వందలో ఎకరాలు యీ పేద వాళ్ళకు ఇవ్వండని భూస్వాములకు చెప్పండి. ఈ పేదవాళ్ళకు భూములు కావాలని అంటున్నారు. Forests లో వందలకొలది ఎకరాలున్నాయి. మా పాలకొండ దగ్గర సీతంపేట గ్రామంలో వందలకొలది ఎకరాలు వున్నవి. పేదవారిని రమ్మని చెప్పండి యిస్తాము. కాని అక్కడికి వారు రారు. వారుఎక్కడుంటే అక్కడనే భూమికావాలి అంటారు. బయటపొలము యిస్తామంటే సాగుచేస్తామనేవారు కన్పించరు. అనంతగిరిలో కావలసినంత భూమియిస్తామని పిలవండి. ఒకరైనా అక్కడికి వస్తారేమో చూడండి. ఏఊరివారికి ఆవూరిలోనే భూములుకావాలి. ఈ ప్రకారంగా తీసుకోవాలని ఒకప్రక్క ప్రయత్నం చేస్తున్నారు. ఇంకొకప్రక్క ఉన్నది కూడ లేకుండా చేయడం సబబుకాదు. ఇప్పుడు గవర్నమెంటు వేలకొలది ఎకరాలుఉంటే వేలము వేస్తున్నారు. అటువంటిదాంట్లో కొంతభూమి యివ్వమంటే సబబుగాని, పశువులు నిలబడడానికికూడ స్థలంలేకుండా యివ్వమనేది సబబుకాదు. హెచ్చుగాఉంటే యివ్వమని చెప్పడం సబబుకాని, అంతా ఇవ్వవలసిందనేది సబబు కాదని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

SRI D. V. SUBBA RAO :—ఉపాధ్యక్షా, ప్రకాశం మంత్రివర్గంలో ఏకగ్రీవంగా ఆమోదింపబడిన విషయంగురించి మళ్ళీ యీవేళ యీ తీర్మానము పెట్టవలసిన అవసర మేమివచ్చిందనే దృష్ట్యా ఆలోచించకుండా కొండయ్య చౌదరిగారు మరికొంతమంది ప్రచార సాధనంకొరకు ప్రతిపక్షమువారు చేస్తున్నటువంటి విమర్శ యిదిఅని వ్యాఖ్యానంచేయడము చాలా శోచనీయము. అయితే ప్రతిపక్షమువారికి ఏ విషయములోను సదుద్దేశము ఉండదనా వారిఅభిప్రాయము? అయితే, క్రిందటి పర్యాయం దీనిని అందరు ఏకగ్రీవంగా ఆమోదిస్తే, ఎంతమంది పేదలకు బంజర్లు యిచ్చారు? పైగా యిచ్చారని వారు గట్టిగాచెప్పారు. మా జిల్లాలో నా నియోజక వర్గంలో నేను ఎరుగుదును. నా అనుభవములోని విషయము చెప్పుచున్నాను. Tank beds అనేది వేలము వేస్తారని చెప్పారు. దాదాపు 200 సంవత్సరాలనుంచి ఒక నీటిచుక్కయినా అక్కడలేదు. పెద్దాపురానికి రెండుమైళ్ళ దూరములో వడ్రమూరులో రామరాజు చెరువు అని ఉన్నది. అక్కడ దాదాపు 200 సంవత్సరాల నుంచి నీటిచుక్కయినాలేదు. దానిని హరిజనులు దున్నుకొంటే, ప్రక్కరైతుకు కూడ objection లేదు. అటువంటిది హరిజనులు దున్నుకొంటే, వారిని evict చేయవలసిందని, మెడబట్టి గెంటేయవలసిందని. రివిన్యూబోర్డు వారికి ఇవేళ orders వచ్చాయట. అది అన్యాయమంటారా కాదంటారా? పోనీ నిజంగా నీరు ఉన్నదైతే, అది silt-up చేసేసి ఏదో చేయవచ్చును. కాని అసలు నీరుచుక్క లేదు. లేదా దున్నివేసి, నీళ్లులేకుండాచేసి చెరువును పాడుచేశారంటే, వారిని evict

చేయవలసిందే. ఈచెరువు ఎప్పుడో, ఎవరో మహారాజులు చాలా ఉదారస్వభావముతో త్రవ్వించారేమో అనుకొంటాను. ఇప్పుడది నీరులేనిదై పోయింది. అటువంటిదికూడ ఈనాడువారు దున్నుకొనే దానికి వీలులేదని అడ్డుపెట్టి 1595 రూపాయల penalties వేశారు. హరిజనులు అది ఇచ్చుకోగలదని వేశారా! వాళ్ల కొంపలు, వాళ్లకున్న యావత్తూ అమ్మినప్పటికిని ఆ డబ్బు వస్తుందా ? అది పోనివ్వండి. బంజర్లు అయినా ఇస్తున్నారా అంటే మా అనుభవములో ఆవిధంగా కన్పించదు. శంకరయ్యగారు బంజర్లన్నీ ఇచ్చివేయండమంటే, స్మశానాలు, ఇస్తారా, సాముదాయక ప్రయోజనాలకు ఉపయోగపడే భూములిస్తారా అన్నారు. పోనీయండి. మిగతావేమైనా ఇచ్చారా? ఏదైనా ఒక భూమిని ఒక పేదవాడు దున్నితే, objection raise చేస్తారు. అది కూడ వెంటనే చెప్పరు. దున్నిన తరువాత, penalty కట్టిన తరువాత ఇది objectionable అని చెప్పుతారు. పోనీ, ఇది objectionable అనేటటువంటి list ఏదైనా ఉందా అంటే అటువంటిది లేనూలేదు. ఏది objectuable అనేది చెప్పరుగాని, ఏది దున్నతే దాన్ని objectionable అంటారు. మన వేదాంతములో భగవంతుని రుజావు చేయడానికి. నేతి, నేతి అని అంటే ఇదికాదు, ఇదికాదు అన్నది. కాదు అంటున్నా ఆఖరున ఆ ఉన్నదేదో మనకు తెలియదు. అవిధంగానే ఏది objectionable అంటేచెప్పరు. కాని ఏది దున్నితే దాన్ని objectionable అంటారు. అది విడిచి ఇంకొక భూమిదున్నితే మళ్లీ అది objectionable అంటారు. Unobjectionable అనేది ఏదో ఎవరు చెప్పరు. తహశీల్దారును అడిగిన, మరెవ్వరి నడిగినా గాని చెప్పరు. ఈవిధంగా వారికి చిక్కుపెట్టి అజ్ఞానంలోను, confusion లోనూ పారవేయడం జరుగుతున్నది. బంజర్లు అందరికి ఇచ్చి వేస్తామని ప్రభుత్వము అంటున్నారు. ఇచ్చివేస్తూ ఉంటే మళ్లీ ఈ తీర్మానం పెట్టడం, ఎందుకు వచ్చింది ? సిరిపురం అనే గ్రామంలో 4 వేల రూపాయలు హరిజనులమీద penalty వేశారు. ఆ కేసును నేను వకాల్తాపడేసి వాదిస్తున్నాను. ఆఖరుకు ఏమవుతుందో తెలియదు. నాకు fees ఏమి లేదనుకోండి. ఈవిధముగా బంజర్లు దున్నుకొనే వారిమీద వేలకొలది penalties వేసి పేదలకు ఇవ్వకుండానే పోతున్నదిగాని ప్రభుత్వము ఏదో ఇస్తున్నదని చెప్పడానికి, ఆచరణలో అటువంటిది ఎక్కడ కన్పించడంలేదు. పోనీ, ఈ బంజర్ల సమస్యను పరిష్కరించండయ్యా అంటే, దీనికి ఇంకొక ముడిపెడుతూ ఉంటారు కాంగ్రెస్ ప్రభుత్వము. సమగ్రమైన భూసంస్కరణల శాసనము ఒకటి భారతదేశము మొత్తంమీద అమలు జరపడానికి సిద్ధంగా ఉన్నాము, అందుచేత చిన్నచిన్న సమస్యలు, కౌలుదార్లకతుణి అనేది, బంజర్లు అనేది ఏమి పెట్టుకోకుండా ఏకంగా అన్నీ ఒకేసారి ఆలోచిస్తామని చెప్పుచున్నారు. అయితే ఈ భూసంస్కరణలు ఎప్పుడు వెడతారో తెలియకుండా

[illegible]

ఉంది. దీనికిగాను, మొట్టమొదట, రామస్వామిరెడ్డిగారి కమిటీ వచ్చింది. తరువాత సుబ్రహ్మణ్యం కమిటీ వచ్చింది. ఆ తరువాత, National Planning Committee వారు సూచనలు ఇచ్చారు. మరల Land Reforms Committee ఏదో వస్తుందని అంటున్నారు. ఈనాడు అనేక కమిటీలను వేస్తున్నారు. కలిగిన వాని కాలు తీసేటప్పటికి లేనివాని ప్రాణం లేచిపోయిందట. ఈలాగు కమిటీలని వంక పెట్టి ఎన్ని సంవత్సరాలు కాలయాపన చేస్తారో తెలియకుండా ఉంది. లేకపోతే, ఈ చిన్న సమస్యకు భూసంస్కరణలకు ఏమి సంబంధమున్నది? ఏదో భావేగారు భూములు పంచిపెట్టండమంటే, ఎంతమంది కాంగ్రెస్‌వారు ఇచ్చారో చెప్పండి చూస్తాం? అందు చేత, ఈ భూదానోద్యమానికి ప్రభుత్వము చేయూతనిచ్చి గట్టి support ఇవ్వాలని పూనుకోనిండా ? భూసంస్కరణలలో ఇది ఒక భాగము. Land hunger అన్నది ప్రపథమంగా తీరిస్తే తప్ప ప్రజలలో అశాంతి ఉంటూనే ఉంటుంది. Commission వచ్చేస్తుందని భావేగారు గట్టిగా చెప్పుతూఉంటే, మరి గాంధేయులందరు దానికి support ఇవ్వాలని అంటున్నారా ? అయితే బంజర్లు పంపకంకూడ అందులోనే ఒక భాగమని కమ్యూనిస్టులు చెప్పినప్పుడు, ఇది ప్రచారంకోసం అని అంటూ ఉండడ మెందుకు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—భూసంస్కరణలకు బంజరు భూములకు ప్రభుత్వము మాత్రము ఎక్కడా ముడి పెట్టలేదు.

SRI D. V. SUBBA RAO :—ఆచరణలో మాత్రం ఏది పెట్టలేదు.

THE HON. SRI K. CHANDRA MOULI :—అది వేరే సంగతి.

SRI D. V. SUBBA RAO :—అందువల్ల ఈ బంజర్ల సమస్య తీవ్రంగా ఉన్నదని ఒక్క కమ్యూనిస్టులే చెప్పనక్కరలేదు. ఇది అందరికి తెలిసినదే. మేము ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామంటే, మరి ఆచరణలో మాత్రం కన్పడడంలేదు. Objectionable భూములుపోను మిగతావైనా ఇవ్వడం లేదేమి అని మా complaint. ఏది objectionable, ఏది యివ్వవచ్చో ఎవరికి తెలియదు. ఏ ఆఫీసుకు వెళ్ళినప్పటికి చదువుకొన్న వాళ్ళుకూడ మమ్ములనే అడుగుతున్నారు. అందుచేత అవి మాకు తెలియడంలేదు సరికదా, రివిన్యూ డిపార్టుమెంటు వారికిగూడ తెలియడంలేదు. కనుక, ప్రతి గ్రామంలోను ఈ objectionable పోరంబోకులు అంటే ఏవో un-objectionable అంటే ఏవో, ఇవన్నీ ఒక list గా తయారు జేయవలసిందని క్రింది officers కు ఉత్తరువులు పంపితే బాగుంటుందని సూచిస్తున్నాను. ఆవిధంగా చేస్తే కొంత పేచీ వదలిపోతుంది. అట్లుగాకుంటే దున్నిన తరువాత, heavy penalties వేయడం అంటే కట్టుకున్న తరువాత విడిచి పొమ్మన్నంత అన్యాయంగా ఉంటుంది. తరువాత భూములకొరకు దరఖాస్తు పెట్టుకొంటే ఆరు నెలలైనా ఏమి జరగకపోతే తరువాత కలెక్టరుదగ్గరకు వెళ్ళి స్వయంగా చూచిన తరువాతగూడ, ఆఖరున ఈభూమి

Sri D. V. Subba Rao] [1st December 1955

ఇవ్వబడదు అని ఉత్తరువు వచ్చింది. పోనీ ఇంకో భూమికి దరఖాస్తు పెట్టుకొంటూ మరొకటే అదికూడ వస్తుందో రాదో తెలియదు. ఈవిధంగా దరఖాస్తులు పెట్టుకొన్న 6 నెలల వరకు ఏమి చర్య తీసుకోకపోగా చివరకు ఇవ్వడంలేదు. ఈవిధంగా వారిని అయోమయ స్థితిలో ఉంచడం న్యాయంకాదని, అందుచేత ఈ బంజర్ల వగైరా వివరాల list ఒకటి తయారు చేసి ఉంచితే ఇంత గోల ఉండదేమోనని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. ఈ సమస్య శీఘ్రంగా, అందరికి సంతృప్తికరంగా ఉండేటట్లు పరిష్కారం చేయవలసిందని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా, సభ్యుడు శంకరయ్యగారి తీర్మానానికి నేను ఏకీభవించలేక పోతున్నాను. కారణమేమిటంటే, నిన్ననే పూజ్యులు రెవిన్యూమంత్రిగారి Betterment Tax అనే బిల్లువిషయములో ఆ పార్టీవారైతేనేమి, మరొకపార్టీ మిత్రులుఅయితేనేమి వ్యతిరేకముగా మాట్లాడారు. కాని దేశములో వున్నభూమిని నీటివసతులు వగైరాలు కల్పించటానికి ప్రభుత్వం లక్షలకొలది, కోట్లకొలది డబ్బు ఖర్చుచేసి మూడు సంవత్సరాలు పండించుకున్న తరువాత పన్ను ఎకరానికి ఏ నాల్గు అణాలో పన్నువేయటానికి బిల్లును తీసుకొనివస్తే, వారు దానికి అయిదు సంవత్సరాలు అవసరమనిన్నీ, దానికి పన్ను ఎందుకు వేస్తారనిన్నీ వాదించారు. వారు యీ విధంగా మాట్లాడడము, కేవలము యిది ఒక ప్రచారముకొరకు మాట్లాడడము తప్ప మరేమికాదనుకుంటాను. ప్రాజెక్టుల కొరకు ప్రభుత్వం కోట్లకొలది డబ్బుఖర్చుచేస్తూ ప్రజలకువున్న భూమికి నీటివసతులు కల్పించాలానే సదుద్దేశ్యముతో ప్రభుత్వముతలపెట్టిచేస్తున్నది. ఈ విధమైనఖర్చు తిరిగి రాబట్టుకోటానికి ప్రజలనుంచి కొద్ది కొద్దిగా వసూలుచేయటానికి బిల్లుతెచ్చారు. మాకున్నభూమికి ప్రభుత్వము నీటివసతులు కల్పించడమువల్ల మేము పంటలు పండించుకొని, అన్నము, తిండి, గుడ్డ కలుగజేసుకో గలుగుతున్నాము. అందుకు ప్రభుత్వము తోడ్పడుతున్నదని ప్రజలు గ్రహించగలిగారు. ప్రతిపక్షమువారు యీ విధంగా బిల్లును ఎదుర్కొనడము కేవలం పార్టీ propaganda కొరకే అని నేను అనుకుంటున్నాను. ఇంతేకాకుండా మనకు ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన పదమూడు మాసములలోనే శ్రీ సంజీవరెడ్డిగారు మా విశాఖపట్టణముజిల్లాలో వేలకువేల ఎకరాలు హరిజనులకైతేనేమి, యితర పేద సవర్ణహిందువులకైతేనేమి, యివ్వడము జరిగింది, ఇంకను జరుగుతున్నది. జరగబోతున్నదికూడా. అలాంటప్పుడు హిందూదేశముయొక్క ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూగారితో సమానులైన వినోబాభావేగారి tour కు ఖర్చుకుగూడ మన ఆంధ్ర ప్రభుత్వం సహాయ్యము చేస్తున్నది. అందువల్లనే మన రాష్ట్రములో భూసంస్కరణలు రావని సంజీవరెడ్డిగారు చెబుతున్నారని యిక్కడ సభ్యులుగావున్న ఒక ప్లీడరుగారే సెలవిచ్చారు, అలాంటి పూజ్యులుఅయిన వినోభాభావేగారు పెద్ద

Sri P. Gunnayya] [1st December 1955

విప్లవము తీసుకొనివస్తున్నప్పుడు, వారిని విమర్శించడమనేది చాలా విచారకరముగా వున్నది. మా జిల్లాలో నా నియోజకవర్గములో వినోబాభావేగారు tour కు ఏర్పాటుచేసుకుని తిరుగుచున్నారు. సుమారు వెయ్యిఎకరాలవరకూ దానముగా పెద్దవారేయిచ్చారు. రేపు ఎప్పుడో ప్రభుత్వము భూసంస్కరణ తీసుకొనివస్తున్నది, కనుక యిప్పుడే మీకువున్న భూమిలో కొంత మాకు దానముచేయండి అని ఆ మహనీయుడైన వినోబాభావేగారు కోరగా, మా జిల్లాలో సుమారు 15 వందల ఎకరాలు దానముక్రింద వారు సంపాదించగలిగారు. ఆ భూమిని అక్కడనే తిరిగి దానముగా యిస్తామని వినోబాభావేగారు వాగ్దానముచేశారు. అలాంటి మహనీయుడైన వినోబాభావేగారిని యీ శాసనసభలో "కాదు" అని అంటే, యీవిషయము ప్రజలు గుర్తిస్తారని అనుకుంటాను. అందువల్ల ప్రభుత్వంవారు యీనాడు పేదవారి కోసం, హరిజనులకోసం ఎంత సహాయ్యము చేస్తున్నారో, మనకందరికీ తెలుసును. ఇంకను ఆంధ్రదేశములో ప్రభుత్వం కొన్నివేల ఎకరాల బంజరుభూమిని, ముఖ్యంగా జమీందారీ ఏరియాలో వున్నదానినైతేనేమి, యితర ప్రాంతాలలోనిది అయితేనేమి, తప్పకుండా పేదవారికి, హరిజనులకు, గిరిజనులకు యివ్వాలనే ఉద్దేశ్యముతో, సర్వేచేయించి, Estate Managers ద్వారా, రెవిన్యూ ఆఫీసర్లద్వారా acquire చేయించి వారిలో పేదవారుగా వున్నవారికే ప్రభుత్వంవారు పంచిపెట్టుతున్నారు. నేను ఒక దృష్టాంతము చెబుతాను. మా జిల్లాలో సుమారు అరవై ఎకరాలభూమి ఒకరిదగ్గర వున్నది. ఆ భూమికొరకు హరిజనులు, యింకా యితర పేదవారు దరఖాస్తులు పెట్టుకొన్నారు. ఇది జరిగి నాలుగుమాసాలుఅయింది. శ్రీకాకుళం జిల్లాకలెక్టరుగారు ఆ భూమిని స్వయముగావెళ్లి చూచి అక్కడ ధరఖాస్తులు పెట్టినవారిలో పేదవారుగా వున్నవారికి యిచ్చేటట్లు ఏర్పాటు చేశారు. ఆ గ్రామముపేరు మారుకొండపుట్ట. అలాంటి సందర్భములో వేలకొలది ఎకరాల భూమి వున్నటువంటి కొంతమంది ప్రజలు, ఆ 60 ఎకరాలభూమి పేదవారికే యివ్వటానికి ఒప్పుకున్నారు. ఆ విధంగా యివ్వమని కలెక్టరును కోరారు. మా జిల్లాలో యీ విధంగా జరిగింది. ఇటుపైనగూడా అదేమాదిరి జరగబోతున్నది. మాజిల్లాలోని సాలూరుతాలూకాలో ఉన్న అడవిప్రాంతములో కొన్నివేల ఎకరాలువుంటే, దానికొరకు పేదవారు దరఖాస్తులు పెట్టుకున్నారు. ఆ భూమిని గూడ అక్కడ పేదవారికే యివ్వవలసిందిగా నేను ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆ విధంగాచేస్తే యీ పేదవారి యిబ్బందులు తొలగిస్తూ వారికి జీవనోపాధిని ప్రభుత్వం ఏర్పాటుచేసినవారగుదురు. ఇదేవిధంగా పాతపట్టణం తాలూకాలో, ఏ విధంగాను అభ్యంతరములేనిదిగా వున్నభూమి అడవిప్రాంతములో వున్నది. దీనికి ఏవిధంగాను అభ్యంతరములేదు. కాని Chief Conservator of Forests కు,

జిల్లాకలెక్టరుకు ధరఖాస్తులు పెట్టుకున్నారు. కాని Forest department వారు యీ అడవి reserve చేశామనిచెప్పి ఆటంకపరుస్తున్నారు. ఆ భూమి విస్తీర్ణము సుమారు 1500 ఎకరాలు వుంటుంది. ప్రభుత్వమువారు యీ దరఖాస్తులు అన్నీ అంగీకరించి ఆ భూమిని ఆ దరఖాస్తుదార్లకు పంచిపెట్టవలసిందిగా కోరుతున్నాను. మన రాష్ట్రియములో భూసంస్కరణలను ప్రవేశపెట్టకముందే, యీ భూమిని ఆ దరఖాస్తుదార్లకు యిచ్చినట్లయితే, ప్రభుత్వానికి మంచి పలుకుబడి వస్తుంది. ఇప్పుడు గోపాలరెడ్డిగారి ప్రభుత్వము సాగుతున్నది గనుక, యీ భూమిని అక్కడ పేదవాళ్లకే యివ్వమని హృదయపూర్వకముగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అధ్యక్షులవారు నాకు యీ అవకాశమిచ్చినందులకు, వారికి నేను నా అభివందనములను అర్పిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri P. VENKATASUBBAYYA :—అధ్యక్ష మహాశయా, బంజరు భూముల పంపకములో యిదివరకు యీ శాసన సభ చేసిన తీర్మానాన్ని అనుసరించి ప్రభుత్వం అమలు పరచటానికి కొంత staff ను వేయడం, తద్వారా భూములను పంచడం చూచి హరిజనులలో ఆనందించనివారు ఎవరూ లేరని చెప్పుటకు నాకు సంతోషకరముగా వున్నది. అందుకు నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. అయితే అర్జీలు పెట్టుకునేటప్పుడు దరఖాస్తుదారులు, వారు హరిజనులని వారి దరఖాస్తులలో సూచించుటకు వీలులేదు. ఆ భూమి నిరుపేదల కివ్వబడుతుందని అందులో వున్నది. అయితే హరిజనులైన వారందరూ నిరుపేదల క్రింద వస్తారు గనుక, యీ బంజరు భూములను పంపకము చేయడములో ప్రభుత్వానికి అట్టే యిబ్బంది కనబడదు. ఈ భూమియొక్క విస్తీర్ణము సుమారు 13 లక్షల ఎకరాలు వుంటుందని అంచనా వేస్తున్నారు. ఈ పంపకము అంతా రెండు సంవత్సరాల కాలములో పూర్తికావాలని ప్రభుత్వము యిదివరకే నిర్ణయము చేసింది. అయితే యీ పంపకము ఎంతవరకు జరిగింది, యింకా ఎంతవున్నది, యిది పంపకము చేయటానికి యింకా ఎంతకాలము పడుతుంది, అనే విషయము మంత్రిగారు తన సమాధానము చెప్పేటప్పుడు చెబితే మంచిదని నేను మనవిచేస్తున్నాను. ఇంకను యీ పంపకము చేసే విషయములలో ప్రభుత్వం ఒక G.O. ద్వారా పోరంబోకు భూములు మాత్రం యివ్వటానికి వీలులేదు అని తెలియపరిచింది. ఇటువంటి ఆర్డరు వున్న కారణముచేత, యీ పోరంబోకు భూములు మాత్రము ఎవ్వరికీగూడ పంపకము చేయబడకుండా వున్నవి. పోరంబోకులలో, సామాన్యంగా ఎన్నోరకాలు వున్నవి. కొండ పోరంబోకులు అని వీటి పోరంబోకులని, ఫారెస్టు పోరంబోకులని, యీ పోరంబోకులు సాగుకు ఉపయుక్తంగా వున్నప్పటికీ, ఏవిధమైన ఆక్షేపణగూడా లేకపోయినప్పటికీ, అవి మాత్రము హరిజనులకుగాని తదితర బీద ప్రజానీకానికి గాని పంచిపెట్టకుండా అలాగే

Sri P. Venkata subbayya] [1st December 1955

పడి వున్నవి. కనుక ప్రభుత్వము వెంటనే ఆ G.O.ను రద్దుచేస్తూ, కనీసము ఆక్షేపణ లేని పోరంబోకు భూములనైనా పేదవారికి యివ్వవలసిందిగాను, వెంటనే తగిన వుత్తరువులు జారీచేయవలసిందిగాను, ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను. ఈ పోరంబోకు భూములు మా కడప జిల్లాలో కొన్ని తాలూకాలలో ఇచ్చుటకు అనుకూలముగా వుండేవి వున్నవి. ముఖ్యంగా కడపకు సమీపములో బుగ్గవంక అనే ఒక వంక ఉన్నది. ఈ వంకకు యిరు ప్రక్కల సుమారు నూరు ఏకరాల భూమి వున్నది. దానికి ఏవిధంగాను ఆక్షేపణలేదు. ఈ వంకకు యిరు ప్రక్కల సుమారు 50 లింకుల మార్జను పెట్టి, అది ఆక్షేపణీయమైనదని నిర్ణయించి, తక్కిన భూమిని యాభై సెంట్లకు ఒక plot గా ఏర్పాటుచేసి, యింతకు ముందు ఏ ఇరవై సంవత్సరాల నుంచో చాలా ఖర్చుచేసి, దున్నుకుంటూ, బాగు చేసుకుంటున్న పేదవారికే ఉచితముగా యివ్వకుండా వేలము పాటపెట్టి యిస్తున్నారు. ఇది ప్రతి సంవత్సరము జరుగుచున్నది. ఈవిధంగా పాటపెట్టి ప్లాటు ఒకటింటికి యాభై, అరవై, డెభ్భై రూపాయల ప్రకారము అక్కడవున్న పేదవారికి యిస్తున్నారు. ప్రభుత్వం యీవిధంగా చేయడం చాలా శోచనీయముగా వున్నదని మనవిచేస్తున్నాను.

ఇది అంతా వాళ్లు అనేక బాధలకు కష్టాలకు గురియై కొంత ఖర్చు పెట్టుకొని సాగుకు అనుకూలము చేసుకున్నారు. ఆ భూమిని అంతా వారికి ఉచితంగా ఇవ్వక పోవడం ఆశ్చర్యకరమైన విషయము. ఈ 100 ఎకరాల మీద ప్రభుత్వానికి 4,5 వేలు రూపాయిలు కూడా రాదు. అందువల్ల దీనిని ఉచితంగా వాళ్లకు ఇస్తే చాలా బాగుంటుందనే విషయము ప్రభుత్వంవారు ఆలోచించాలి. వచ్చే సంవత్సరము అయినా కనీసం ఆక్షేపణ లేనటువంటి 50 సెంట్ల ప్లాట్లను అక్కడ ఉండేటటువంటి జనానికి ఉచితంగా ఇవ్వాలని, లేదా conditional assignment చేయాలని మనవిచేస్తున్నాను.

కడప జిల్లాలో ఖాజీపేట దగ్గర 200 ఎకరాలు పైన కొండ పోరంబోకు ఉన్నది. అక్కడి పేదవాళ్లు అనేకమంది Co-operative Colonisation Society గా ఏర్పాటు చేసుకుంటాము, ఈభూమి అంతా కూడా Co-operative Society కి ఇవ్వమని అర్జీలు పెట్టుకున్నారు. అది ఇవ్వకుండా అలాగే ఉండిపోయింది. దానిని ఈ సొసైటీకి ఇచ్చినట్లయితే Co-operative Colonisation Society కి పెట్టుకొని దానిని ఉపయోగించుకోవడానికి పేదలందరికీ వీలుంటుంది. కాబట్టి ప్రభుత్వం దానిని వెంటనే ఆ సొసైటీ వాళ్లకు ఇవ్వాలని మనవిచేస్తున్నాను. ఇదేమాదిరిగా రాజంపేట తాలూకాలో, చెయ్యేటి పోరంబోకులు, పులపుత్తూరు దగ్గర కొన్ని ఉన్నవి. అక్కడ ఉన్నటువంటి హరిజనులంతా ఈ భూములను మాకు ఇవ్వాల్సింది; మేము సాగుచేసుకుంటాము అని అర్జీలు పెట్టుకొన్నారు.

1st December 1955] [Sri P. Venkatasubbayya

ఈ పోరంబోకులు ఇవ్వడానికి వీలు వుంటే ఇప్పుడు ప్రభుత్వం ఉత్తర్వులు ఇస్తుందా ? ఈ పోరంబోకులను assignment చేయవలసిందని ఉత్తర్వులు జారీ చేసి ఇదివరకు వున్న ఉత్తర్వును రద్దుచేసినట్లయితే ఈ పోరంబోకు భూమి అంతా పేదలకు అందుబాటులో వుండడానికి వీలవుతుంది. తరువాత ఈ హరిజనులు, తదితర పేదవారు అంతాకూడా అనేక కష్టాలకు గురై, వ్యయాన్ని భరించుకొని, సాగుకు లాయికీగా చేసుకొన్న భూములన్నీ ఈ రాజకీయ బాధితులు అనేవారికి కొంతమందికి ఆ రైతులవద్దనుంచి లాక్కొని ఇవ్వడము జరుగుతోంది. ఈవిధంగా ఇవ్వడం ఈ పేద హరిజనుల పొట్టలపై కొట్టడమేనని నేను మనవిచేస్తున్నాను. కనుక ఇటువంటి పరిస్థితుల్లో ఈ పేద హరిజనులు గాని, భూములు లేని నిరుపేదలు గాని సాగుచేసుకొంటున్నటువంటి భూములను, వారివద్దనుంచి లాగుకొనకుండా వారికి permanent గా assignment చేసినట్లయితే బాగా ఉంటుందని మనవిచేస్తున్నాను. పోరంబోకు భూములను పట్టాలకు యివ్వరాదను వుత్తర్వును రద్దుచేసుకొని ఈ పోరంబోకు భూములను assignment చేసినట్లయితే పేదవారందరికీచాలా లాభదాయకముగా ఉంటుంది. ఆ రకంగా చేసినట్లయితే ప్రభుత్వాన్ని పేద ప్రజానీకము అంతా అభినందిస్తుందని మనవిచేస్తున్నాను.

ముఖ్యముగా యింకొక విషయము. ఈ బంజరు భూములను ఇప్పుడు హరిజనులకు, పేద జనానికి ఇస్తున్నారు. ఇవి కొండలను ఆనుకొని ఉన్నాయి. అవి సాగుకు లాయికీగాలేని కారణముచేత బుల్డోజర్లను ఉపయోగించి ఎక్కువ ఖర్చు పెట్టుకొంటేనే గాని ఆ భూములు అన్ని సాగు క్రిందకు తీసుకురావడానికి సాధ్యము గాదు. ఇప్పుడు కొంత ద్రవ్య సహాయచేసో, బుల్‌డోజర్ల ద్వారా సహాయముచేసో ఆ భూములకు అంతాకూడా సాగుకు లాయికీగా చేసిన తరువాత వాళ్లకు ఇస్తే బాగుంటుందిగాని లేకపోతే, బంజరు భూములు అనేకము ఈ పేదవాళ్లకు ఇచ్చి ప్రయోజనంలేదు. వారు వాటిని సద్వినియోగం చేసుకోలేరు. వారు ఉపయోగించుకోవడానికి వీలుగా ఉంటే అవి లాభదాయకముగా ఇచ్చినంత మాత్రాన పేద ప్రజానీకమునకు లాభము కలుగచేసినట్లుగా ఉండదని నేను మనవి చేస్తున్నాను. కాబట్టి ప్రభుత్వం వెంటనే ఒక ఆర్డరుద్వారాగాని, ఒక పథకము తయారుచేసి ఇటువంటి భూములు ఎక్కువ కష్టపడి ధనము వ్యయపరచి సాగుకు లాయికీగా చేసికోతగ్గ భూములు అన్నింటినీకూడా Agricultural Department ద్వారా, బుల్‌డోజర్లతో సాగు క్రిందకు తీసుకొనివచ్చిన తరువాత వీరికి assign చేస్తే చాలా బాగుంటుందని మనవిచేస్తున్నాను. ఈ అవకాశం నాకు ఇచ్చినందుకు ఉపాధ్యక్షులవారికి వందనములు తెలుపుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*SRI M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా మహాశయా, శ్రీ శంకరయ్యగారు ప్రవేశపెట్టిన తీర్మానము మీద కొండయ్య చౌదరిగారు మాట్లాడుతూ ఇది ప్రచారణకు సాకుగా అని చెబుతూ, ప్రభుత్వమువారి పాలసీ ఇదేమాదిరిగా వుంటున్నప్పుడు ఈ రిజల్యూషను తేవడము అనేది చాలా విచారించవలసిన విషయము అనికూడా చెప్పారు. నిజమే. ప్రభుత్వమువారుకూడా 1954 సంవత్సరములో ఈ తీర్మానమును ప్యాసుచేశారు. ఆదేవిధముగా రివెన్యూ మంత్రిగారు ఈ రిజల్యూషను ప్రకారము మేము ఆమోదిస్తాము అని చెప్పి నిన్న compulsory water cess లో 3 సంవత్సరములవరకు అని ఏవిధముగా ఒప్పుకొన్నారో అట్లా ఈ తీర్మానాన్నికూడా గౌరవించి అదేవిధంగా మంత్రిగారు సెలవిచ్చినట్లయితే దీనిని చర్చించవలసిన అవసరము ఉండదు. అట్లా బలపరచలేదు కాబట్టి ఈ చర్చచేయడానికి అవకాశం వున్నది. కాబట్టి కొండయ్య చౌదరిగారు చెప్పిదాంట్లో ఎంతమాత్రము నిజములేదని చెప్పడానికి అవకాశముకూడా ఉన్నది. ఇప్పటికైనా సరే శంకరయ్యగారు తెచ్చిన తీర్మానము ప్రకారము మాపాలసీ అని చెప్పినట్లయితే దానిని మేము సమర్థిస్తూ చర్చ చేయకుండా విరమించడానికి మాకు ఏమీ అభ్యంతరము లేదు. ఇప్పుడు ఈ చర్చ విషయములో కొన్నిచోట్ల బంజరు భూములు, పోరంబోకులుకూడా స్మశానమునకు ఉపయోగిస్తున్నవి, తదితర గ్రామ క్షేమమునకు ఇచ్చివేయమని చెప్పి శంకరయ్యగారు కోరుతున్నారు. దానిలో కొంత అమానుషంగా ఉన్నదని కొంతమంది సభ్యులు విమర్శించడము చాలా శోచనీయము. ఎందుచేత ననగా ఇది వారు అంత అర్థ రహితంగా, బాధ్యతా రహితంగా తెచ్చిన తీర్మానముకాదు. గ్రామక్షేమము చూస్తూ, గ్రామ ప్రజలందరికి పనికి వచ్చే బంజర్లను, స్మశానమునకు కానీయండి, పశువుల మేతకు కానీయండి, లేదా రస్తాలకు కానీయండి, ఇవన్నీ పోగా మిగిలి వున్నట్లయితే వాటిని పేద ప్రజానీకానికి ఇవ్వాలని కోరుతున్నాము. ఈ విషయంలో ఇప్పుడు మాట్లాడిన సుబ్బారెడ్డిగారు చాలా యదార్థంగా అనుభవంతో మాట్లాడి ఉన్నారు. వారితో మేము ఏకీభవిస్తున్నాము. ఇప్పుడు యధార్థంగా ప్రతిగ్రామములో అయినా కొంత బంజరుభూమి ఉంటే ఆ గ్రామములోని భూస్వామికి వారి పలుకుబడిని ఉపయోగించి, ఆ కొస్తభూమిని కూడా ఆక్రమించుకొని, బీదవారికి ఎమీలేకుండా చేయడం జరుగుతోంది. వాటిలో B. Memo లుకూడా కరణములతో చెప్పివారి పలుకుబడిని ఉపయోగించి ఎవరి సాగులో 2, 3 యేండ్లనుంచి ఉంటేవాటిని వారే ఆక్రమిస్తున్నారు గాని ఈ నిరుపేదలకు ఎవరి దక్షతఅ నేది లేకుండాఉన్నది. అందువల్ల దీనిని గురించి ప్రభుత్వము వారు సమగ్రంగా ఆలోచించి 1954 సం॥ములో ఏ విధముగా తీర్మానించారో

ఆ విధముగా ఎక్కడఅయినాసరే, ఆంధ్రరాష్ట్రము మొత్తముమీద బంజరు భూములను నిరుపేదలకు, భూములులేనివారికి ఇచ్చినట్లయితే చాలా బాగుంటుందని వారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ భూములు ఇవ్వడము విషయములో రాజకీయ బాధితులకు పేదవారికీ విచక్షణఉండదు. రాజకీయ బాధితులకు ఇవ్వవద్దని ఎవరూ అనరు. వారికికూడా ఇవ్వవలసినదే. కాని ఈ విషయములో ఒక differential పాలసీ పెట్టి వారికి ఇచ్చినట్లు, వీరు నిరాకరించినట్లు కాకుండా, ప్రభుత్వమువారు ఒక నిర్దుష్టమైన పాలసీని కాకుండా, అంటే ఈ application పుచ్చుకొనేటప్పుడు ఒక సీరియలు నంబరు ప్రకారముపెట్టి, ఎవరు ముందుపెట్టితే వారికి ముందు ఇవ్వాలనే ఒక నిర్ధారణ పెట్టుకొని, ఆ ప్రకారము చేసినట్లయితే ఏ విధమైన ఆరోపణలు ప్రభుత్వమునకు ఉండవు. కాబట్టి ఆ రకంగా చేయాలని నేను ప్రార్థిస్తున్నాను.

ఈ బంజరుభూములు, పోరంబోకులు విషయంలో ఒక్క ప్రతిపక్షము వారికి కనికరము ఉన్నట్లు, ప్రభుత్వపక్షము వారికి కనికరము లేనట్లు ప్రతిపక్షము వారు ఒక ప్రచారంచేస్తున్నట్లు ప్రభుత్వపక్షమువారు చెప్పారు. అది ఎంత మాత్రములేదని నేను మనవిచేస్తున్నాను. ఈ విషయము 1954 సంవత్సరములో ప్రభుత్వంవారు తీర్మానించారు. గాని దరిమిలా గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు కొన్ని కొన్ని బంజర్లను అమ్మకమునకు పెడతామని సెలవిచ్చారు. అంటే 1955 సం॥ము తీర్మానమునకు దరిమిలావారు శాసనసభలో ప్రవేశపెట్టిన తీర్మానానికి, దానికి కొంచెము భేదమున్నట్లు సభ్యులందరికీ తెలుసును. మనకు స్వరాజ్యంవచ్చింది. శ్రేయోరాజ్యమును స్థాపించుకొన్నాము. అందరికి ఒక employment ఉండాలి. ప్రతివారికి ఒక వ్యాపకము ఉండాలి. అందువల్ల ఈ బంజరుభూములను, భూములు లేనివారికి ఇచ్చినట్లయితే వారికి ఇది ఒక employment గా ఉంటుందని అందువల్ల దీనిని ప్రభుత్వమువారు వ్యాపారదృష్టితో కాకుండా formal దృష్టితో చూడాలని మేము పదే పదే చెప్పడంకూడా జరుగుతున్నది. అంతేకాని ప్రతిపక్షము వారికి కనికరము ఉన్నదని, ప్రభుత్వపక్షమువారికి కనికరములేదని మేము ఎప్పుడూ చెప్పలేదు. ఆ రకంగా మీరొక్క పాలసీనికూడా మార్చుకొని, చేయవలసిందని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri T. GOPALAKRISHNA GUPTA :—అధ్యక్షా, ప్రతిపక్షానికి చెందిన గౌరవసభ్యులు శంకరయ్యగారు తెచ్చిన తీర్మానాన్ని బలపరచలేనందుకు చింతిస్తున్నాను. ఇందులో రెండు విషయాలున్నాయి. మొదటిది బంజరుభూములు లేక పోరంబోకులను విక్రయించకుండా ఉచితంగా పేదవారికి ఇవ్వాలని. ఈ బంజరు భూముల విషయంలో ఆంధ్రరాష్ట్రం అంతటా ఒకేవిధానం ఉన్నట్లు తోచడంలేదు.

ఎందువల్లనంటే రాయలసీమలో ముఖ్యంగా మా జిల్లాలో బంజరు భూములను వేలం వేయడంకాని డబ్బు ఇవ్వడంకాని ప్రభుత్వంవారు ఎక్కడా చేసియుండలేదు. ఇటువంటి భూములను భూములులేని పేదలకు ఉచితంగానే ఇస్తున్నారు. బహుశా కొన్ని ప్రాంతాలలో ఎక్కువ విలువకలిగిన భూములు ఉన్నప్పుడు వాటిని కొద్దిగా డబ్బు రాబట్టుకొని ప్రభుత్వంవారు ఇస్తుండవచ్చును. అందులో తప్పుఏమీలేదు. ఇక పోరంబోకుల విషయం తీసుకుంటే వారు ఎన్నిచెప్పినా ప్రచారంకోసమే అనడంలో ఏ మాత్రం సందేహించడానికి అవకాశంలేదు. ఈపోరంబోకుల విషయం ముఖ్యంగా భూములున్నవారికి బాగా తెలుస్తుంది. ఇటీవల రాయలసీమలో కరువు ఏర్పడినప్పుడు పనులులేక నిరుద్యోగులుగా ఉన్నవాళ్ళకు పనులు కల్పించడానికి ప్రభుత్వం అనేక కార్యక్రమాలను కొనసాగించింది. చెరువులు పూడిపోయి, వాటిక్రింద విపరీతమైన ఆయకట్టు ఉండడం సంభవించినప్పుడు ఈ పూడికను తీయించేపనులుకూడా కొన్ని చోట్ల జరిగాయి. ఏ ప్రాజెక్టులులేని రాయలసీమ ప్రాంతంలో చెరువులక్రింద ఆయకట్టుకలిగి సాగుకు అవకాశంఉండే సందర్భాలలో చెరువులలోని Silt పూడికను ఎత్తించడంకూడా ఒక పనిగానే పెట్టుకుని ఆ మోస్తరుగానే కార్యక్రమం సాగించితే చాలా సౌమ్యంగా ఉంటుంది. చెరువులు ఎందువల్ల పూడుతున్నాయి అనే విషయం గమనించితే నీటి మునకవల్ల లేదా సమీపంలోఉండే పోరంబోకులను దున్నడంవల్ల అని తేలుతుంది. దున్నినప్పుడు ఎక్కువ వర్షంవల్ల మట్టి కొట్టుకునివచ్చిన కారణంచేత చెరువులు పూడుకుని పోతున్నాయి. ఈ దినం రాష్ట్రంలోని చెరువులన్నింటిని ప్రభుత్వంవారు పరీక్ష చేయించితే ప్రతి చెరువు ఎన్నెన్ని అడుగులు పూడిపోయిఉన్నదో గమనించవచ్చును. ఇది అందరు తెలుసుకొనడానికి అవకాశం ఉంటుంది. మిట్టతూములు, తగ్గుతూములు వుండే అనేక చెరువుల్లో తగ్గు తూములు పూర్తిగా కనబడకుండా మట్టితో మునిగిపోయి ఉంటున్నాయి. చెరువులక్రిందఉండే రైతులకు చాలా కష్టనష్టాలు కలుగుతున్నాయి. ఇవన్నీ పోరంబోకులు దున్నినందువలన కలిగేనష్టం. మరొక విషయం ఏమిటంటే కాలువ పోరంబోకులని వున్నాయి. కాలువ పోరంబోకుల వెడల్పు ఒకవేళ కొద్దిగాఉన్నా, కాలువ సమీపంలోఉండే విస్తరణాన్ని దున్నినకారణంచేత మన్ను, ఇసుక కొట్టుకుని వచ్చి దానివల్ల రైతులకు చాలానష్టం కలుగచేస్తున్నది. అయితే ఇటీవల కరువు కాలంలో జరిగినతప్పు ఏమిటంటే ఆక్షేపణీయమైన పోరంబోకులు దున్నుటవలన ప్రభుత్వంవారు జరిమానాలు వేశారు. ప్రతిపక్షసభ్యులేకాక మేముకూడా ఒకతప్పు చేశాము. కరువుకాలం అవడంచేత జమాబందీ ఆఫీసర్లను కలెక్టర్లను అడిగి కష్టకాలంలో నిషేధాలు వేయవద్దని కోరియున్నాము. దానిపై వారు మాఫీచేశారు. అంతటితో ఏమైనది? ప్రతిపక్షం పార్టీవారు అనేకగ్రామాలలో ఉన్నటువంటి

ఆక్షేపణీయములైన భూములను అనేక సంవత్సరాలుగా దున్నుతున్నారు; వీరు దున్నుకోనవచ్చు; వీరికు ఖండితంగా పట్టాలు ఇస్తారని ప్రచారం చేసి తక్కిన రైతులకు చాలా నష్టంకలిగిస్తున్నారు. ఉదాహరణలు కావలిసివస్తే వందలైనా చెప్పడానికి అవకాశంఉంటుంది. పోరంబోకుల నేవి పూర్వం గ్రామ సముదాయానికి అవసరమైనందున వాటిని పోరంబోకులని సాగుచేయకుండా అపుదలచేశారు. వాటిని విక్రయానికి కాని ఉచితంగా కాని ఇవ్వడంవలన రైతులకు చాలానష్టం ఏర్పడుతుంది. ఇందువల్ల ఎన్నోకష్టనష్టాలు కలుగుతాయని దేశఉత్పత్తికే నష్టం కలుగవచ్చుననే విషయం మనం గమనించుకోవాలి. అనేకమంది హరిజనుల చేతుల్లోఉండే భూములను తీసుకుని రాజకీయబాధితులకు ఇస్తున్నారని ప్రభుత్వంపైన నిందారోపణలు చేస్తున్నారు. రాజకీయ బాధితులకు భూములను ఇచ్చేవిషయంలో కూడా అనేకచట్టాలను ఏర్పాటుచేసి అనేకషరతులకు లోబడి ఆ షరతులకు ఏ విధంగాను ఇబ్బందిలేని పరిస్థితులలో రాజకీయ బాధితులకు ఇచ్చినారేకాని హరిజనుల చేతిలోఉండే భూములనువేటిని నిర్బంధంగా తీసుకుని రాజకీయబాధితులకు ఇచ్చిఉండలేదని అందరూ తెలుసుకోవాలని కోరుతున్నాను. బంజరుభూముల పంపకంలోమాత్రం ఒక నష్టంకలుగుతోంది. ఏమిటంటే హరిజనులకు గాని ఏమాత్రం స్థితిలేని బీదవారికి గాని ఈ భూములను పంచడంకాక కొంతవరకు కొద్దిగా ఉన్నటువంటివారికే ఇవ్వడం జరుగుతోంది. ఈ తప్పు ప్రభుత్వంవారిదే అని మాత్రం చెప్పకతప్పదు. ఇటువంటి తప్పులను తొలగించాలంటే తాలూకా level లో ఒకకమిటీని ఏర్పాటుచేయాలి; ప్రతిమాసం వారు చేరవలెను. అక్కడ ఉండే Sub Collector యాజమాన్యాన సభజరిపి ఎవరికి బంజరుభూములు కావాలనేది చర్చించి మంజూరుచేస్తే అర్హులైనవారికి భూములుచెందే అవకాశం ఉంటుంది. బంజరుభూముల పంపకానికి Special Revenue Inspector, Dy. Tahsildar కూడా ఉంటున్నారు. కాని జరగడం ఏమిటంటే గ్రామోద్యోగులు కొన్ని సంవత్సరాలుగా ఒకభూమిని పేదవాడు దున్నుతున్నా రూకలు వసూలుచేసి సంగ్రహిస్తున్నారేకాని లెక్కలలో వ్రాయడంలేదు. లెక్కలరీత్యా ఇది బీడుగా ఉంటోంది. ఇటువంటి భూములను వారు కొద్దిగా ధనంఇస్తే ఆ లంచానికి ఆశపడే కరణాలు వారి పేరుతో సాగును కనబరస్తూ న్యాయంగా అనుభవిస్తున్నవారికి ఆ భూమిని లేకుండా చేస్తున్నారు. తాలూకా level లో ఒక కమిటీనివేస్తే ఇటువంటి అక్రమాలు అరికట్టడానికి సులువుగా ఉంటుంది. గౌరవనీయులైన రెవెన్యూమంత్రిగారి దృష్టికి మేము తీసుకువచ్చేది ఏమిటంటే, కరువు దాటిపోయిందికాబట్టి ఇప్పుడైనా ఆక్షేపణీయములైన పోరంబోకులను దున్నేవారికి జరిమానాలు వేయకుండా శిక్షలువేసి దేశసౌభాగ్యానికి తోడ్పడాలని కోరుతూ శంకరయ్యగారు తెచ్చిన తీర్మానాన్ని నేను సమర్థించలేకుండా ఉన్నాను. [illegible]

Sri G. NAGESWARA RAO :—ఉపాధ్యక్షా, శంకరయ్యగారు తెచ్చిన తీర్మానంలో అన్నిరకాల పోరంబోకులుగానీ, బంజర్లుగానీ అనే మాటలు వాడారు. ఐతే అది చాలామందికి అభ్యంతరంగా కన్పిస్తున్నది. ఐతే నిజముగా శంకరయ్యగారి ఉద్దేశం అదికాదని నేను అభిప్రాయపడుతున్నాను. ఐతే గ్రామాలలో యీరోజుండే పోరంబోకులు గ్రామఅవసరాలకుపోను మిగిలిన భాగాన్ని వ్యవసాయ కూలీలకుగానీ పేదప్రజలకుగానీ యివ్వమనిచెప్పి సభ్యులంతా యింతవరకు చెబుతున్న విషయమే. అందుచేత గతంలో 1954 లో అసెంబ్లీ అంగీకరించినటువంటి తీర్మానంలో unobjectionable porambokes, బంజరు భూములు, యివన్నీ కూడా భూములులేని పేదలకు పంపకం చేయాలని తీర్మానం ఆమోదించబడింది. ఐతే ఆ తీర్మానంప్రకారం కాకుండా 1954 జూనులో ఒక G. O. ప్రభుత్వం జారీ చేసి దానిని రకరకాలపేర్లతో, forest బంజరు భూములలో మొక్కలు పెంచాలి కాబట్టి అవి పంపకానికి పనికిరావుఅనీ, ఎస్టేటుబంజర్లు survey కాలేదు కాబట్టి అవి పంపకానికి పనికిరావుఅనీ, లంకభూములు విలువైనవి కనుక పంపకానికి పనికిరావనీ, రకరకాలపేర్లతో బంజరుభూముల పంపకానికి నిషేధంపెట్టి G. O. జారీచేసింది. ఐతే మిగిలిన బంజరుభూముల సంగతిచూస్తే హరిజనులు శ్రమధారపోసి బాగుచేసి సాగుచేసుకుంటున్న భూములను రాజకీయబాధితులకు యిస్తున్నారు, రాజోలు తాలూకాలో అంతర్వేదిఅనే గ్రామంలో ఒక Society 225 ఎకరాలు సాగుచేస్తుంటే అందులో 150 ఎకరాలు రాజకీయబాధితులకు యివ్వడానికి ప్రయత్నంచేస్తున్నారు. ఇంకా పట్టాయివ్వలేదు అనుకోండి. 1942నుంచి వారుఆక్రమించి సాగుచేసుకుంటున్న సంగతి కలెక్టరుగారికి మంత్రిగారికి విన్నవించుకున్నాం. అమలాపురం తాలూకాలో నిమ్మకాయల కొత్తపల్లిలో Harijan society 365 ఎకరాలు 1942 నుంచి యీరోజువరకు సాగుచేస్తూవుంటే అందులో 75 ఎకరాలు రాజకీయబాధితులకు పట్టాలు యిచ్చివేశారు. నరసాపురం తాలూకా లింగనబోయినచెర్లలో forest బంజర్లు 2 సంవత్సరాలనుంచి గీతపనివారు (toddy tappers) సాగుచేసుకుంటున్నారు. వాటిని రాజకీయబాధితులకు యివ్వాలని propose చేశారు. ఈవిధంగా మనరాష్ట్రంలో చాలాఉదాహరణలున్నాయి. గతఅసెంబ్లీ ఆమోదించిన తీర్మానాన్ని అనుసరించవలసివుంటే ఆ విధంగా చేయరాదు. 10, 12 సంవత్సరాలనుండి సాగుచేసుకొంటున్న పేదహరిజనుల భూముల్ని రాజకీయబాధితులకు యిస్తున్నారు. ఈవిధంగా పేదప్రజలకు అన్యాయం జరుగుతున్నది. ఇక పోరంబోకుల విషయం చూద్దాం. ఈ భూములనుకూడ 1942 లో grow more food scheme క్రింద 1945 వరకుకూడా unobjectionable గా treat చేసి అధికోత్పత్తికి అంగీకరించారు. ఐతే తరవాత ఆభూములకు ఈరోజువరకుకూడా penalty లు వేసి,

case లు పెట్టి పంటల్ని వశపరచుకొని వేలాలువేస్తున్నారు. ఇప్పటికైనా వాటిని unobjectionable గా treat చేసి పట్టాలుయివ్వడం న్యాయమైనవిషయం. అందుచేత కనీసం 1942 లో grow more food scheme క్రింద సాగౌతున్న భూములకైనా పట్టాలు యివ్వమని కలెక్టర్లకు ఆదేశిస్తే చాలవరకు రాష్ట్రములో పోరంబోకుల సాగువిషయంలో అసంతృప్తి తగ్గుతుంది. అందుచేత grow more food scheme క్రింద అభ్యంతరముకాదని పరిగణించిన (unobjectionable గా treat చేసిన) భూములు విషయములో eviction noticeలు, వేలములు, పెనాల్టీలు ఆపుచేయవలసినదని కోరుతున్నాను. కొత్తపేట తాలూకా గంటిపేదపాడు ఎస్టేటు పోరంబోకు బంజర్లను విషయములో చాలాకాలం నుంచి సాగుచేసుకుంటూన్నప్పటికీ భూములనుండి వెళ్ళగొట్టి పంటలను వేలంవేశారు. మూడు సంవత్సరాలనుండి యీ పోరంబోకులు సాగుదార్లకు పట్టాలు ఇవ్వవలసిందని అర్జీలు రెవిన్యూ మంత్రిగారికి సమర్పించుతూవున్న విషయం ప్రభుత్వానికి తెలుసును. అందుచే ఆవిధంగా గంటి బంజరు విషయంలో Tahsildar objection లేదనివ్రాశారు, Deputy Collector వ్రాశారు. జిల్లాకలక్టరు పట్టాయివ్వాలని proposals రెవెన్యూబోర్డుకు పంపించారు. ఐతే కళా వెంకట్రావుగారు ఆరోజు అఖిలభారత కాంగ్రెసుకమిటీ కార్యదర్శిగా ఢిల్లీనుంచి ఒక ఉత్తరం Revenue Boardకు వ్రాస్తూ Collector పట్టా proposals cancel చేయాలని చెప్పారు. ఆ ఉత్తరంకూడా మీదగ్గర ఉన్నది.

THE HON. SRI K. CHANDRAMOULI :—All India Congres Secretary గా వ్రాశారు. మంత్రిగా వ్రాయలేదు.

SRI G. NAGESWARA RAO :—రద్దుచేయాలని పంపించిన తరువాత proposals రద్దుచేసి అప్పటినుంచి objectionable గా treat చేస్తున్నారు. ఐతే ఆ పోరంబోకుసాగు (objectionable) అభ్యంతరమని చెబుతూనే దాంట్లో 4 ఎకరాలు గంటిగ్రామంలో, ఒక political sufferer కు యిచ్చారు. సాగు చేసే హరిజనులకైతే అభ్యంతరమున్నా, అదేభూమి రాజకీయబాధితునికి అయితే అభ్యంతరము లేకుండాను చూచేవిధానము ప్రభుత్వము అవలంబించుతూ వుంది. యీ విధానము ఎంతవరకు న్యాయమో ప్రభుత్వమే ఆలోచించాలి. అందుచేత యీతీర్మానమును యీసవరణతో ప్రభుత్వం అంగీకరిస్తే చాలాన్యాయంగావుంటుంది. అదేమంటే 1942 నుంచి 1945 వరకు grow more food scheme క్రింద సాగు చేయబడిన బంజర్లను యిప్పుడుకూడా unobjectionable గా treat చేసి వాటిని పట్టాలకు యివ్వాలి. అదేవిధంగా poramboke ల విషయంలోకూడా grow [illegible]

more food scheme క్రింద సాగుచేయబడిన భూములకుకూడా యీరోజుపట్టాలు యివ్వాలి. ఈ విధంగా యిచ్చినట్లయితే చాలవరకు యీసమస్యలు పరిష్కారమవు తాయి. గతఅసెంబ్లీ ఆమోదించిన తీర్మానాన్నికూడా అమలుజరిపినట్టవుతుందని నా అభిప్రాయం.

MR. DEPUTY SPEAKER :—All India Congress Secretary గా వున్నప్పుడు వ్రాసినది కాని మంత్రిగావున్నపుడు వ్రాసినదికాదు.

SRI G. NAGESWARA RAO :—అందుచేత యిప్పుడు మిగిలిన పోరం బోకుల విషయం తీసుకోండి. గ్రామాలలో శ్మసానాలకుగాని, కాలిదారికిగాని, drainage కి గాని యీ అవసరాలకుపోను మిగిలినభాగాన్నే ఆయా పేదప్రజలకు యిమ్మంటున్నాం. ఐతే 1949 సంవత్సరం తరువాతకూడా కొన్ని పోరంబోకులు సాగులోకి వచ్చాయి. ఈ భూములుకూడా చాలవరకు అభ్యంతరములేనివే. అయితే ప్రభుత్వము పోరంబోకులసాగు అభ్యంతరమనే రూలును ముక్కుకుసూటిగా అమలు జరుపుతూ నిజంగా ఆసాగు అభ్యంతరము లేకపోయినా అభ్యంతరముగా పరిగణించి penalty లు వేయడము, కేసులుపెట్టడం మామూలుగా సాగిస్తున్నారు. ఆసాగు అభ్యంతరమా కాదా అని సక్రమమైన విచారణ చేయకుండా నే సాగుదార్లను అనేక బాధలకు గురిచేస్తూంది. యింతవరకు సాగులోకితేబడి eviction notice లు జారీ చేయబడిన పోరంబోకుల విషయంలోకూడా అవి నిజంగా అభ్యంతరకరమైతే సాగు అంగీకరించనవసరంలేదు. అవి అభ్యంతరంలేని బంజర్లయితే తప్పకుండా వాటికి ప్రభుత్వంవారు పట్టాలివ్వాలనిచెప్పి కోరుతున్నారు. గ్రామాలలో వున్న యీ పోరంబోకులను Deputy Collector గాని Collector గాని వెళ్లి వాటిసాగు నిజంగా ప్రజలకు అభ్యంతరమా కాదా అనే విషయములో సక్రమమైన విచారణజరిపి తేల్చవలసివుంది. Objection లేదని రుజువయితే అటువంటిభూమి యివ్వడానికి అభ్యంతరం చెప్పనక్కర్లేదు. అభ్యంతరంలేదని రుజువుచేసినా, ప్రభుత్వానికి ఎన్నోసార్లు విన్నవించుకుంటున్నప్పటికీ penalty లు పడుతూనే వున్నాయి. పంట లను వేలంవేస్తూనే వున్నారు. గ్రామాలలో పేదప్రజలకు, హరిజనులకు భూస్వామికవర్గాలు objectionable అనిచెప్పి తప్పుడు రిపోర్టులు పుట్టిస్తూ అనేకకష్టాలకు గురిచేస్తున్నారు. అందుచేత సక్రమమయినవిచారణజరిపి అవి గ్రామప్రజల అవసరాలకు కావలసి వుంటుందని objectionable lands అని రుజువు అయితే అటువంటి పోరంబోకులనుండి తొలగించడానికి మేముకూడా (opposition) అంగీకరిస్తాం. అందుచేత ప్రభుత్వంవారు శంకరయ్యగారి తీర్మానాని ఉన్నదున్నట్టుగా కాకుండా నేను చెప్పిన సవరణలతో అంగీకరిస్తే బాగుంటుందని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

MR. DEPUTY SPEAKER : The discussion will be resumed on the next non-official day. The House will now adjourn and meet again at 11 A.M. on Friday, 2nd December 1955.

The House then adjourned.

*Number of hostels eliminated during* 1954–55 *in pursuance of G.O, Ms. No.* 923, *R.W., dated* 22—7—1953.

*Vide answer to L.A Q, No.* 120. (Starred( at page 30 supra.

1. *Guntur District* :—

   1. Adivasi (Yanadi) Boys Hostel, Ponnur.
   2. Adimavasula Boys Hostel, Chirala.
   3. Gandhi Students Hostel, Bapatla.
   4. Gandhi Adimavasula Students Boarding Home, Gurazala.
   5. Kasturiba Girls Hostel, Bapatla.
   6. Paramemarmurthy Hostel, Ammanabrolu.
   7. R. Ramaiah Harijan Hostel, Macherla.
   8. Suraiahdos Hostel for Boys, Nidubrole.
   9. Yerukala Hostel for Girls, Chirala.
   10. Gandhi Students Hostel for Boys, Bapatla.
   11. Sri Potti Sreeramulu Harijan Balika Hostel, Mangalagiri.

2. *West Godavari District* :—

   1. Gandhi Harijan Industrial Home, Tanuku.
   2. Backward Community Hostel, Palacole.

# STATEMENT NO. I.

## STATE GRANT FOR 1953-54.

Vide answer to items (a) and (b) of L.A.Q. No. 155 (Starred) page 31 supra.

| Serial No. | Name of the District. | No. of Grant to Scheduled Castes pupils in subsidised Hostels. | | No. of grants to Backward pupils classes in subsidised Hostels | | Total grants. | | Remarks |
|---|---|---|---|---|---|---|---|---|
| | | No. | Amount Rs. | No. | Amount Rs. | No. | Amount Rs. | |
| 1. | Anantapur | 525 | 78750 | 66 | 9900 | 591 | 88650 | |
| 2. | Chittoor | 220 | 33000 | 17 | 2550 | 237 | 35550 | |
| 3. | Cuddapah | 266 | 39900 | 25 | 3750 | 291 | 43650 | |
| 4. | East Godavari. | 1122 | 168300 | 95 | 14250 | 1217 | 182550 | |
| 5. | West Godavari. | 1229 | 184350 | 96 | 14400 | 1325 | 198750 | |
| 6. | Guntur | 1878 | 281700 | 219 | 32850 | 2097 | 314550 | |
| 7. | Krishna | 1131 | 179650 | 52 | 7800 | 1183 | 177450 | |
| 8. | Kurnool | 623 | 93450 | 70 | 10500 | 693 | 103950 | |
| 9. | Nellore | 1369 | 205350 | 118 | 17700 | 1487 | 223050 | |
| 10. | Srikakulam | 134 | 20100 | ... | ... | 134 | 20100 | |
| 11. | Visakhapatnam. | 123 | 18450 | ... | ... | 123 | 18450 | |
| | | 8620 | 1293000 | 758 | 113700 | 9378 | 1406700 | |

# STATEMENT NO. II.

STATE GRANT 1954-55.

Vide answer to items 'a' and 'b' of L.A.Q. No. 155 (Starred.)

| Serial No. | District. | No. of Hostels. | Original. | | Additional grants. | | Temporary additional grants for 54-55. | | Total grants | | Amount | Matron grants |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | Scheduled castes | Backward-Classes | Backward-Classes | Scheduled Castes | Backward Classes | Scheduled Castes | Backward Classes | Scheduled Castes | Backward Classes | Rs. |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) |
| 1. | Srikakulam | 7 | 134 | ... | ... | 5 | ... | 139 | ... | 20850 | ... | ... |
| 2. | Visakhapatnam | 6 | 123 | ... | ... | 6 | ... | 129 | ... | 19350 | ... | 150 |
| 3. | East Godawari | 40 | 1135 | 95 | 8 | 3 | 4 | 1138 | 107 | 170700 | 16050 | 1710/10 |
| 4. | West Godawari | 54 | 1222 | 96 | 1 | ... | 8 | 1222 | 105 | 183300 | 15750 | 2635 |
| 5. | Krishna | 40 | 1135 | 52 | 12 | 7 | 16 | 1142 | 80 | 171300 | 12000 | 1585 |
| 6. | Guntur | 71 | 1822 | 221 | 11 | 15 | 4 | 1837 | 236 | 275050 | 35400 | 930 |
| 7. | Nellore | 36 | 1357 | 118 | 7 | 3 | ... | 1360 | 125 | 204000 | 18750 | 855 |
| 8. | Anantapur | 22 | 522 | 64 | 10 | ... | ... | 522 | 74 | 78300 | 11100 | 180 |
| 9. | Guddapah | 15 | 266 | 25 | 4 | ... | ... | 266 | 29 | 39900 | 4350 | 279/3 |
| 10. | Chittoor | 11 | 216 | 17 | ... | 8 | 5 | 224 | 22 | 33600 | 3300 | 60 |
| 11. | Kurnool | 30 | 623 | 70 | 25 | 5 | ... | 628 | 95 | 94200 | 14250 | 349 |
| | | 332 | 8555 | 758 | 78 | 52 | 37 | 8607 | 873 | 31290550 | 130950 | 8733/13- |

## STATEMENT No. III.

### ANTI UNTOUCHABILITY GRANTS FOR WHICH FULL GRANT IS CLAIMED FROM GOVERNMENT OF INDIA.

Vide answer to items (a) and (b) of L.A.Q. No. 155 (Starred).

| Serial No. | District. | Scheduled castes. (8) | Backward Classes. (9) | Forward Community. (10) | Total. (11) | Amount. (12) |
|---|---|---|---|---|---|---|
| 1. | Srikakulam ... | 4 | 7 | ... | 11 | 1,650 |
| 2. | Visakhapatnam. | ... | ... | ... | 2 | 300 |
| 3. | East Godavari | 36 | 14 | 6 | 56 | 8,400 |
| 4. | West Godavari. | 39 | 17 | 8 | 64 | 9,600 |
| 5. | Krishna ... | 50 | 25 | 16 | 91 | 13,650 |
| 6. | Guntur ... | 83 | 43 | 13 | 139 | 20,850 |
| 7. | Nellore ... | 33 | 132 | 30 | 195 | 29,250 |
| 8. | Anantapur ... | 3 | 23 | 32 | 58 | 8,700 |
| 9. | Cuddapah ... | ... | 20 | ... | 20 | 3,000 |
| 10. | Chittoor ... | ... | 39 | 23 | 62 | 9,300 |
| 11. | Kurnool ... | 29 | 36 | 126 | 190 | 28,500 |
| | | 277 | 357 | 254 | 888 | 1,33,200 |

Vide Answer to the Andhra Legislative Assembly Question No. 116 (Starred) by Sri S. Vemayya, M.L.A. at page 8 supra.

| | No. of drinking water wells sunk for Harijans for the year 1954 in the State under R.W. Scheme. | | | | No. of drinking water wells repaired or sunk for Harijans for the year 1954 and the amount spent on them by the H.W. Department. | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | Number of wells. | Amount spent. | | | Under H.W. Dept. | Amount spent. | | |
| | (1) | (2) | | | (3) | (4) | | |
| | | | | | No. of Wells. | | | |
| | | Rs. | A. | P. | | | | |
| 1. Cuddapah | 67 | 52,816 | 14 | 0 | Nil. | Nil. | | |
| 2. West Godavari. | 11 | 18,957 | 0 | 0 | 7 | 11,450 | 0 | 0 |
| 3. Guntur ... | 49 | 33,530 | 0 | 0 | 37 | 21,936 | 0 | 0 |
| 4. Chittoor ... | 26 | 29,998 | 0 | 0 | 4 | 1,330 | 0 | 0 |
| 5. Krishna ... | 7 | 13,525 | 0 | 0 | 4 | 3,625 | 0 | 0 |
| 6. East Godavari. | Nil. | Nil. | | | 31 | 31,864 | 0 | 0 |
| 7. Visakhapatam. | Nil. | Nil. | | | 72 | 41,333 | 0 | 0 |
| 8. Kurnool ... | 7 | 4,993 | 0 | 0 | 14 | 6,776 | 0 | 0 |
| 9. Srikakulam ... | 32 | 30,838 | 0 | 0 | Nil. | Nil. | | |
| 10. Nellore ... | 14 | 14,805 | 0 | 0 | 23 | 14,903 | 0 | 0 |
| 11. Anantapur ... | 28 | 24,251 | 8 | 0 | Nil. | Nil. | | |